# అపరాధ పరిశోధన

రు.3 | సెప్టెంబర్ '77 |

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—45

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## రంగు మారిన ట్రంకు పెట్టె

రచన : వసుంధర

## చావు కవిత్వం

రచన : అజీజ్

## ఆకలి చావు

రచన : గీతారాణి

## వేషగాళ్ళు-మోసగాళ్ళు

రచన : టెంపోరావ్

'శాన్యోరా' సీరియల్-పదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—45
సెప్టెంబర్, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడ్డా రంగారావు

# రంగు మారిన ట్రంకు పెట్టె

వసుంధర

"సూర్యం—నీ గది తాళాలు కావాలిరా." అన్నాడు ఆనంద్.

"ఎందుకు?"

"చిన్న పనుంది. మళ్ళీ సాయంత్రానికి నీకందేలా చూసే బాధ్యత నాది......"

బాగా జనం రద్దీ ఉండే వీధి నానుకుని ఉన్న ఓ ఇరుకు సందులో ఉంటున్నాడు సూర్యం. ఆ సందులో పెద్ద రద్దీ ఉండదు.

సూర్యం బ్రహ్మచారి. ఉదయం తొమ్మిది గంటలకిల్లు వదిలి పెడితే మళ్ళీ రాత్రి ఏడు గంటలకే ఇల్లు చేరతాడతను. అతను పనిచేసే ఆఫీసు ఉదయం పది నుంచి

సాయంత్రం అయిదు వరకూ ఉంటుంది. అందువల్ల ఆ టైములో గది తాళాల అవసరం లేదు.

“అలాగే కానీ, ఆ టైములో ఏ ఆడపిల్లనీ గదికి తీసుకెళ్ళకు. ఏదో పరువుగా బ్రతుకుతున్నాను...” అన్నాడు సూర్యం.

“ఛా_ ఏం చేసినా నీ పరువు పోయే పని చేస్తానా?” అన్నాడు ఆనంద్.

సూర్యం దగ్గర తాళాలు తీసుకుని అతను తిన్నగా బజారుకు వెళ్ళాడు. కాస్త పెద్దసైజు ట్రంక్ కొన్నాడు. ఆ తర్వాత ప్లాస్కు ఒకటి కొన్నాడు. దానినిండా కాఫీ పోయించాడు.

వాటితో సూర్యం గదికి వెళ్ళాడు. అన్నీ లోపల పెట్టాడు.

గది గోడలోకి ఉన్న అలమారా తెరిచాడు. అందులోంచి ఒక కప్పు, సాసరు తీశాడు. అతని జేబులో ఏదో ట్యూబు లాంటిది ఉంది. దాన్ని నొక్కి_వచ్చిన పేస్టుని కప్పు అడుక్కి రాశాడు. ఒక పర్యాయం కప్పులోకి పరీక్షగా చూశాడు. ఏమీ తెలియడంలేదు. సాసరుమీద కప్పు బోర్లించాడు.

ఆ తర్వాత బాత్రూంలోకి వెళ్ళి పేస్టు తగిలిన వ్రేలినీ_ చేతులుకూడా శుభ్రంగా కడుక్కుని బయటకు వచ్చాడు.

గదంతా పరిశీలించి చూశాడు. తృప్తిగా నిట్టూర్చాడు. బయటకు వచ్చి గది తలుపులు తాళం వేశాడు.

## 2

“ఈ వేళ నాకాస్త అర్జెంటు పనులున్నాయి. ఇంటికి రాకపోయినా కంగారు పడవద్దు. అవసరపడితే

ఊరు దాటి వెళ్ళినా ఆశ్చర్యంలేదు. సాధ్యమైనంత వరకూ రాత్రికింటికి వచ్చేయటానికి ప్రయత్నిస్తాను..." అన్నాడు రంగారావు.

"అలవాటే కదా, వెళ్ళి రండి." అంది రాజేశ్వరి.

రంగారావు ఊళ్ళో చిన్న ఫ్యాన్సీ దుకాణముంది. కానీ నిజానికతని అసలు వ్యాపారం అది కాదు. అతను స్మగ్లర్. లేపు రికార్డర్ల దగ్గర్నుంచి వజ్రాలదాకా అన్ని రకాల వస్తువులూ అతనిద్వారా స్మగుల్ అవుతూంటాయి. కానీ ఈ సంగతి మామూలుగా గ్రహించడం కష్టం. అతనిది సామాన్యమైన ఫ్యాన్సీ షాపు.

రంగారావు సామాన్యుల మధ్య అతి సామాన్యంగా జీవిస్తున్నాడు. అతని ఆస్తి కనీసం కొన్ని లక్షలుంటుంది. కానీ అంతా నల్ల ధనం. దానిని తెల్లబర్చడానికి—ఎవరికైనా లాటరీవస్తే ఎక్కువ డబ్బిచ్చి కొందామని చూస్తున్నాడు—ఇంకా అలాంటి అవకాశం రాలేదతనికి.

రాజేశ్వరి చాలా అందంగా ఉంటుంది. భర్త చేసే వ్యాపారం ఆమెకు తెలిసినా, ఆమె నోట్లో నువ్వు గింజ నానింది. ఆదాయరీత్యా భర్తంటే ఆమెకు ఇష్టమే. ప్రమాదాలున్నా ఫరవాలేదని ఆమె అనుకుంటోంది కానీ భర్త ప్రమాదంలో ఇరుక్కునేలోగా తన నల్ల ధనం తెల్లగా మారాలని ఆమె కోరుకుంటోంది.

రంగారావింట్లోంచి బయటపడి వీధిలోకి వచ్చాడు. వీధిలోంచి బజారు దారి పట్టాడు. అతను బజార్లో నాలు గడుగులు వేశాడో లేదో అతని భుజంమీద ఎవరిదో చేయి పడింది. వెనక్కు తిరిగి చూసి "నువ్వా ఆనంద్—" అన్నాడు.

ఆనంద్ రంగారావుకి తెలుసును. అప్పుడప్పుడు స్మగ్లింగ్‌లో ఆనంద్, రంగారావుకి సహాయం చేస్తూంటాడు. ఆనంద్ కూడా సామాన్యుడిలా సంచరిస్తూ ఇంకా పట్టుబడని చిల్లర నేరస్థుడు. కానీ ఇంకా అట్టే సంపాదించలేదు. ఏవో ఖర్చులు వెళ్ళిపోతున్నాయి.

“ఎవరికో లాటరీ టికెట్ కావాలన్నావు గదా. ఎక్కువ డబ్బిచ్చి కొనుక్కుంటారన్నావు గదా– ఆ అవకాశం వచ్చింది. నా గదికి వస్తే వివరాలు మాట్లాడుకో వచ్చు–” అన్నాడు ఆనంద్.

“ఎక్కడ నీ గది?”

“దగ్గర్లోనే ఉంది. పద...”

ఇద్దరూ త్వరగా అడుగులు వేశారు. పది నిముషాల్లో సూర్యం గది వచ్చింది. ఆనంద్ జేబులోంచి తాళం తీసి గది తలుపులు తెరచి రంగారావు లోపల వచ్చేక మళ్ళీ తలుపులు వేసేశాడు.

ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చున్నాక—ఆనంద్ టేబుల్ మీద సాసర్లో బోర్లించిన కప్పు తీసి, అందులో ప్లాస్కులోంచి కాఫీ పోశాడు. అలమారా తెరిచి ఇంకో కప్పు తీసి అందులో కూడా కాఫీ పోశాడు. అది తను తీసుకుని టేబిల్ మీద కప్పు రంగారావుకి ఆఫర్ చేశాడు.

రంగారావు కాఫీ సిప్ చేసి, “చాలా బాగుంది. నువ్వే చేశావా?” అన్నాడు.

“కాదు. ఎల్లయ్య... అన్నాడు ఆనంద్ నవ్వుతూ.

“వాడెవడు?”

“భారత్ రెస్టారెంట్లో సర్వర్–” అన్నాడు ఆనంద్.

రంగారావు ఇంకో గుక్క తాగి నవ్వాడు. నవ్వు

తూంటే అతనికి వెక్కు వచ్చింది. తమాయించుకుని ఇంకో గుక్క తాగాడు. మళ్ళీ వెక్కు వచ్చింది.

“కాఫీ చాలా బాగుంది. కానీ నాకే ఏదోలాగుంది.” అన్న రంగారావుకు మరి మాట పెగలలేదు. అతని చేతులు వణుకుతున్నాయి. ముఖంలో ఏదో అనుమానం తొంగి చూస్తోంది.

తనూ ఇంకో గుక్క కాఫీ తాగి, “ఏమయింది?” అంటూ లేచాడు ఆనంద్. అతను రంగారావు చేతిలోని కాఫీ కప్పు తీసి బల్లమీద పెట్టాడు.

మరో నిముషంలో రంగారావు తల వాల్చేశాడు. ఆనంద్ చేయి జాపి అతని ముక్కు దగ్గర వేలుపెట్టి చూశాడు. తృప్తిగా తలాడించాడు. రెండు కాఫీ కప్పులూ బాత్రూంలోకి తీసుకు వెళ్ళాడు. కాఫీ పార బోసి శుభ్రంగా కడిగేశాడు. బాత్రూంలో కాఫీ ఛాయలు మిగలకుండా చేశాడు.

ఫ్లాస్కులో ఇంకా కాఫీ ఉంది. తాపీగా తాగేసి ఫ్లాస్కు కూడా శుభ్రపరిచేశాడు. మళ్ళీ రంగారావు దగ్గరకు వెళ్ళాడు.

ట్రంక్ తెరిచి రంగారావుని జాగ్రత్తగా అందులో సర్దాడు. మళ్ళీ ట్రంక్ మూసి ఓసారి బరువు టెస్ట్ చేశాడు. “చాలా బరువున్నాడు_” అనుకుని నవ్వుకున్నాడు.

మళ్ళీ ట్రంక్ తెరిచాడు. అతని జేబులన్నీ తడిమాడు. ఏవో కాగితాలతోపాటు తాళాలుకూడా దొరికాయి. అతని కళ్ళు మెరిశాయి. మళ్ళీ ట్రంక్ మూసేశాడు. ఓ పర్యాయం గది వంక చూశాడు. తను రాక మునుపు గది

ఎలాగుండో మళ్ళీ అలా తయారు చేశాడు. ప్లాస్క్ భుజానికి తగిలించుకుని బయట కెళ్ళాడు. తిన్నగా టాక్సీ స్టాండుకు వెళ్ళి తనకా్కవలసిన వ్యక్తి కోసం చూశాడు.

"హలో సార్ —" అంటూ పలకరించాడు ఒకతను.

"సింహాచలం—" అన్నాడు ఆనంద్.

"మళ్ళీ ఏదైనా పని తగిలిందాండీ. ఇలా వచ్చారు."

ఆనంద్ నవ్వి జేబులోంచి ఓ వందరూపాయల నోటు తీసి సింహాచలానికిచ్చి "పనంటే పనే ఓ రెండు మూడు గంటలు నీ టాక్సీ నాకా్కవాలి" అన్నాడు.

సింహాచలం నోటు అందుకుని తాళాలు తీసి ఆనంద్ కి అందించాడు. వాళ్ళిద్దరికీ అది అలవాటే. ఆనంద్ నేరస్థుడని సింహాచలానికి తెలియదు. మంచివాడనీ, తక్కువ అవసరానికి ఎక్కువ డబ్బిస్తాడనీ మాత్రం అతనికి తెలుసు.

ఆనంద్ టాక్సీ ఎక్కి నెమ్మదిగా పోనిచ్చాడు. సందు ముందు టాక్సీ ఆపాడు. సందు ఇరుగ్గా ఉన్నా టాక్సీ వెడుతుంది కానీ కాస్త ఇబ్బంది అవుతుంది. అదీగాక నలుగురినీ ఆకర్షించినట్లవుతుంది. అందుకని అతను టాక్సీని మరి లోపలకు పోనివ్వకుండా నడుచుకుంటూ సూర్యం గదికి వెళ్ళి ప్లాస్కు భుజానికి తగిలించుకునే ట్రంకు బయటకు తెచ్చాడు. గది తలుపు తాళం వేసేశాడు.

ఒక్కడూ ట్రంకు మోయడం కాస్త కష్టమే అయింది. ఎలాగో అతి కష్టంమీద దాన్ని మోసుకుని టాక్సీ డిక్కీలో వేశాడు. అతని అవస్థను రోడ్డుమీద పోతున్న ఒకరిద్దరు గమనించారు కానీ అడగనిదే మన కెందుకని సాయం ఆఫర్ చేయలేదు.

డిక్కీ మూసి టాక్సీ ఎక్కాడు. టాక్సీ స్టార్టు చేశాడు.

పది నిముషాల్లో టాక్సీ ఊరి పొలిమేర చేరుకుంది. అక్కడ్నించే తనకు తెలిసినట్లుగా కొత్తదారితో కాడు ఆనంద్. గంటకు అరవై కిలోమీటర్ల వేగంతో సుమారు అర్ధగంట ప్రయాణంచేసి టాక్సీని ఓ పక్కగా ఆపాడు.

రోడ్డుకు సుమారు వంద గజాల దూరంలో ఒక పెద్ద గొయ్యి ఉంది. ఆనంద్ వెళ్ళి ఆ గోతిలోకి తొంగి చూశాడు. చాలా లోతుగా ఉంది. కాకతాళీయంగా రెండ్రోజుల క్రితం దాన్ని చూసి గుర్తు పెట్టుకున్నాడు ఆనంద్.

టాక్సీ దగ్గరకు వెళ్ళి ట్రంకు మోసుకు వచ్చాడు. ట్రంకులోని రంగారావును బయటకు లాగాడు. నెమ్మదిగా ఆ శవాన్ని గోతిలో పడవేశాడు. చాలా లోతుగా ఎక్కడో పడ్డ శబ్దమైంది.

ఆనంద్ ట్రంకుని చులిపి- "అమ్మయ్య-ఇప్పటికి తేలికైంది-" అనుకున్నాడు. ఒక్క క్షణం తటపటాయించాడు- ఆ గోతిని మూయాలా అవసరంలేదా అని. కానీ జాప్యం చేయడం అతనికిష్టంలేదు. ట్రంకుని మళ్ళీ తీసుకు వెళ్ళి డిక్కీలో పారవేసి టాక్సీ ఎక్కాడు.

అతని ఊహలో ఏమాలోచనలున్నాయో చెప్పడం కష్టం. కానీ మనిషి మాత్రం చాలా ఉత్సాహంగా ఉన్నాడు. అక్కడినుంచి టాక్సీ తిన్నగా ఊళ్ళోకి వెళ్ళింది. ఒక పెయింటింగ్ దుకాణంముందు టాక్సీ ఆపి, ట్రంకు తీసి దుకాణంలోకి తీసుకువెళ్ళి, "ఇది కొత్త ట్రంకు. పెయింట్ కొద్దిగా దెబ్బతింది. దీనిమీద మరేదైనా కలర్ పెయింట్ చేయగలరా?" అనడిగాడు.

దుకాణదారు శ్రద్ధగా ట్రంకుని గమనించి, సాధ్య

పడుతుందన్నట్లుగా తలాడించి తనదగ్గరున్న కలర్ చార్టు ఒకటి ఇచ్చాడు. ఆనంద్ ఒక రంగు సెలెక్ట్ చేసుకున్నాడు.

ఆ షాపునుంచి ఆనంద్ టాక్సీ స్టాండుకి వెళ్ళి సింహాచలానికి టాక్సీ తిరిగిచ్చేశాడు. ఆ తర్వాత సూర్యం ఆఫీసుకు వెళ్ళి అతని తాళాలు తిరిగిచ్చేశాడు.

# 3

"ఎవరూ?" అంది రాజేశ్వరి.

జవాబుగా మరోసారి తలుపు చప్పుడైంది.

రాజేశ్వరి చిరాగ్గా తలుపు దగ్గరకు వచ్చి డోర్ వ్యూ లోంచి చూసింది. బయట ఉన్న వ్యక్తి ఆమెకు సుపరిచితుడే. సందేహించకుండా తలుపు తీసి, "ఆయనింట్లో లేరండీ ఆనంద్ గారు" అంది.

ఆనంద్ నవ్వుతూ– "నాకు తెలుసు..." అన్నాడు.

రాజేశ్వరి కంగారు పడుతూ– "బహుశా ఈ రోజుకు రానన్నారు. వారం పదిరోజులదాకా రాకపోయినా ఆశ్చర్యం లేదన్నారు..." అంది.

ఆనంద్ ఇంకా నవ్వుతూనే, "అసలు రాకపోయినా ఆశ్చర్యపోనవసరంలేదు" అన్నాడు.

రాజేశ్వరికి అర్థంకాలేదు. అయోమయంగా అతనివంక చూసింది. అయితే ఆమె చూపులతో కలసిన అతని చూపులు రోజూలాలేవు. ఏదోలాగున్నాయి.

తన భర్త మిత్రుడిగా ఒక మంచి మనిషిగా ఆనంద్ ఆమెకు తెలుసును. ఆ మంచి మనిషి చాలా పర్యాయాలు తనింటికి రావడం జరిగింది గానీ ఈ రోజు చూస్తున్న చూపులు చూడడం ఇంతవరకూ ఇదే ప్రథమం.

ఆనంద్ నవ్వునాపి– "ఒక విధంగా నేను చాలా అదృష్టవంతుడిననుకుంటాను..."

రాజేశ్వరి మౌనంగా వింది కానీ మాట్లాడలేదు. అతని అదృష్టం గురించి తెలుసుకోవాలని కూడా ఆమెకు కుతూహలంగా లేదు. ఆనంద్ చెప్పుకుపోతున్నాడు.

అందాన్ని ప్రేమించడం మగవాడి అలవాటు. అందమైన ఆడది ఎవరో ఒక మగవాడి సొత్తు కావడం సంప్రదాయం. ఆపైన ఆ ఆడదాన్ని ఆడదాన్నిగా చూడడం మరో మగవాడి తప్పు. తప్పులు చేయకపోవడం ఆనంద్ బలహీనత. ఈ కారణంగా అతనింతకాలమూ తన మనసు హరించుకుపోయిన రాజేశ్వరిని దూరాన్నించి చూస్తూ గుటకలు మింగుతూ వచ్చాడు. కానీ ఈ రోజు ఆ అవసరం తప్పిపోయింది.

సంభాషణ ఈ రకంగా సాగడం నచ్చకపోయినా, "ఎందువల్ల?" అనడిగింది రాజేశ్వరి.

"నీ భర్త అసలు రంగు ఈ రోజు బయటపడింది..." అన్నాడు ఆనంద్.

రాజేశ్వరి ఉలిక్కిపడి– "అంటే?" అంది.

"రంగారావు నిన్ను చంపాలనుకుంటున్నాడు. ఈ రాత్రికే నిన్ను హత్య చేయడానికి ఏర్పాట్లు చేశాడు. అది తెలియడంతోనే నా మనసుండబట్టలేదు. నిన్ను దక్కించుకుని పారిపోవాలనుకుంటున్నాను..." అన్నాడు ఆనంద్ త్వరగా.

"ఆయన నన్ను చంపడమెందుకూ?" అంది ఆశ్చర్యంగా రాజేశ్వరి.

"అతను మకాం మార్చదలుచుకున్నాడు. ఇక్కడ

అతనికి చాలా కష్టంగా ఉన్నట్లుంది. విశాఖపట్నంలో ఒక మాధ్య తరగతి అమ్మాయిని పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాడు. అక్కడ మళ్ళీ కొత్త జీవితం ప్రారంభిస్తాడు. అందుకోసం నిన్నంతం చేయదల్చుకున్నాడు.''

''నేను నమ్మను...''

''నమ్మకపోతే ఈ రాత్రికే చస్తావ్. నమ్మితే ఇప్పుడే నాతో వచ్చేయ్. ఈ ఊరు వదిలి పోదాం...'' అన్నాడు ఆనంద్.

''నేను రాను. ఆయనమీద నాకు నమ్మకముంది. చావంటే నాకు భయంలేదు_'' అంది రాజేశ్వరి.

''అయితే నేను వెడుతున్నాను. కానీ కాస్త జాగ్రత్తగా ఉండు...'' అని వెళ్ళిపోయాడు ఆనంద్.

## 4

రాజేశ్వరి ఆశ్చర్యపడింది. ఎవరో తన నోట్లో బలవంతంగా ఏదో పోసి వేశారు. తన రెండు చేతులు కట్టివేయబడి ఉన్నాయి. నోరు మూసేశారు. గిలగిలా తన్నుకున్నా ఏమీ ప్రయోజనం కనపడలేదు. ఆమె కన్నులు మూతపడుతున్నాయి. ఆలోచనాశక్తి నశిస్తోంది. అలా ఆమె అచేతనంగా ఉండిపోయింది.

ఆమెకు మెలకువ వచ్చేసరికి ఎవరో తలుపు తడుతున్నారు. కదలడానికి ప్రయత్నించిందామె. చేతులు ఫ్రీగానే ఉన్నాయి. చటుక్కున మంచంమీంచి లేచి_ పడకగది కిటికీ తలుపులు తీసింది. గదిలోకి బాగా వెలుతురు వచ్చింది.

'బాగా పొద్దెక్కిందన్నమాట_' అనుకుందామె.

ఎవరో ఇంకా తలుపులు బాదుతున్నారు_ ''అఁ అఁ''

అంది రాజేశ్వరి. తలుపులు బాదడం ఆగింది.

త్వరగా బట్టలు సవరించుకుందామె.

అప్పుడే ఆమె మంచంమీదున్న ఒక కాగితాన్ని చూసింది. అది ఒక ఉత్తరం. రంగారావు నిన్నటి ఉదయం బయటకు వెళ్ళేటప్పుడు జేబులో పెట్టుకున్నాడు. ఇప్పుడింట్లోకి ఎలా వచ్చింది? అంటే ఆయన రాత్రి ఇంటికి వచ్చారన్నమాట.

ఖచ్చితంగా ఆయన వచ్చి ఉండాలి. ఎందుకంటే కిటికీ తలుపులతో సహా అన్ని తలుపులూ తను బంధించేసింది. వీధి తలుపు దగ్గరగా వేస్తే ఆటోమేటిక్‌గా వేసుకుపోయే మోడల్. ఒక తాళం ఎప్పుడూ తన బొడ్లోనూ-మరో తాళం ఆయన జేబులోనూ ఉంటుంది. ఆ తాళం లేకుండా ఎవరైనా ఇంట్లోకి రావడం అసాధ్యమని చెప్పవచ్చు.

మళ్ళీ తలుపులమీద చప్పుడు. రాజేశ్వరి పరుగులాంటి నడకతో అక్కడకు వెళ్ళింది. తలుపు తీసేటప్పుడామె గమనించింది. గుమ్మందగ్గర పడి ఉన్న తాళాల గుత్తిని.

అది రంగారావు తాళాల గుత్తి. హడావుడిలో రంగారావు వెళ్ళేటప్పుడు దీన్ని గుమ్మందగ్గర పారవేసుకున్నాడన్నమాట.

లోపలకు ఆనంద్ వచ్చి- "అమ్మయ్య- క్షేమంగానే ఉన్నావన్నమాట. అఫ్‌కోర్స్, అన్ని ఏర్పాట్లూ పకడ్బందీగా చేసినప్పుడు క్షేమంగా ఉండకపోతే ఏమవుతావులే" అన్నాడు.

"నువ్వనేదేమీ నాకర్థం కావటంలేదు" అంది రాజేశ్వరి.

"రంగారావు నన్ను విషం అడిగాడు. ఎందుకంటే కారణం చెప్పాడు. అలాగేనని నేను విషానికి బదులు మత్తుమందులాంటి దిచ్చాను. నామీద అతనికి బాగా నమ్మకముంది. అది నీ నోట్లో వేసి నువ్వు చచ్చావనుకుని ఇంట్లో ఉన్న విలువైనవన్నీ ఇందులోనే ఉన్న రహస్య స్థలంలోకి మార్చేసి వుంటాడు. నాలుగైదు రోజులదాకా ఇక్కడికి రాడు. ఆ తర్వాత వచ్చి ముసలి కన్నీళ్ళు కార్చి నెమ్మదిగా తన డబ్బు తీసుకుని ఈ ఊరు వది లేస్తాడు. అదీ కథ."

రాజేశ్వరి కళ్ళు ఎర్రబడ్డాయి. తనమీద ఇంత మోసాన్ని తలపెట్టినందుకు భర్తమీద ఆమెకు విపరీత మైన కోపం వచ్చింది. ఆనంద్ తృప్తిగా ఆమె ముఖ భావాలు చదువుతూన్నాడు.

"ఇంత అన్యాయమా? కట్టుకున్న భార్యను..." ఆవే శంలో ఆమెకు నోట మాట రాలేదు.

"ఇందు కొక్కటే ప్రతీకారం. ఏదో వంక చెప్పి ఈ రోజే మనమీ ఇల్లు కాళీ చేసేద్దాం. ఇంట్లో ఉన్న విలువైన వస్తువులెక్కడున్నదీ నీకు తెలిస్తే అవి తీసుకుని రంగారావు కనుక్కోలేని చోటికి వెళ్ళిపోదాం. నీవు నా ఆరాధ్య దేవతవు. ఇద్దరం హాయిగా జీవితం గడిపివేద్దాం. నా అన్నవాళ్ళెవరూ ఇంక నాకూ లేరు. నీకూ లేరు. ఒకరికొకరం తోడుగా..."

"పద. ముందు రహస్య స్థలంలోని వస్తువులు తీసు కుందాం" అంది రాజేశ్వరి. రాత్రి ఓ ఆగంతకుని చేతిలో ప్రాణభయంతో గిలగిలలాడడం తలుచుకుంటే ఆమె ఆపాదమస్తకమూ వణికిపోతోంది. ఆనంద్ తనని

ప్రేమించి రక్షించి ఉండకపోతే ఈపాటికి తనెక్కడ ఉండేది!

ఆనంద్ ఊహలు వేరుగా వున్నాయి. రాత్రి రాజేశ్వరికి స్పృహ తప్పించాక అతను వజ్రాల గురించి ఇల్లంతా వెదికాడు. ఎక్కడా ఏమీ దొరకలేదు. అవి ఎక్కడో రహస్య స్థలంలో దాచబడి ఉండాలని అతనికి తోచింది. ఎలాగూ తనకు ప్రయోజనంలేని తాళాలతను. రాజేశ్వరి అనుమానాలను పెంచేటందుకు కీలుగా వీధి గుమ్మంవద్ద పడవేశాడు. ఇప్పుడు రాజేశ్వరికా రహస్య స్థలం తెలుసునంటోంది కాబట్టి వనిత, విత్తం-రెండూ దొరికినట్లే భావించాలి.

గోడలోకే ఉన్న ఓ అల్మారా అట్టడుగులా కనబడుతున్నది—నిజానికి ఒక ప్రత్యేకమైన అర. అందులో ఉన్న వస్తువులు చూస్తూంటే ఆనంద్‌కి కళ్ళు చెదిరిపోయాయి. ఆ వస్తువులనుంచి దృష్టి మరల్చి రాజేశ్వరి వంక చూస్తే అతని కళ్ళు మళ్ళీ చెదిరాయి.

అతనామెను చటుక్కున కౌగలించుకోబోగా, ఆమె వారించి "ఉష్ ఇప్పుడు కాదు" అంది.

## 5

"చాలా పెద్ద ట్రంకు తెచ్చావ్. దేనికి?"— అంది రాజేశ్వరి.

"ఇది మునుపు మనముండే ఊరినుంచి తెచ్చాను. ఇదివరలో దీని రంగు వేరే ఉండేది. ఇప్పుడు కొత్త రంగు వేయించాను. ఎలా ఉంది?"

"బాగానే ఉంది కానీ రంగు మార్పించడం దేనికి? దీన్నా ఊర్నించి తీసుకు రావాల్సినంత అవసరమే

మొచ్చింది?" అంది రాజేశ్వరి.

"పాత రంగు పాడయిందని కొత్త రంగు వేయించాను. ఒకసారి షాపులో రంగు వేయమని ఇచ్చాక అది మళ్ళీ మనం కలెక్ట్ చేసుకోకపోతే ఎలా. అందుకని ఆ ఊరు వెళ్ళి ట్రంకు తీసుకుని వచ్చాను..." అన్నాడు ఆనంద్.

"చాలా బాగుంది. మనిషి పట్టేంత ఉంది..." అంది రాజేశ్వరి దాని సైజు చూచి ఆశ్చర్యపడుతూ.

ఆనంద్ దానిని పడకగదిలోకి తీసుకు వెళ్ళాడు. అక్కడ మంచం క్రింద తోసేసి, "ఈ పెయింట్ కలకాలముంటుందని ఆశిస్తున్నాను. దీన్ని వాడాలని నాకు లేదు. వాడితే మళ్ళీ రంగు మార్పించాలి గదా" అన్నాడు రాజేశ్వరితో.

"బాగుంది. వాడినప్పుడల్లా రంగు మార్చాలేమిటి?"_ అంది రాజేశ్వరి అతని వంక అదోలా చూస్తూ. అతను చటుక్కున రాజేశ్వరిని దగ్గరగా లాక్కుని_"మార్పులో అందముంది రాజూ. చీర మార్చినప్పుడల్లా ఓ కొత్త అందం నీలో కనిపిస్తుంది" అన్నాడు.

తన్మయంగా కళ్ళు మూసుకుంది రాజేశ్వరి. ఆమెకు ఆనంద్ నచ్చాడు. అతను నిజంగానే ఆమెను ఆరాధిస్తున్నాడు. రంగారావు తన పట్ల చాలా బాధ్యతలు నిర్వర్తించేవాడు కాదు.

ప్రస్తుతం రాజేశ్వరికి రోజులు బాగా వెళ్ళిపోతున్నాయి. బయటకు కనపడకపోయినా చీకూ చింతా లేకుండా ఏ బాదరబందీ లేకుండా దర్జాగా జీవితం వెళ్ళబుచ్చుతున్నా రిద్దరూ. ప్రస్తుతం వాళ్ళు విశాఖ

పట్నంలో ఉంటున్నారు. వాళ్ళుంటున్న ఇంట్లో అల మారాలో రంగారావు చేసిన విధంగానే ఒక రహస్యపు అర ఏర్పాటు చేసుకున్నారు.

ఆనంద్ నేరాలు చేయడంలేదు గానీ తన దగ్గరున్న విలువైన వజ్రాలు క్యాష్ చేయడానికి ప్రయత్నిస్తు న్నాడు. అయిదారు లక్షల రొక్కం అతనివద్ద చేరింది. దానిని బ్యాంకు డిపాజిట్లరూపంలో మార్చాలని చూస్తు న్నాడు. హఠాత్తుగా ఇంత డబ్బెక్కడిదని ఎవరూ తన మీద అనుమానపడకూడదని అతని ఆశయం.

ప్రస్తుతం అతనుంటున్న ఇల్లు అన్ని సదుపాయాలూ కలిగి ఉంది. సామాన్యమైన ఇరుగూ పొరుగూ ఉంటు న్నారు. అటూ ఇటూ కొత్తగా పెళ్ళయిన జంటలే ఉన్నాయి. ఒక పక్కగా ఉన్న జంటలోని కుసుమ చాలా అందంగా ఉంటుందన్నాడని ఆనంద్ పైన రాజే శ్వరి అలిగింది కూడా.

కుసుమ భర్త వెంకట్రావు ఏదో బ్యాంకులో పని చేస్తున్నాడు. నెలకు ఆరేడొందలు సంపాదించుకుంటు న్నాడు. అతనికీ ఆనంద్ కూ కాస్త మంచి పరిచయమే ఉంది. వెంకట్రావుతో ఆనంద్ పరిచయం పెంపొందించు కోడానికి కుసుమే కారణమని అప్పుడప్పుడు రాజేశ్వరి ఆనంద్ ని ఎత్తి పొడుస్తూంటుంది.

ఆమె ఎత్తిపొడుపుల మాటెలాగున్నా ఆనంద్ దృష్టి తరచుగా కుసుమమీద పడుతూండేది. అతని దృష్టిని కుసుమ గమనించిందో లేదో తెలియదు కానీ ఆమె అతని కళ్ళలోకి కళ్ళు కలిపేది కాదు. ఆనంద్ మాత్రం విడవ కుండా తన ప్రయత్నాల్లో తనున్నాడు.

ఒక రోజు కుసుమ ఉల్లిపాయలకోసమని ఆనంద్ ఇంట్లోకి వచ్చింది. ఆ సమయానికి రాజేశ్వరి బాత్రూంలో ఉంది.

"రాజేశ్వరి స్నానం చేస్తోంది" అన్నాడు ఆనంద్.

"రెండుల్లిపాయలు కావాలి" అంది కుసుమ వంచిన తల ఎత్తకుండా.

తన పరిసరాల్లో కుసుమ ఉంటే ఆనంద్ శరీరం పులకరించిపోయింది. అతను హడావుడిగా వెతికి నాలుగుల్లిపాయలు తీసి కుసుమకందించాడు. ఆ సమయంలో ఆమె వెనుదిరుగబోతూండగా చటుక్కున చెయ్యి పట్టుకున్నాడు. అతని చేయి వణుకుతోంది. మనసు భయపడుతోంది.

"ఇంట్లో ఆయనున్నారు..." అంది కుసుమ. సుతారంగా అతని చేయి విడిలించుకుని అక్కణ్నించి వెళ్ళిపోయింది.

ఆమె సమాధానం ఆనంద్ మనసుకు పులకరింత కలిగించింది.

# 6

"ఎవరూ?" అంది కుసుమ.

"నేను—" అన్నాడు ఆనంద్.

కుసుమ తలుపులు తీసింది. "ఆయనింట్లో లేరు..." అంది భయంగా.

"తెలుసు. మా ఆవిడకూడా ఇంట్లో లేదు..."

"ఎక్కడికి వెళ్ళారు?"

"మేట్నీ షోకి వెళ్ళింది. నాకు తల నొప్పిగా ఉండియింట్లో వుండిపోయాను. తనకు మహా సినిమాల పిచ్చి."

"మీకు ఏ పిచ్చి లేదా?"

"ఉంది."

"ఏమిటది?"

"కుసుమ పిచ్చి..." అంటూ నవ్వాడు.

"మీకు కుసుమ పిచ్చి కాదు..." అంటూ నవ్వింది కుసుమ.

"మరి___"

"ఆడవాళ్ళ పిచ్చి..."

"కావచ్చు. అదే నిజమైతే నా దృష్టిలో ఉన్న ఏకైక ఆడది కుసుమ."

"ఎంత ధైర్యం మీకు. పరాయి ఆడదాన్ని - అందులోనూ పెళ్ళయినదాన్ని పట్టుకుని... ఇలాంటి మాటలంటారు?"

ఆనంద్ నవ్వి, "ఇదివరలో మా ఆవిడ సినిమా హాల్లోనూ, మీ ఆయన బ్యాంకులోనూ మీరు నేనూ ఒక తలుపు అడ్డంలోనూ ఉండడం చాలా సార్లు జరిగింది కానీ తలుపు తట్టి నా కుసుమను పిలిచే ధైర్యం నిన్న నువ్వు ఉల్లిపాయలకు వచ్చినప్పుడే కలిగింది. అంతవరకూ నువ్వు నాకందవేమోనని భయపడ్డాను" అన్నాడు.

"నేనూ మీ గురించి అలాగే అనుకున్నాను. మీరు చేయి పట్టుకోగానే ఆశ పుట్టి ప్రోత్సహించాలనిపించింది" అంది కుసుమ.

ఆమె మాటల కాశ్చర్యపడి ఆనంద్ ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు. ఆమె కళ్ళలో విపరీతమైన కాంతి కనపడుతోంది. ఆమె అందానికా కాంతి వన్నె తెచ్చింది. ఆ వన్నెలు ఆనంద్ ని ఉద్రేకపరిచాయి. అతను

చేటుక్కున ఆమెను బలంగా కౌగలించుకున్నాడు. ఆమె చుబుకం పైకెత్తి పెదవులను చుంబించాడు. క్షణాలలో ఇద్దరిలోనూ ఆవేశం మరిగింది.

కుసుమ నడుంపైన చేయి వేసి తన పడకగదిలోకి ఆనంద్ నడిపించనున్న సమయంలో ఎవరో ఇంటితలుపు తట్టారు. ఆనంద్‌కు ఎక్కడలేని చిరాకూ వచ్చింది. కుసుమ అతన్ని విడిపించుకుని తన ఇంట్లోకి పరుగెత్తి తలుపు వేసుకుంది.

"ఎవరూ?" అని అరిచాడు ఆనంద్.

"నేను. రాజేశ్వరిని."

అతని ఆవేశం చల్లారిపోయింది. వెళ్ళి తలుపు తీసి, "సినిమాకు వెళ్ళలేదా?" అన్నాడు.

"ఏం సినిమా. జనం కొట్టుకు చస్తున్నారు. బ్లాకులో రెండ్రూపాయల టికెట్టు పదిరూపాయలదాకా వెళ్ళిపోయింది..."

"అయినా కొనేసుకోవలసింది..."

"సరేలే. అవతల నువ్వు తలనొప్పితో బాధపడుతూంటే ఎనిమిది రూపాయలు ఎక్స్‌ట్రాగా తగలేయనా. సినిమాకు తొందరేముంది. ఇంకోరోజు చూడొచ్చు..." అంది రాజేశ్వరి ఆప్యాయంగా ఆనంద్‌ని చూస్తూ.

'ఎనిమిది రూపాయలు ఆదా చేశాననుకుంటున్నావు. కానీ నాకు ఎనిమిదివేల రూపాయల అవకాశం పోయింది. కుసుమ లభించడం మామూలు మాటలా?' అనుకున్నాడు మనసులో ఆనంద్.

# 7

"అన్నట్లు చెబుదామనుకుని మరిచిపోయాను. మన ట్రంకు వెంకట్రావుగారికిచ్చాను" అంది రాజేశ్వరి.

"ఎందుకూ?" అన్నాడు ఆనంద్.

"ఎందుకో నాకేం తెలుసు? ఆయన అడిగాడు. ఇచ్చాను."

"ఎప్పుడడిగాడు."

"పొద్దున్నే సిగరెట్లు తెచ్చుకోవడానికి నువ్వెలా వెళ్ళావు. వెంకట్రావు గారిలా వచ్చి ట్రంకు అడిగాడు..."

"ఆయనకు మనింట్లో ట్రంకు ఉందని ఎలా తెలుసు?"

"నువ్వు తెచ్చినపుడు చూశాడట. అంత పెద్ద ట్రంకు చూసి ఆశ్చర్యపడ్డాడట. కానీ ఇప్పుడాయనకే అవసర పడిందట..."

ఆనంద్ ఉలిక్కిపడి, "ఏమిటో ఆ అవసరం..." అన్నాడు.

"ఏమో మరి... కుసుమకోసమా అనుకుంటే నిన్న రాత్రి బండికామె పుట్టింటికి వెళ్ళిపోయింది. అప్పుడవ సరం ఇప్పుడెందుకు వచ్చిందో..."

కుసుమ పుట్టింటికి వెళ్ళిందనగానే ఆనంద్‌కి నిరు త్సాహం కలిగింది. అనుభవానికి అతి చేరువలోకి వచ్చి అందకుండా వెళ్ళిపోయింది కుసుమ.

"మళ్ళీ ఎప్పుడొస్తుందో—"

"అది నీకెందుకు. ఆయన పడాల్సిన బాధ..." అంది రాజేశ్వరి చిరాగ్గా.

తన బాధేమిటో ఆనంద్, రాజేశ్వరికి చెప్పాలేడు. ఆయాచితంగా లభించే అందమైన ఆడది అనుభవానికి దొరక్కుండానే పోయింది.

ఒకటి రెండ్రోజులయేక కాబోలు ఆనంద్ ఉన్న సమయంలోనే ట్రంకు తీసుకుని వెంకట్రావు వాళ్ళింటికి వచ్చాడు.

"మీ ట్రంకు మీకు తిరిగిచ్చేస్తున్నాననుకోండి. కానీ చిన్న తప్పుకు క్షమించాలి. వాడడంలో ట్రంకు పెయింట్ కొద్దిగా దెబ్బతింది. అందుకని కొత్తగా పెయింట్ వేయించాను. అయితే పూర్వపు రంగు దొరక లేదు. దాంతో రంగు మారింది..." అన్నాడు వెంక ట్రావు.

ఆనంద్ ఉలిక్కిపడ్డాడు. నిజంగా అతను చెప్పిన కారణంగానే ట్రంకు రంగు మార్చవలసిందా లేదా వెంక ట్రావు కూడా...

ఒక వేళ అయితే... ఎవరిని?

ఆనంద్ నవ్వి—"మీ శ్రీమతిగారూళ్ళో లేరను కుంటాను. మళ్ళీ ఎప్పుడు వస్తారు?"—అన్నాడు.

వెంకట్రావు ముఖం వివర్ణమైంది—"ఆమె ఇక రాదు" అన్నాడు.

ఆనంద్ కూడా దెబ్బతిని—"ఎందువల్ల?" అన్నాడు.

"నాకు ట్రాన్స్ఫరైపోయింది. ఎల్లుండే నా ప్రయాణం......"

ఆనంద్ అతన్ని మాటల్లోకి దించాడు. రాజేశ్వరిని పిలిచి కాఫీ చేసి పట్రమన్నాడు. కబుర్లలో వెంకట్రావు కే ఊరు ట్రాన్స్ఫరయినదీ, కనుక్కోనేందుకు ప్రయత్నిం చాడు. వెంకట్రావు మాట్లాడే పద్ధతినిబట్టి అతను నిజం చెప్పడంలేదని తోచింది ఆనంద్ కు.

కాఫీ తీసుకుని థాంక్స్ చెప్పి వెంకట్రావు వెళ్ళి పోయాక ఆనంద్ తీవ్రాలోచనలో పడ్డాడు. ఎలాగో అలా ఒక్కసారైనా కుసుమను అనుభవించి తీరాలి. అందులోనూ ఆమెకు తనపట్ల ఆకర్షణ, ఆరాధన కూడా

వున్నట్లున్నాయి. కానీ ఒకటి రెండ్రోజుల్లో తనకు కుసుమ పత్తా లేకుండా పోయేటట్లుంది. అందుకని ఎలాగో అలా వెంకట్రావు అసలు అడ్రస్ తెలుసుకోవాలి. అతను పనిచేస్తున్న బ్యాంకుకు వెళ్ళి తెలుసుకుందామా అంటే అతను నిజంగా బ్యాంకులో పనిచేస్తున్నాడో లేదో తెలియదు.

మర్నాడు ఆనంద్ వెంకట్రావు ననుసరించి వెళ్ళాడు. వెంకట్రావు తిన్నగా ఒక బ్యాంకులోకి వెళ్ళాడు. అది సెట్టీస్ బ్యాంక్.

కొద్దిసేపాగి ఆనంద్ కూడా ఆ బ్యాంకులోకి వెళ్ళాడు. ఓ కౌంటర్లో కూర్చొని పని చేసుకుంటున్న వెంకట్రావుని చూశాడు. అక్కడ తిరుగుతున్న ప్యూన్ ని పలకరించి దూరంనించి చూపించి—"ఆయనెవరు?" అడిగాడు.

"ఆయన పేరు వెంకట్రావండి. ట్రాన్సఫరు మీద కాకినాడ వెళ్ళిపోతున్నారండి..." అంటూ ప్యూను వరుసగా ఆనంద్ కు కావలసిన సమాచారం అందించాడు. వివరాలన్నీ విని ఆనంద్ తనపని సులభమైనందుకు ఆనందించాడు. కుసుమ ఇక తన స్వంతమైనట్లే భావించాడు.

వెంకట్రావు వెళ్ళిపోయిన పదిరోజులకు అతను రాజేశ్వరితో తనకు అర్జంటుగా కాకినాడ వెళ్ళాల్సిన పని ఉందన్నాడు.

క్షణం ఆలోచించి—"కుసుమ కోసమా?" అంది రాజేశ్వరి.

"నీకెప్పుడూ వేళాకోళమే—" అని పైకి నవ్వేసిన ఆనంద్—'నువ్వు దేవాంతకురాలివి. నీతో చాలా జాగ్రత్తగా ఉండాలి—' అని లోపల అనుకున్నాడు.

# 8

ఆనంద్ తలుపుతట్టి ఆశగా ఎదురు చూస్తున్నాడు.

అంతకు ముందురోజు కాకినాడ వచ్చాడు. వెంకట్రావు కళ్ళబడకుండా అతన్ని బ్యాంకునించి అనుసరించి ఇల్లు కనుక్కున్నాడు. ఆరోజుకాగి ఈరోజు వెంకట్రావు బ్యాంకుచేరిన అర్థగంటకు నెమ్మదిగా అతని ఇల్లుచేరి తలుపు తట్టాడు.

తలుపు తీసిన కుసుమ ఏంచేస్తుంది? నిండు మనసుతో ఆహ్వానిస్తుందా? లేక ఇది సమయం కాదని నిరుత్సాహ పరుస్తుందా?

తలుపులు తెరుచుకున్నాయి. ఆశగా చూసిన ఆనంద్ దెబ్బతిన్నాడు.

ఆమె కుసుమ కాదు. కుసుమకంటే అందంగా వుండడం సాధ్యంకాదు గాబట్టి కుసుమంత అందంగా ఉందని చెప్పవచ్చు. కానీ ఆమె ఎవరు?

“ఇది సెట్టీస్ బ్యాంకులో పనిచేస్తున్న వెంకట్రావు గారిల్లేనాండీ?”

“అవును—”

“మీరెవరు?”

“వారి భార్యను...” అందామె.

ఆనంద్ ఉలిక్కిపడి—“నిజంగా?” అన్నాడు.

ఆమె కళ్ళలో ఆశ్చర్యం కనపడింది. “భార్యలు అబద్ధంగాకూడా ఉంటారా?”

“వెంకట్రావు నాకు తెలుసు. అతను విశాఖపట్నంలో పని చేసేటప్పుడు మా ఇంటి పక్కనే ఉండేవాడు. అందువల్ల అతని భార్య నాకు తెలుసును. ఆమె పేరు కుసుమ...”

ఈసారి ఆమె కళ్ళలో ఆశ్చర్యం కనపడలేదు—
“లోపలకు రండి” అంది.

వెంకట్రావు లోపలకు వెళ్ళాక ఆమె కుర్చీ చూపించింది. “ఆయనకిది రెండవ వివాహమని నాకు తెలుసు. ఆయన అవన్నీ నాకు చెప్పేరు. మొదటి భార్య చాలా అందమైనది. అపురూపంగా చూసుకునేవారు. కానీ ఆమె ప్రవర్తన సరైనదికాదు. బరితెగించిన ఆడది. చుట్టుపక్కల వున్న మగవాళ్ళందర్నీ ఏదో సమయంలో ఆమె తన ఇంటికి రప్పించుకునేది.

ఈ విషయంలో ఆయనకు బలమైన ఆధారాలు దొరికేయి. ఆయన మనసు చెదిరిపోయింది. ఏం చేయాలో తోచలేదు. ఒకరోజీ విషయంలో ఇంట్లో పెద్ద ఘర్షణ జరిగింది. కుసుమ ఇల్లువదలి వెళ్ళిపోయింది. ఆయన వెంటనే ట్రాన్స్ఫరుకి ప్రయత్నించారు.

కుసుమ ప్రవర్తన తెలిసినప్పట్నించీ నాతో కరస్పాండెన్సులో వున్నారు. మేమిద్దరం కాలేజీలో ఒకరికొకరికి బాగా తెలుసు. నాకు నా అన్నవాళ్ళెవరూ లేనట్లే. బంధువులింట్లో కాస్త హీనమైన జీవితాన్ని గడుపుతున్నాను. ఈయన వివరాలన్నీ విన్నాక ఈయన్ని పెళ్ళి చేసుకుంటే నేను సుఖపడి తన్ను సుఖపెట్టగలనని నాకు తోచింది. అంగీకరించాను. దయచేసి మీరాయన్ను మళ్ళీ కలుసుకొని కుసుమ సంగతులు గుర్తు చేయకండి” అందామె.

“ఇప్పుడు నేను వెంకట్రావుగారి కోసం మీ ఇంటికి వచ్చాను. మీతో కాసేపు మాట్లాడి వెడుతున్నాను. ఇది చూసిన ఇరుగూ పొరుగూ చిలవలూ పలవలూ అల్ల

వచ్చు. అది మీ ఆయనకు చేరి మిమ్మల్నవమానించవచ్చు అప్పుడు మీకూ కుసుమకు తేడా కనబడవచ్చు. వివాహానికి ముందు మీ ఆయన మాటల్లోని నిజం గురించి ఆలోచించ డానికి ప్రయత్నించారా?'' అన్నాడు ఆనంద్. ప్రవర్తన సరైనది కాని కుసుమ తనకు ఒక్కసారికూడా దక్క లేదని అతనికి చాలా మంటగావుంది.

''ఆయన్ను నేను బాగా అర్థం చేసుకున్నాను. ఆయన అబద్ధం చెప్పరు. మీరే చెప్పండి. కుసుమకు పొరుగునే ఉంటున్నారు. ఆమె ప్రవర్తనలో మీకే లోపమూ కనబడలేదా?'' అందామె.

ఉల్లిపాయలకు వచ్చినప్పుడు చేయిపట్టుకుంటే ఇంట్లో ఆయన వున్నారన్న కుసుమ—తన కౌగిలిలో అరక్షణం పాటు కరిగిన కుసుమ—తను నడుము పట్టుకు నడిపిస్తే తనతో కొన్ని అడుగులు వేసిన కుసుమ—అతని కళ్ళ ముందు మెదిలింది. అయినా అతను ''లేదు'' అన్నాడు.

''అబద్ధం'' అందామె. ''ఆయనిప్పుళ్ళో ఉన్నారని మీకు తెలుసు. ఇదాయన ఇల్లని మీకు తెలుసు. ఈ టైములో ఆఫీసులో ఉంటారాయన అని తెలుసు. అయినా మీరిప్పుడే వచ్చి తలుపు తట్టారు. అంటే మీరు వచ్చింది కుసుమ కోసం. అందులో ఇంకేమీ సందేహం లేదు. ఆయన మాటల్లోని నిజం, కుసుమ ప్రవర్తనలోని లోపం బయల్పరచడానికి—ఇంతకంటె బలమైన దృష్టాంతం అవసరంలేదు...''

ఆనంద్ దెబ్బతిన్నాడు. చటుక్కున లేచి ''వస్తా నమ్మా!'' అన్నాడు అప్రయత్నంగా.

''మంచిది, వెళ్ళిరండి'' అందామె.

"మీతో ఒకక్షణం మాట్లాడాలి"అన్నాడు ఆనంద్.

వెంకట్రావు తలెత్తిచూసి "ఓహ్ మీరా" అన్నాడు ఆశ్చర్యంగా. అతని ముఖంలో కాస్త ఇబ్బంది కూడా కనపడింది. అయినా లేచి "రండి" అన్నాడు. ఇద్దరూ ఒకచిన్న గదిలోకి వెళ్ళారు.

"ఏమిటి చెప్పండి?"

"మీరు చేసినపని ఏమీ బాగోలేదు..." అన్నాడు ఆనంద్.

"ఏ పని?"

"కుసుమని వదిలిపెట్టి ఇంకో వివాహం చేసుకోవడం."

"అది మీ కనవసరం" అన్నాడు వెంకట్రావు కోపంగా.

"అనవసరం కాదు. వ్యవహారం కోర్టుదాకా వెడుతుంది."

"ఎందుకని?"

"కుసుమకు న్యాయం చేకూర్చాలి కాబట్టి..."

"కుసుమకూ మీకూ ఏమిటి సంబంధం?"

"ఏ సంబంధమూ అవసరంలేదు. ఆమె మా యింట ఆశ్రయం కోరింది. ఒక సహృదయుడిగా నేనామెకు సహాయపడ దల్చుకున్నాను..."

"కుసుమ మీ దగ్గరకు వచ్చిందా?" అని నవ్వాడు వెంకట్రావు. "బహుశా నా భార్యగా ఉన్నప్పుడయ్యుంటుంది."

"ఏమిటి మీరనేది?"

"మీకూ తెలిసే ఉంటుంది. కుసుమ ప్రవర్తన సరై

నదికాదు. ఆమెను వదలిపెట్టేయ దల్చుకున్నాను, ఆ సంగతి ఆమెకు చెప్పాను. ఆమె విని ఊరుకుంది కానీ ప్రవర్తన మార్చుకోలేదు. ఒకరోజు ఇద్దరం ఘర్షణ పడ్డాం. తను నన్నువదలి వెళ్ళిపోతానని వాగ్దానం చేసింది కుసుమ. ఆరాత్రే ఆమె నన్నువదలి వెళ్ళి పోయింది..."

"ఎక్కడకు..."

"నేరుగా నరక లోకానికి. ఎక్కడకు పోతే నా కెందుకు?"

"కానీ కుసుమ ఇప్పుడు నా దగ్గరుంది."

"ఉంచుకోండి - మీదగ్గరే. కానీ కుసుమలాంటి ఆడ దాన్ని మీ ఇంట్లో వుంచుకునేందుకు మీ ఆవిడ ఒప్పు కోక పోవచ్చు. కొత్త మగవాణ్ని చూస్తే ఆమె మనసు నిలవదు..."

"ఒక భార్య బ్రతికుండగా ఇంకో వివాహం చేసు కోవడం చట్టరీత్యా నేరం..."

"బ్రతికుందని మీరు ఋజువు చేయండి..." అని వెంకట్రావు అక్కణ్నించి వెళ్ళిపోయాడు. ఆనంద్ మ్రాన్పడిపోయాడు.

బ్రతికుందని తను ఋజువు చేయాలిట. అంటే కుసుమ బ్రతికిలేదా? ఆనంద్ మనసులో రంగుమారిన తన ట్రంకు పెట్టె తళుక్కుమంది.

## 10

"నేను నమ్మను" అంది రాజేశ్వరి. "వెంకట్రావు దుర్మార్గుడవునో కాదో నాకు తెలియదు. కానీ ఒక మనిషిని హత్య చేసేటంత నీచుడైవుంటాడని నేననుకోను."

"అదిసరే. ఈరోజు రాత్రి పెళ్ళాం పుట్టింటికి వెడితే మర్నాసూర్యోదయం అతగాడికి మనిషి పట్టేటంత ట్రంకెం దుకు కావాల్సొచ్చిందట?" అన్నాడు ఆనంద్.

"ఏమో__ఎందుకో__మనకెందుగ్గానీ అసలింతకీ ఈ ట్రంకు నీదగ్గరెందు కుందిట?" అంది రాజేశ్వరి.

ఆనంద్ కు వెంటనే జవాబు దొరకలేదు. క్షణం ఆలోచించి "ఎక్కువ సామాను పడుతుంది గదా అని కొన్నాను" అన్నాడు.

"అందుకే వెంకట్రావూ అడిగుండ వచ్చు. చేజారి పోయిన వసువు గురించి ఎక్కువ ఆలోచించి మనసు పాడు చేసుకోకు. దానిది మదపిచ్చి. అదే దాన్ని నాశనం చేస్తుంది" అంది రాజేశ్వరి.

ఆనంద్ ఇంక ఈ విషయంలో మాట్లాడ దల్చుకో లేదు. మర్నాడు సినిమానుంచి తిరిగివచ్చిన రాజేశ్వరి కంగారుగా అతన్ని పలకరించే వరకూ అతనా మెలో ముభావంగా వున్నాడు.

"బహుశా మన మీ ఊరు వదలి పోవాలేమో" అంది రాజేశ్వరి.

"ఎందుకు?"

"సినిమా అయిపోయాక చూశాను. హాల్లోంచి బయ టకు వెడుతూ కనిపించాడు నాకు. నన్ను చూశాడో, లేదో తెలియదు కానీ నా శరీరమంతా వణికిపోయింది. చూస్తూండగా జనంలో కలిసిపోయాడు..."

"ఎవరు?"

"రంగారావు" అంది రాజేశ్వరి.

"ఇంపాసిబుల్" అన్నాడు ఆనంద్ అప్రయత్నంగా.

"రంగారావు నాకు తాళికట్టిన భర్త. నీ అంతదగ్గరగా నాకు వచ్చిన మగవాడు. అతన్ని గుర్తుపట్టడంలో నేను పొరబాటు చేయను. నాకిప్పుడు చాలా భయంగావుంది. నేను చేసిన మోసం గ్రహించి నామీద పగ తీర్చుకుంటూ దేమోనని..." అని ఆగింది రాజేశ్వరి.

"నీకు అండగా ఆనంద్ వున్నాడు. అలాంటి భయాలేమీ పెట్టుకోకు. రంగారావు నిన్నేమీ చేయడు. చేయలేడు. నేను హామీ ఇస్తున్నాను..." అన్నాడు ఆనంద్.

"ఏమో బాబూ...నన్ను వెతుక్కుంటూ ఈ ఊరు వచ్చాడేమోనని నాకు చాలా బెంగగా వుంది..." అంది రాజేశ్వరి.

ఆనంద్ ఆలోచనలో పడ్డాడు. రంగారావును తను చేతులారా చంపాడు. అతను బ్రతకడం అసాధ్యం. అయితే రాజేశ్వరి ఎవర్ని చూసింది? ఆ చూసినతనికి రంగారావు పోలికలు బాగా ఉన్నాయా లేక రాజేశ్వరి తనదగ్గర ఏదైనా ట్రిక్కు వేస్తోందా?

ఆమె ట్రిక్కు వేస్తోందను కుందామనుకుంటే ఎందుకు? ఆమెకు తనమీద అనుమానం కలిగే అవకాశం ఈషణ్మాత్రంకూడా లేదు. అలాంటప్పుడు ఏం జరిగింది?

అతనికి జవాబు తోచలేదు. చిరాగ్గా అతను అరుగు మీదకు వెళ్ళాడు. ఆలోచిస్తూ పదిహేను నిముషాలు నిలబడ్డాడు. ఇంతలో అతన్ని ఎవరో పిలిచారు.

"సార్, మీ పేరేనా ఆనంద్."

"అవును, ఏం?" అన్నాడు కుర్రవాడిని పరీక్షగా చూస్తూ.

ఆ కుర్రవాడు ఆనంద్ చేతిలో ఓ కవరు పెట్టి తుర్రున పారిపోయాడు. ఆనంద్ కా కుర్రవాడిని పట్టుకునే ఆలోచనే లేకపోయింది. అతను అప్రయత్నంగా కవరు తెరచి లోపలున్న ఉత్తరం తీశాడు.

దస్తూరీ ఎవరిదో కానీ ముత్యాల కోవలా వుంది. పైన తేదీ లేదు. క్రింద సంతకం లేదు.

"పాత స్నేహాన్ని పురస్కరించుకొని ఈ ఉత్తరం రాస్తున్నాను. నా కోసం మీరు ఈ కాగితం వెనుక వ్రాసిన చిరునామాకు రాగలరా?"

కాగితానికి ఒకవైపు రెండే రెండు వాక్యాలున్నాయి. రెండోవైపు చిరునామా వుంది. చాలా దూరమే. ఊరికి తానొకవైపున వుంటే, ఇప్పుడు తను వెళ్ళవలసిన ఇల్లింకో వైపునవుంది.

ఆనంద్ కవరునూ, కాగితాన్నీ జేబులోకి తోసేశాడు.

ఈ ఉత్తరం ఎవరు వ్రాసి వుంటారు? ఎవరో తనకు బాగా తెలిసినవారే అయివుంటారు. కానీ ఉత్తరం చాలా తమాషాగా వుంది. వివరాలు చాలా తక్కువగా వున్నాయి. రాసిందెవరో తెలియదు. తను వాళ్ళనెందుకు కలుసుకోవాలో తెలియదు. ఆఖరికి ఎప్పుడు కలుసుకోవాలోకూడా తెలియదు...

ఒక్కసారి వెళ్ళివచ్చేస్తే చాలా ప్రశ్నలకు జవాబులు లభిస్తాయి. కానీ, ఈ సంగతి రాజేశ్వరికి చెప్పాలా? వెళ్ళొచ్చేక ఏ ప్రమాదమూ లేదనుకుంటే ఆమెకు చెప్పవచ్చు. ఉన్న పక్షంలో ఈ విషయం రహస్యంగా ఉంచడమే మంచిది.

లోపలకు వెళ్ళి బట్టలు మార్చుకుని బయటకు వెళ్ళి వస్తానని భార్యకు చెప్పి అతను వీధిలోకి వచ్చాడు.

# 11

"నువ్వా?" అన్నాడు ఆనంద్. ఆశ్చర్యమూ, ఆనందమూ సమపాళ్ళలో కనపడుతున్నాయతని కళ్ళలో. "నిన్ను మళ్ళీ చూడగల ననుకోలేదు..."

"నేనూ అనుకోలేదు. కానీ మనం మళ్ళీ కలుసుకోవాలనుంది కాబోలు, అందుకని ఇలా కలుసుకున్నాం" అంది కుసుమ.

"ఏమయిందసలు? నాకా ఉత్తర మెందుకు రాసావ్- మీ ఆయన నిన్నింట్లోనుంచి ఎందుకు తరిమేశాడు?"— అన్నాడు ఆనంద్.

"ఆయన నన్నింట్లోంచి తరిమేయడ మేమిటి?" అంది అర్థంకానట్లు కుసుమ.

తనకు తెలిసినంతవరకూ కుసుమ విషయంలో జరిగిన వన్నీ ఆమెకు చెప్పాడు ఆనంద్.

"ఎంత కాంక్ష మీకు నామీద?" అంది ఆశ్చర్యంగా కుసుమ. "నా కోసం ఇక్కడ్నించి కాకినాడ వెళ్ళారా? అందుకే కాబోలు దేవుడు నన్ను మీకోసం స్వర్గంనుంచి సరాసరి భూమ్మీదకు పంపేశాడు."

"నీ కోసం కాకినాడ ఏం కర్మ, ఎక్కడికైనా వెళ్ళి వచ్చేస్తాను. నీ రూపం మగాడికి వరంలాంటిది" అన్నాడు ఆనంద్.

కుసుమ ముఖంలో అనంత గర్వం కనబడింది. "అది సరే, ఇంతకీ నేనేమయ్యానను కున్నారు?"

"అబద్ధ మెందుకూ? నిన్ను వెంకట్రావు చంపేశాడేమోనని అనుమానం కలిగింది. క్రమంగా ఆ అనుమానం భయంగా మారిందికూడా."

"ఆ అనుమాన మెందుకొచ్చింది."

"నువ్వు పుట్టింటికి వెడతానన్న మరుసటిరోజు మీ ఆయన మా ఇంటికివచ్చి ట్రంకుపెట్టడిగాడు. ఆ తర్వాత ఆ పెట్టికి రంగుమార్పించి ఇచ్చేశాడు. అది నా అనుమానానికి కొంతవరకూ కారణం..."

"మీ అనుమానం అబద్ధంకాదు. మా ఆయన నన్ను హత్య చేశాడు" అంది కుసుమ.

ఆనంద్ కుసుమవంక ఆశ్చర్యంగా చూశాడు.

"అవును. ఆయన నాకు విషప్రయోగం చేశాడు. మంచినీళ్ళుతాగి నేను పడిపోయాను. ఆ తర్వాత మెలకువ వచ్చేసరికి ఈ ఇంట్లో ఉన్నాను. ఈ ఇంట్లో ఆమె దగ్గర గ్రామంలో ఎవరో తెలిసిన వారింటికెళ్ళి టాక్సీలో తిరిగి వస్తూండగా ఆవిడకి దారిపక్కన నేను కనిపించానట. వెంటనే టాక్సీఆపి నన్ను పరీక్షించిందట. చాలా బలహీనంగా వుందట నాడి.

ఏమైతే నేం ఆవిడ నన్ను రక్షించింది. కాస్త తెలివి వచ్చేక నా వాళ్ళగురించి అడిగింది. ఆవిడ చెప్పినది విన్నాక నామీద విషప్రయోగం జరిగిందని గ్రహించాను. ఆ పరిస్థితిలో మా ఆయన గురించి చెప్పకూడదనుకున్నాను. బాగా ఆలోచించి ఆవిడ బాకీ మీ ద్వారా తీర్చేయ దల్చుకున్నాను. మీకు నామీద గౌరవమున్నదనీ నాకోసం ఒకటి రెండువేలు ఖర్చుచేయడానికి జంకరనీ నాకు తోచింది.

ఈ ఇంట్లోని డాక్టరుగారికి సుమారు వేయి రూపాయలు చార్జి అవుతుంది. ఆ తర్వాత నేను జీవితంలో సెటిల్ కావడానికి ఇంకో వెయ్యిరూపాయలు దాకా

ఖర్చవుతుంది. ఆ తర్వాత ఇంకెవ్వరికీ భారం కాకుండా నా జీవితం నేను జీవించగలను. ప్రస్తుతానికి మీ ఋణం తీర్చుకోవడానికి మీరు కోరుకునే నా శరీరమొక్కటే నా దగ్గరుంది'' అంది కుసుమ.

ఆనంద్ ఆలోచనలింకోవిధంగా ఉన్నాయి. విష ప్రయోగం చేస్తే కుసుమ ఎలా బ్రతికింది? ఆమె చచ్చిందో బ్రతికిందో తెలియకుండా వెంకట్రావు రోడ్డు ప్రక్కన ఎలా పడేసాడు? ఏదో అనుమానం...

''ఈమధ్య విషాల్లో కూడా కల్తీ ఉంటోందట. అందు వల్ల చావ్వలసిన వాళ్ళు చావకుండా బ్రతికేస్తున్నారట. డాక్టరు చెప్పింది. నా భర్త బహుశా నన్ను పాతి పెడదామనుకుని ఉంటాడు. ఈలోగా అలికిడికి పారిపోయుంటాడు...'' చెప్పసాగింది కుసుమ.

# 12

ఆనంద్ ఇంట్లోకి అడుగుపెట్టగానే, ''ఎక్కడికి వెళ్ళావ్ నువ్వు. నువ్వలా బయటకు వెళ్ళగానే ఇలా రంగారావొచ్చాడు మనింటికి'' అంది రాజేశ్వరి.

''మనింటికే వచ్చేడా?'' అన్నాడు ఆనంద్. ''ఎందుకట?''

''ఏమో తెలియదు. కానీ నాకర్థంకాని మాటలు చాలా మాట్లాడేడు...'' అంది రాజేశ్వరి.

''ఏమన్నాడు?''

''నేను కుక్కముట్టిన విస్తరినట. అందుకని నేను తనకింక అక్కర్లేదట. నా మీద తనకు పగలేదట. నిన్ను స్నేహితుడని నమ్మాడట. కానీ నీ స్నేహంలో కల్తీ వుందని తెలుసుకోలేక పోయాడట. నీలాంటి కల్తీస్నేహి

తుడి చేతి విషంమాత్రం కల్తీలేకుండా ఎలాగుంటుందని అడగమన్నాడు. ఎంతలోతు గోతిలోంచయినా తను బయట పడగలనన్నాడు. ట్రంకుపు రంగు మార్చినా నేరం దాగదని చెప్పమన్నాడు. అయిదంటే అయిదు నిముషాలుండి వెళ్ళిపోయాడు. వాళ్ళిముందు నీకు రోజులు దగ్గర పడ్డాయని చెప్పమన్నాడు..."

ఆనంద్‌కు వళ్ళంతా చెమటలు పట్టాయి. రంగారావు నిజంగానే ఇంటికి వచ్చాడా? అతను గోతిలోంచి బ్రతికి బయటపడ్డాడా? పడితే ఎవరతన్ని రక్షించారు? తను ఉపయోగించినది నిజంగానే కల్తీ విషమా?

తను చేసినపని ఇంకెవరికీ తెలియడానికి వీల్లేదు. ఆ రహస్యం తనకూ రంగారావుకి మధ్యనే వుండితీరాలి. ఇప్పుడా వివరాలన్నీ రాజేశ్వరి చెప్పగలుగుతోందంటే రంగారావు నిజంగానే బ్రతికి బయటపడి ఉండాలి, లేదా ఎవరో తనుచేసిన పనులన్నీ గమనించి వుండాలి.

ఇలా తోచగానే ఆనంద్ ఆపాదమస్తకమూ వణికి పోయాడు. తన్నెవరూ గమనించలేదని ఇంతకాలమూ చాలా ధైర్యంగా వున్నాడు. కానీ తననెవరో గమనించిన పక్షంలో ఏం చేయాలి? ఒకవేళ రంగారావు బ్రతికివస్తే ఏం చేయాలి?

రెండింటికీ అతను సిద్ధపడిలేదు.

"అదేమిటి. అలాగైపోతున్నావ్. అసలింతకీ ఏం జరిగింది? రంగారావన్న మాటల కర్థమేమిటి?" అంది రాజేశ్వరి.

"నిన్ను చంపాలని అతననుకున్నాడు. అతనికి విషానికి బదులు మత్తుమందిచ్చాను. కల్తీ స్నేహం కల్తీ విషం

అన్న పదాలకర్థమదేనేమో. మరి గోతిలోంచి బయటపడడమేమిటో నాకర్థం కావడంలేదు...'' అన్నాడు ఆనంద్.

రాజేశ్వరి తేలిగ్గా నిట్టూర్చి, ''అతని మాటల్ని బట్టి నాకేమనిపించిందో తెలుసా? నువ్వేరంగారావుకి విషం పెట్టి ఏ గోతిలోనైనా పారేశావేమో. అయినా అతను బ్రతికి వచ్చాడేమోనని అనిపించి వణికిపోయాను. ఇంత కాలం ఒక హంతకుడితో కాపురం చేస్తున్నానన్న ఆలోచన నాకు భయంకరంగా తోచింది. నువ్వలాంటివాడివంటే నా మనసొప్పుకోదనుకో. కానీ...'' అని ఆగిపోయింది.

ఆనంద్ అనుమానంగా రాజేశ్వరి వంక చూశాడు. ''ఈ ఊళ్ళో మనమెంతో కాలముండడానికి వీల్లేదు రాజూ. ఎలాగో అలాగ రంగారావు బారినుంచి తప్పించుకోవాలి. మాటలేం చెప్పినా నామీద కంటె నీమీదనే అతనికి పగ ఎక్కువగా ఉండవచ్చును. తనను కాదని మరో మగవాడితో వుండే ఆడదాన్ని ఏ మగవాడూ సహించలేడు. నిన్ను నేను మళ్ళీ రక్షించాలి.''

''నీతో బయల్దేరి వచ్చినప్పట్నించీ, నేను మారిపోయాను. నేనిప్పుడెవరికీ భయపడను. నన్ను నేను రక్షించుకోగలను'' అంది రాజేశ్వరి.

''మనకిప్పుడు లక్షల ఆస్తివుంది, ఇంకా ఎంతకాలమిలా సామాన్య జీవితం గడుపుతాం? ఒక అందాల భవంతి కొనుక్కుని ఖరీదయిన జీవితం గడపాలి. అయితే అందు గురించి ఎవరూ అనుమానపడని విధంగావుండాలి. అందుకని ముఖ్యంగా ఈ ఊరుని వదిలిపెట్టాలి.''

''చూపుల్లోనూ, మాటల్లోనూ రంగారావుకు నీమీద

చాలా పగ వున్నట్లు వ్యక్తమైంది. నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. ఏ క్షణంలోనైనా నీమీద హత్యాప్రయత్నం జరగవచ్చునని నా కనుమానంగా వుంది. దాన్నుంచి తప్పించుకోనేందుకేదైనా మంచి పథకం వేయాలి..." అంది రాజేశ్వరి.

# 13

ఆనంద్ తలుపు తట్టబోయే సమయానికి "సార్, ఈ ఉత్తరంలోప లిచ్చేస్తారా" అన్నమాట వినబడి వెనక్కి తిరిగాడు. పోస్టుమెన్ అతనికో కవరందించి వెళ్ళిపోయాడు.

ఆనంద్ పరీక్షగా చూశాక కవరుమీద కుసుమ పేరు వుంది. ఫ్రం వెంకట్రావు, కాకినాడ అనికూడా రాసి వుంది.

ఒక్క క్షణం ఆనంద్ బుర్ర పనిచేయలేదు. వెంకట్రావుకు కుసుమ ఇక్కడుంటోందని తెలుసా? తెలిస్తే ఎలా తెలిసింది? ఈ ఉత్తరంలో ఏముంది. బెదిరింపా?

ఆనంద్ తలుపు తట్టకుండా వెను దిరిగాడు. దగ్గర్లో వున్న పార్కులోకి వెళ్ళి జాగ్రత్తగా కవరు తెరిచాడు. లోపల తెల్ల కాగితంమీద కాస్తపెద్ద ఉత్తరమేవుంది.

"డియర్ కుసుమా!"

మన పథకం చాలా తెలివిగానే రూపొందించావు నువ్వు. నీకోసం ఆనంద్ పిచ్చివాడైనాడని అతను కాకినాడ వచ్చినపుడే అనుకున్నాను. ఇప్పటికి నీగురించి మూడువేలు ఖర్చుపెట్టాడంటే అతనికి బాగా డబ్బున్నదనే తోస్తోంది. నేను నిన్ను హత్యచేశాననీ, అయినా అదృష్టం కొద్దీ

బ్రతికి బయట పడ్డావనీ నువ్వన్నమాటలు అతను నమ్మాడంటే నీ చాకచక్యానికి మురిసిపోతూనే— ఇలాంటి ఫూల్ మనకు ముందుముందు పనికివస్తాడా అని అనుమానంగా కూడావుంది. ఏది ఏమైనా నీ అసలురంగు బయట పెట్టు. ఎత్తులతో, జిత్తులతో అతన్ని చిత్తుచెయ్యి. మన స్మగ్లింగ్ లోకి దించు.

నీవు ప్రస్తుతం దారిలేని పరిస్థితులలో స్మగ్లింగుకు అంగీకరించవలసి వచ్చిందని అబద్ధం చెప్పు. కష్టమైన పనులన్నీ అతనిచేత నే చేయించు. అందమైన ఆడది, అందులోనూ పరాయిద నే సరికి ఎక్కడలేని మోజు పుట్టుకొస్తుంది మగవాడికి.

నీ కోసం ఒకసారి అక్కడికి రావాలని వుంది. అవకాశం దొరుకుతుందని ఆశిస్తాను.

విష్ యూ ఆల్ లక్.
క్రింద వెంకట్రావు సంతకముంది.

ఆనంద్ కు చాలాకోపం వచ్చింది. ఇదంతా కుసుమ, వెంకట్రావు కలసి ఆడిన నాటకమన్నమాట! తను వెర్రి వెంగళాయిలా ఇందులో చక్కగా ఇరుక్కున్నాడు. కుసుమ ఎంత వగలాడి! ఆమె అమాయకురాలని తను అనుకున్నాడు, చెప్పేవన్నీ నిజమే ననుకున్నాడు.

సరే, ఏమైతేనేం, కుసుమ అసలురంగు తనవద్ద ఎలా పెడుతుందో చూడాలి. ఆమెకున్న స్మగ్లింగ్ కాంటాక్ట్స్ ఎటువంటివో తెలుసుకోవాలి. ఆమె ఎత్తులకు పై ఎత్తులు వేయాలి.

దగ్గరున్న పోస్టాఫీసుకి వెళ్ళి కవరుమళ్ళీ జాగ్రత్తగా

అతిక్రమించి కుసుమ ఇంట్లో ఆ వృత్తాన్ని జారవిడిచి— ఓ రెండు గంటలాగి అప్పుడామె ఇంటికి వెళ్ళాడు.

కుసుమ అతన్ని ప్రేమగా ఆహ్వానించి తన గదిలోకి తీసుకు వెళ్ళింది. కాసేపు ప్రేమ కబుర్లు చెప్పింది. అతని ఉదార గుణాన్ని పొగిడింది.

"నేనిప్పుడొక యిబ్బందిలో పడ్డాను ఆనంద్"— అందామె.

"చెప్పు—"

"ఉద్యోగాన్వేషణలో ఒక ఆఫీసుకు వెళ్ళాను. అక్కడ నన్ను చూస్తూనే స్టన్నింగ్ బ్యూటీ అని మెచ్చుకున్నాడతను. నా వల్లనే కొన్ని పనులు సులభంగా అవుతాయట. నెలకు వెయ్యిరూపాయల జీతంమీద తక్షణమే ఉద్యోగంలోకి తీసుకుంటున్నానని అయిదొందలు అడ్వాన్సుగా యిచ్చాడు. నాకొక చిన్న పెట్టె ఇచ్చాడు. అది నా వానిటీ బ్యాగులో పట్టేటంత ఉంది. దాన్ని నేను ఒకచోట అందజేయాలట.

ఈ వేళ సాయంత్రం ఆరుగంటలకు అది జరగాలి. ఈ పని సక్రమంగా జరిగితే నా ఉద్యోగం వుంటుందట. లేకపోతే ఊడుతుందట. నేనేమైనా మోసం చేయడానికి ప్రయత్నిస్తే నా ప్రాణాలే పోతాయట. నేను భయపడి ఉద్యోగం వద్దన్నాను. అప్పుడతను నవ్వి, అది నీ అందానికే అవమానం. ఈపని నీవల్ల చాలా సులభంగా అవుతుంది. ఎటొచ్చీ నిన్ను ప్రాణాధికంగా ప్రేమించే మగవాడిని నీకు రక్షణగా ఏర్పాటు చేసుకో. అలాంటి మగవాడు లేకపోవడంకూడా నీ అందానికి అవమానం... అన్నాడు.

అతనలాగనగానే నువ్వు గుర్తుకొచ్చావు. నా బ్రతుకు నేను బ్రతుకుతాను. కోరినప్పుడల్లా నీ దాని నవుతాను. నాకీమాత్రం సాయం చేయగలవా? ఇబ్బంది పనులలో తోడుగా వుండగలవా?'' అనడిగింది కుసుమ.

ఆనంద్ ముఖం గంభీరంగా అయిపోయింది. ''కుసుమా నువ్వుచాలా అమాయకురాలివి. నువ్వు చేయబోయే పని ఎంత ప్రమాదకరమైనదో నీకర్థం కాలేదు. పట్టుబడితే పోలీసులు నానా బాధలు పెడతారు. పదిమందిలో అవమానం. జైలు జీవితం...''

''కానీ, నాకింకో దారిలేదు...'' అంది కుసుమ.

''ఎందుకు లేదు, ఉంది. నాతో నా యింటికివచ్చేయ్ రాజేశ్వరికి నేను నచ్చచెపుతాను. మనం ఈ ఊరువదలి పోదాం. నువ్వు రాజేశ్వరి చెల్లెలివని నలుగురికీ పరిచయం చేస్తాను. లక్షణమైన వరుణ్ని చూసి పెళ్ళిచేస్తాను. నీకు సంబంధించిన సర్వ బాధ్యతలూ నేనే తీసుకుంటాను... సరా?'' అన్నాడు ఆనంద్.

''నువ్వెంత వాడివనీ నామీద నీకు విపరీతమైన ప్రేమనీ నాకు తెలుసు, కానీ ఏరోజు ఈ శరీరం నీదయిందో అప్పట్నించీ మానసికంగా నువ్వే నాకు భర్తవయ్యావు. ఇంకో మగవాణ్ని నా భర్తగా నేను సహించుకోలేను. ఈ జీవితానికి ఏ వివాహం అవసరంలేదు. అయిందేదో అయిపోయింది. నీపట్ల ఆకర్షణ నేను చంపుకోలేను. అది కట్టుకున్న భర్త ఎలాగూ సహించలేడు. ఈ ఇబ్బందులన్నీ ఎందుకు. నాబ్రతుకు నేను బ్రతుకుతాను. ఆర్థికంగా నీకు నేను భారం కాదల్చుకోలేదు. ఏదో అప్పుడప్పుడు అవసరమైనప్పుడు మగతోడుగా నిలుస్తూంటే చాలు...''

"నువ్వు నాకు భారంకాదు. పెళ్ళి ఇష్టం కాకపోతే మానేసేయ్. కానీ ఇలా ప్రమాదకరమైన వ్యవహారాల్లో మాత్రం తల దూర్చకు..."

"లాభంలేదు ఆనంద్. పరిస్థితులు చేయిదాటి పోయాయ్. ఈ ఫోటోలు చూడు" అంటూ మంచం మీద తలగడ క్రిందనుంచి రెండు ఫోటోలుతీసి ఆనంద్ కిచ్చింది కుసుమ.

ఆ ఫోటోలు చూస్తూనే ఆనంద్ కళ్ళు పెద్దవయ్యాయి. అందులో తనూ, కుసుమ వున్నారు. దంపతులంత దగ్గరగా, దంపతులు ఏకాంతంలో వుండేవిధంగా!

"ఏ ఆడదీ ఇలాంటి ఫోటోలు పదిమందిలోకి వెళ్ళాలని కోరుకోదు. ఇవి చూపించి నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడొకతను. నేను చెప్పిన ఆఫీసు వ్యవహారం అబద్ధం అసలు సంగతి యిది. నేను వాళ్ళు చెప్పినట్లు విని తీరాల్సిందే."

ఆనంద్ క్షణం ఆలోచించి "రాజేశ్వరి నాకు తాళి కట్టిన భార్యకాదు. ఆమెను వేరేదారి చూసుకోమని నేను నీ మెడలో తాళి కట్టేస్తాను. ఆ తర్వాత ఈ ఫోటోలు బహిర్గతమైనా ఫరవాలేదు. నువ్వేం బెంగపడకు. అనవసరంగా తప్పటడుగులు వేయకు" అన్నాడు.

కుసుమ ఆశ్చర్యంగా "ఆనంద్, ఏమిటి నువ్వంటున్నది?" అంది.

"అవును, నీడలేని ఒక ఆడది అలా అలా పతనమై పోకుండా ఉండడం కోసం ఏమైనా చేస్తాను నేను..." అని లేచాడు ఆనంద్.

కుసుమ అతని వంక ఆరాధనాభావంతో చూస్తూ వుండిపోయింది.

## 14

"రాజేశ్వరీ, నీకు నా ప్రేమమీద నమ్మకముందా?"

"అసలా సందేహమెందు కొచ్చింది?"

"ఎందుకంటే, ఇప్పుడు మన ప్రేమకు పరీక్షవచ్చింది!"

రాజేశ్వరి ఆశ్చర్యంగాచూసి "ఏమిటా పరీక్ష?" అంది.

"కుసుమ బ్రతికేవుంది తెలుసా?" అన్నాడు ఆనంద్.

"అసలామె చచ్చిందని ఎవరన్నారు?"

"నేనలా అనుకున్నాన్లే, ఆమె బ్రతికుండటమేగాక ఈ ఊళ్ళోనే వుంది."

"నామీద ప్రేమతో ఈ విషయం దాచి పెట్టావా? లేక ఈ విషయం నీకిప్పుడే తెలిసిందా?"

ఆనంద్ క్షణం ఆలోచించి, "చాలా రోజులయింది. ఆమే స్వయంగా నాకోసం కబురంపించింది. తన ఉనికిని ఎవ్వరికీ, ఆఖరికి నీక్కూడా తెలియజేయవద్దని కోరింది. ఆమె ఉద్దేశ్యం తెలుసుకోవడంకోసం నేనామెను కలుసుకుంటూ వచ్చాను. ఇప్పుడామె ఆశ్రయం పూర్తిగా తెలిసిపోయింది. నన్నామె స్మగ్లర్ గా మార్చాలని చూస్తోంది. ఆమె ఏదో ముఠాకు సంబంధించిన వ్యక్తి. వెంకట్రావు ఆమెకు భర్త కాడు. ఒక ముఠా వ్యక్తి అంతే" అన్నాడు.

రాజేశ్వరి ముఖంలో ఆశ్చర్యం కనబడింది. "జీవితంలో ఎక్కడికి వెళ్ళినా నాకు స్మగ్లర్స్ బాధ తప్ప లేదు. ఆఖరికి మన పొరుగున ఉండే కుసుమకూడా స్మగ్లరే నన్నమాట. అయితే మనకేంలే. నువ్వొప్పుకోకు..."

"ఒప్పుకోక తప్పేలాలేదు. ఆమె చేతిలో చాలా

మంది గుండాలున్నారు. బలవంతానైనా నన్నొప్పించ గలదనుకుంటాను" అని, "అంతేకాకుండా కుసుమ నా జీవితంలోకి ప్రవేశించాలనుకుంటోంది. నిన్ను తప్పించాలనుకుంటోంది. అది నేను సహించలేను. కానీ తప్పేలా లేదు" అన్నాడు ఆనంద్.

"ఎందుకు తప్పవు?"

"నువ్వు చాలా బాగుంటావుట! నీచేత వ్యభిచారం చేయించి చాలా డబ్బు సంపాదించవచ్చునట. తను నాకు భార్య అవుతుందట. నేను స్మగ్లింగూ, నువ్వు వ్యభిచారమూ చేయాలట. మనం ఒప్పుకోకపోయినా ఒప్పించే విధానాలామెకు తెలుసునట. దేశంలో ఎక్కడికి పారిపోయినా వెతికి పట్టుకోగలననీ, పారిపోవడానికి ప్రయత్నించవద్దనీ గట్టిగా హెచ్చరించింది..."

రాజేశ్వరి ముఖంలో భయం కనపడింది. "అయితే ఇప్పుడేం చేయాలి?"

"ఇంకో మార్గం లేదు. కుసుమను చంపేయాలి..."

ఉలిక్కిపడింది రాజేశ్వరి. "ఎలా?"

"ఇలా?" అన్నాడు ఆనంద్. అతను జేబులోంచి ఒక ట్యూబు తీశాడు. ఏంచేయాలో చెప్పాడు. రాజేశ్వరి ఆశ్చర్యంగా విని, "అయితే కుసుమనెప్పుడు తీసుకొస్తావ్?" అంది.

"ఎల్లుండి!"

"అంతవరకూ రంగారావు మనల్ని వదుల్తాడంటావా?"

"రంగారావా..." అన్నాడు ఆనంద్. అతనికి ఒళ్ళంతా చెమలు పట్టింది.

"రాజూ... ఈసారి పొరపాటు జరక్కూడదు. నిలు

పెత్తు గోయితీసి కుసుమ శవాన్నందులో పారేసి, మట్టితో కప్పెట్టేయాలి” అన్నాడు ఆనంద్.

“ఈసారి అంటే, ఇలాంటిదిదివరకోసారి చేశావా...” అంది రాజేశ్వరి.

ఆనంద్ తడబడ్డాడు. కొద్ది సేపాగి, “జీవితంలో నాకు చాలా దగ్గరగా వచ్చావు. నీదగ్గర నాకు రహస్యాలేమిటి? నేను రంగారావుని చంపేశాను. అది కేవలం నిన్ను దక్కించుకోవాలన్న ఆశతో. కానీ గోతిలో పారేశాక, మన్ను వేయలేదు. అదే నేను చేసిన పొరపాటు...” అన్నాడు.

రాజేశ్వరి ప్రాణ్పడిపోయినట్టు చూస్తోంది. ఆమె నోట మాట రాలేదు.

“రాజా భయపడకు. నేను మరీ దుర్మార్గుడినికాదు. నీ అందం నన్ను పిచ్చివాణ్ని చేసింది. తెలివితేటలుప యోగించి నిన్నూ, సంపదనూ కూడా పొందగలిగాను. కానీ ఆ తర్వాత నా బుద్ధి పెడదారులు తొక్కలేదు. నిన్ను నా భార్యగా చేసుకుని, సామాన్య జీవితం గడుపు తున్నాను. అయితే ఇప్పుడు కుసుమ మళ్ళీ నా జీవిత పథాన్ని మళ్ళించడానికి ప్రయత్నిస్తోంది. అది నాకు నచ్చలేదు. వేరే దారి కనబడ్డంలేదు. మనమిద్దరం సుఖ జీవనం కొనసాగించడంకోసం కుసుమను చంపేయడానికి నిర్ణయించుకున్నాను. ఇందుకు నీ సహాయం కావాలి...”

రాజేశ్వరి అతని వంక అదోలా చూసింది. “ఆనంద్, నీకు నామీద ఎంత ప్రేమ? నీకు నేను తప్పక సహక రించవలసిందే. కానీ రంగారావు మనని నీడలా వెన్నాడు తున్నాడు. అతన్ని తప్పించుకోవడానికి ఊరువదిలి వెళ్ళి

పోవాలి. కుసుమ చిరునామా చెబితే నేనే వెళ్ళి ఆమెను తీసుకొస్తాను కానీ, ఈలోగా నువ్వీ ఊరు వదిలినట్లు నలుగురూ అనుకోవాలి. రాత్రిళ్ళు మనం కలుసుకుంటూందాం రహస్యంగా..."

# 15

అతను చెమటలు తుడుచుకుని పరీక్షగా చూశాడు దొడ్లోకి. నిలువెత్తు గొయ్యి తయారయ్యింది. అతను సంతృప్తిగా తలాడించి అక్కణ్నించి ఇంట్లోకి వెళ్ళాడు. శుభ్రంగా స్నానం చేశాడు. బట్టలు మార్చుకున్నాడు.

ఒకసారి వెళ్ళి, పక్కింట్లో ఇంటాయనన్ను పలకరించి, "ఇంకో గంటలో మా ఆవిణ్ని తీసుకు వస్తాను. పాలు పొంగించుకుని ఈ రాత్రికి నిద్రచేసి రేపు వెళ్ళిపోతాం. ఎలాగూ మీకు రెండు నెలల అద్దెన్నిచ్చేశాను గదా. మళ్ళీ ఈ ఊరు వచ్చేయడానికి ప్రయత్నిస్తున్నాను. ట్రాన్స్‌ఫర్ వీలయితే నెల్లాళ్ళలో వచ్చి నేరుగా మీ ఇంట్లో ప్రవేశిస్తాం. ఏ విషయమూ మీకు నెల రోజుల్లో తెలియజేస్తాం..." అన్నాడు.

"దాందేముందండీ. నా అద్దె నాకు ముట్టింది. రెండు నెలలదాకా తాళం జోలికి పోము. ఆ తర్వాత కూడా రాకపోతే తాళం బద్దలుకొట్టి మరీ తెరుస్తాం..."

"ఆ అవసరం రానివ్వను లెండి" అని అతను అక్కణ్నించి కదిలాడు.

ఒక 'రిక్షా' మాట్లాడుకున్నాడు రానూ పోనూ అని చెప్పి.

రిక్షా ఒకింటిముందు ఆగింది. అతను రిక్షాలోంచి దిగి, "ఒక్క నిముషం ఆగు..." అని లోపలకు వెళ్ళి తలు

పులు వేసుకున్నాడు. చనువుగా నడిచి ఒక గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఒకామె వణుకుతూ నిలబడి వుంది.

"రాజేశ్వరీ, పని పూర్తయిందా?"

"అయింది. కానీ నాకేమో భయంగావుంది..."

"నిండా మునిగేక చలెందుకు?" అన్నాడతను.

నేలమీద తెరచివున్న ట్రంకువంక చూశాడతను. దృష్టిమార్చి మంచంమీద నిర్జీవ కళేబరాన్ని చూసి నిట్టూర్చాడు. "నువ్వు కాస్త సాయం చేయాలిమరి" అంటూ రాజేశ్వరివంక చూశాడు. ఇద్దరూకలిసి శవాన్ని ట్రంకులో సర్దారు. ట్రంకు మూత వేసేశారు. మోసుకుంటూ మధ్య హాల్లోకి తీసుకొచ్చారు.

అప్పుడతను తలుపుతీసి రిక్షాఅతన్ని పిలిచాడు. అతనూ రిక్షాఅతనూ కలసి ట్రంకుని రిక్షాలోకి పెట్టారు. "చాలా బరువుందండి, ఇంకో రూపాయైనా ఇవ్వాలండి" అన్నాడు రిక్షా అతను. అతను వాదించకుండా నవ్వి ఊరుకున్నాడు. రాజేశ్వరి ఇంటికి తాళం వేసింది.

ఇద్దరూ రిక్షా ఎక్కారు. రిక్షా గమ్యస్థానం చేరేదాకా ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. ఇద్దరి ఒంటికీ బాగా చెమటలు పట్టేశాయి.

రిక్షా గమ్యస్థానం చేరుకుంది. ట్రంకు ఇంట్లోకి చేరింది.

రాత్రి పదిగంటల ప్రాంతంలో ట్రంకు దొడ్లోకి చేర్చ బడింది. ట్రంకులోని శవం గోతిలోకి వెళ్ళిపోయింది. ఒకటికాదు, నాలుగు గోతులూ, ఇద్దరూ కలిసి కప్పెట్టే శారు. ఎక్కడా అనుమానం రాకుండా పైన సరిచేశారు.

ట్రంకు మళ్ళీ ఇంట్లోకి చేరింది.

రాజేశ్వరి అతనితో అంది. "ఈ ట్రంకు చాలా

కాలంగా ఉంటోంది. దీస్నావల పారేసినా ఎప్పటికైనా అనుమాన పరిస్థితులు కలుగవచ్చు. ఉత్తమమైన మార్గం దీనికి రంగు మార్పించడం. అప్పుడు దీనిమీద ఏవిధమైన ఆనవాలూ మిగలదు.''

అతను అంగీకార సూచనగా తలవూపాడు.

# 16

బాగా ఆలోచించేక కుసుమ ఒక నిర్ణయానికివచ్చింది' ప్రమాదకరమైన స్మగ్లింగ్ జీవితానికి స్వస్తిచెప్పి, ఒక ఇంటి ఇల్లాలుగా సుఖజీవనం చేయాలని ఆమెకు తోచింది.

రంగు మార్చడానికి అలవాటు పడ్డ రాజకీయ నాయకులు, నకిలీ ప్రేమికులు, ఆడవాళ్ళు - తమ జీవితాలను మార్చుకోవడం అంత సులభం కాదని ఆమెకు తెలుసు.

కానీ ఆనంద్ ప్రేమలో నిష్కల్మషత్వం కనబడుతోంది. అతని కళ్ళలో దృఢనిశ్చయం కనబడుతోంది. అవి ఆమెకు అతనిమీద నమ్మకాన్నీ, భవిష్యత్తుపై ఆశనూ కలిగిస్తున్నాయి.

ఏ విషయమూ నిర్ణయించుకుని ఈరోజు ఉదయం పది గంటలకు తనను వాళ్ళింటికి రమ్మన్నాడు ఆనంద్. కుసుమ లేచింది. రోడ్డుమీదకు వచ్చింది. కనపడిన రిక్షాను పిలిచింది.

రిక్షా ఆనంద్ ఇల్లుచేరింది. కానీ ఆయింటి తలుపులు తాళం వేసి వున్నాయి.

ఆమె నిరుత్సాహంగా కదిలి వెళ్ళబోయేలోగా ఇంటి ముందు యింకో రిక్షా ఆగింది. అందులోంచి రాజేశ్వరి దిగింది. తన ఇంటిముందు నిలబడ్డ కుసుమనుచూసి ఆశ్చర్యంగా ''మీరా?'' అంది.

"అవును. ఆనంద్‌తో చిన్నపనుండి వచ్చాను" అంది కుసుమ.

"లోపలకు రండి..." అంది రాజేశ్వరి.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. "మీకథ చాలావరకు నాకు ఆనంద్ చెప్పాడు. మీకోసం నన్ను వదులుకోవా లనికూడా అనుకున్నాడు. నేను అభ్యంతర పెట్టలేదు. ఆనంద్‌ను నేను తాత్కాలిక రక్షణకు చేరదీశాను తప్పితే అతన్ని నా భర్తగా పొందాలనుకోలేదు నేను. కానీ ఏమయిందో తెలియదు. ఒకరాత్రి అతను ఇంట్లో ఈచీటీ వదిలి వెళ్ళిపోయాడు, మిమ్మల్నీ నన్నూకూడా మోసం చేసి..."

రాజేశ్వరి ఓ కాగితాన్ని కుసుమ కిచ్చింది.

"రాజూ—

నిన్ను వదలుకోలేను. కుసుమ ఆశలు త్రుంచి వేయలేను. ఈ సమస్య నన్ను కలచివేస్తుంటే గతంలో నేనుచేసిన కొన్ని పాపాలు నన్ను దారుణంగా వెంట తరుముతుంటే, ఏం చేయాలో పాలుపోక ఇల్లువదిలి పోతున్నాను. బ్రతికుంటే, మనసు మారితే మళ్ళీ తిరిగివస్తాను. నా కోసం వెతకడానికి ప్రయత్నాలు చేస్తేమాత్రం నా శవమే మీకు దొరుకుతుంది."

క్రింద ఆనంద్ సంతకముంది. కుసుమ ఉత్తరం చదివి నిట్టూర్చింది.

"ఎందుకు వెళ్ళిపోయాడో తెలియదు. ఆఖరకు మీరూ నేనూకూడా కలిసి అతనితో జీవితం పంచుకోవడానికి నా కభ్యంతరం లేదని అతనికి స్పష్టం చేశాను" అంది రాజేశ్వరి.

"అక్కయ్యా" అంది కుసుమ అప్రయత్నంగా, "మీ హృదయం చాలామంచిది. ఆనంద్ మనసులో ఏదో దురుద్దేశ్యముంది. మనిద్దర్నీ కూడా అతను పొందగలిగాడు మోజు తీరిపోయిందని నా అనుమానం. ఏదో వంక పెట్టి పారిపోయాడు."

"నాకీ ఆలోచన రానేలేదుస్మీ..." అంది రాజేశ్వరి ఆశ్చర్యంగా.

"మంచి వాళ్ళెప్పుడూ ఒక కోణంనుంచే ఆలోచిస్తారు విషయాన్నన్ని కోణాలనుంచీ ఆలోచించడం నాబోటి పతితలకు తెలుసు. వస్తాను" అంటూ లేచింది కుసుమ. డిజప్పాయింటైన వాటం ఆమె ముఖంలో కనబడుతోంది.

ఆమె వెళ్ళిపోయేక తలుపు వేసుకుని ఆలోచనలో పడింది రాజేశ్వరి.

తను చేసిన పని ఎంతవరకూ సమంజసం?

ఈ ఉత్తరం విషయంలో కుసుమకు తను అబద్ధం చెప్పింది. నిజానికి ఉత్తరాన్ని తనే ఆనంద్ చేత వ్రాయించింది. రంగారావు బారినుండి రక్షించుకోవడం కోసం ఈ వుత్తరం వ్రాసి వెళ్ళమని తను ఆనంద్‌ను కోరింది. అతను రాసిన ఉత్తరాన్ని కుసుమకు మరోలా చెప్పింది!

అసలు రంగారావు విషయంలో తను ఆనంద్‌కు అబద్ధం చెప్పింది. అందులో తనకు దురుద్దేశ్యం లేదు. రంగారావు విషయంలో ఆనంద్ కూడా తనకు చాలా అబద్ధాలు చెప్పాడు.

ఆనంద్ చాలా తెలివిగా రంగారావుని హత్యచేసినప్పటికీ, తనెవరి దగ్గరయితే గది తాళాలు తీసుకున్నాడో ఆవ్యక్తి కుతూహలంకొద్దీ తనను రహస్యంగా గమనించే

అవకాశమున్నదని గ్రహించలేదు.

గది తాళాలిచ్చిన సూర్యం ఆఫీసుకి శెలవుపెట్టి— అతని చర్యలన్నిటినీ రహస్యంగా గమనించాడు. దిగ్భ్రాంతుడైపోయిన అతను చాలా భయపడ్డాడుకూడా. విషయాన్ని తనదాకా తేవడానికి కొంతకాలం పట్టింది. కాలం గడచిన కొద్ది అతనికి తనకు తెలిసిన రహస్యాన్ని రాజేశ్వరికి చెప్పాలనిపించింది. బహుశా రాజేశ్వరి అందం అందుకు కొంత కారణమై వుండవచ్చు.

సూర్యం మాటలు రాజేశ్వరి వెంటనే నమ్మలేదు. కానీ అతను చెప్పినది నిజమేనని కాలం చెప్పింది. ఆనంద్ స్వయంగా ఒప్పుకున్నాడు.

అన్యాయంగా తన భర్తను హత్యచేసిన ఆనంద్ మీద ఆమెకు చాలా కోపం వచ్చింది.

ఆనంద్ ఒక భయంకర హంతకుడని తెలిసేక అతనితో కాపురం చేయడానికి భయంగా వుంది. అదే సమయంలో అంత భయంకర హంతకుణ్ని ఒక ఆట ఆడించగలనన్న ధైర్యమూ ఆమెకుంది.

ఇంకో భయమేమిటంటే సూర్యంకూడా తన్నుకోరుతున్నాడు. అతని కాంక్ష బలమైనదిగా తోస్తోంది. అతనివద్ద ఆనంద్‌కు సంబంధించిన భయంకర రహస్యం దాగివుంది. ఆవిధంగా అతను చాలా ప్రమాదకరమైన వ్యక్తి.

ఒకే ఒరలో రెండు కత్తులిమడవు. సూర్యం సాయం తీసుకొని ఆనంద్‌నైనా, ఆనంద్ సాయం తీసుకొని సూర్యాన్నయినా హతమార్చాలి. ప్రస్తుతానికి అదే కావాలి.

అయితే ఇద్దరిలో ఎవరిని నిర్ణయించుకోవాలి? ఎవరి వైపు తను మొగ్గాలి.

బాగా ఆలోచించాక నే తను ఒక నిర్ణయానికొచ్చింది. సూర్యం సహాయంతో ఆనంద్‌ను హతమార్చటమే అన్ని విధాలా ఉత్తమంగా తోచింది.

## 17

దూరంగా రాజేశ్వరి, ఆమె ప్రక్కన ఒకమగవాడూ కనపడ్డారు కుసుమకు. మగవాడు ఒకషాపులోకి అడుగు పెడుతున్నాడు. ఎందుకో వెనక్కు తిరిగిన రాజేశ్వరిని కుసుమ గుర్తుపట్టింది.

"రాజేశ్వరీ—" అంది కుసుమ. మగవాడు షాపులోకి వెళ్ళిపోయాడు. రాజేశ్వరి మెట్లెక్కబోయినదల్లా ఆగి "ఎవరూ?" అంది. ఆమెమాటలు పూర్తయ్యేసరికి కుసుమ ఆమెను సమీపించింది.

"ఆనంద్ వచ్చాడా?" అంది కుసుమ ఉత్సాహంగా.

"లేదు—" అంది రాజేశ్వరి అయిష్టంగా.

"మరి షాపులోకెళ్ళిన దెవరు?"

"ఆనంద్ కాదు..."

"నాకు ఆనంద్‌లానే కనిపించాడు."

"కాదని నేను చెబుతున్నానుగా..."

"ఎవరయితే నేం_ఒకసారి పరిచయం చేయండి..." అంటూ తను షాపులోకి అడుగులు వేసింది. రాజేశ్వరి ఆమెను వారించడానికి ప్రయత్నించి విఫలురాలయింది.

ఇద్దరూ షాప్‌లో అడుగు పెట్టారు.

"రాజా, ట్రంకు తీసుకుపోవచ్చు నంటున్నాడు.

రంగు బాగుంది కదూ'' అంటూ అతను వెనక్కి తిరి గాడు.

అతన్ని చూసిన కుసుమ దెబ్బతింది. అతను ఆనంద్ కాదు.

''మీట్ మిస్టర్ సూర్యం...'' అంటూ రాజేశ్వరి పరిచయం చేస్తోంది.

కుసుమ ఆమె మాటలు వినడంలేదు. మెరుస్తున్న ట్రంకు పెట్టెనీ—సూర్యాన్నీ ఆమె మార్చిమార్చి చూస్తోంది. తను ఆనంద్‌కు చెప్పిన కల్పిత గాథ ఆమె మదిలో మెదుల్తోంది.

రాజేశ్వరికూడా మెరుస్తూన్న ట్రంకువంక అదోలా చూసింది. ఆమె కళ్ళలో లీలగా భయం తొంగి చూస్తోంది.

ఆనంద్‌కంటె సూర్యం అమాయకుడని తను భావించింది. అందుకని ఆనంద్ చెప్పిన ఉపాయంతో కుసుమ గురించి అతనుద్దేశించిన పథకంతో అతన్నే హతమార్చింది.

అయితే ఈ హత్యాకాండ యింతటితో ఆగుతుందా, సూర్యం, తనూ కలకాలం కలసి జీవించ గలుగుతారా?

కుసుమ కళ్ళలో ఏదో అనుమానం తొంగిచూస్తోంది. ట్రంకుపెట్టె కొత్తరంగు మెరుస్తోంది.

రాజేశ్వరి ప్రశ్నకు జవాబు దొరకలేదు. కాలమే మరి సమాధాన మివ్వాలి.

—: ఐపోయింది :—

# చావు కవిత్వం

అజీజ్

"హలో, ఇన్‌స్పెక్టర్! ఎక్కడికీ ప్రయాణం?" అన్న పరిచిత కంఠం విని వెనుదిరిగేను. ఆయన నాతో బాటు క్రయింబ్రాంచిలో పనిచేసి ఈ మధ్యే రిటైరైన సీనియర్ ఇన్‌స్పెక్టర్.

"హలో సార్! బావున్నారా?" అన్నాను షేక్‌హేండ్ ఇస్తూ.

"ఆఁ, ఏం బావులే! రిటైరయ్యాక కుటుంబ సమస్యలు ప్రాణం తోడేస్తున్నాయనుకో. ఈమధ్యే మా చిన్నమ్మాయికి రాజమండ్రిలో ఓ సంబంధం ఖాయం జేశాం. ఆ పనిమీదే ఇప్పుడు వెళుతూంట... ఇంతకీ నువెక్కడికీ? మళ్ళీ ఏదైనా ఇన్వెస్టిగేషన్‌లో ఇరుక్కున్నావా?"

"నో సర్! ఈ హత్యలూ, ఖూనీలతో విసిగి నెల రోజులు సెలవు పెట్టి, త్రివేంద్రంలో ఉంటున్న మా అక్కయ్య యింటికి వెళ్తున్నాను, కొన్ని రోజులు ప్రశాంతంగా గడపాలని. బావగారక్కడ ప్రాజెక్ట్ ఇంజినీర్ గా పనిచేస్తున్నారు."

మా మధ్య మాటలు తుంచివేస్తూ, స్పీకర్ లో రాజమండ్రి మెయిల్ బయలుదేరబోతున్నట్టు ఎనౌన్స్ చెయ్యడంతో ఆయన నా భుజం తట్టి, "ఓ.కే. రాజారెడ్డీ! విష్ యూ బెస్టాఫ్ జర్నీ. వస్తాను" అంటూ వెళ్ళిపోయేడు.

రిస్టు వాచీ చూసుకున్నాను.

రాత్రి ఎనిమిది గంటలు.

అది మద్రాసు సెంట్రల్ స్టేషన్. వచ్చే పోయే రైళ్ళతో, ప్రయాణీకులతో ప్లేట్ ఫారమ్స్ రద్దీగా ఉన్నాయి.

నేను వెళ్ళవలసిన త్రివేంద్రం బండి ఎనిమిదిన్నరకి ఉంది.

టికెట్ తీసుకుని ఎదురుచూస్తున్నాను బండికోసం.

రైట్ టైంకు పదినిముషాలు లేట్ వచ్చింది. సూట్ కేస్ అందుకుని ఫస్ట్ క్లాస్ కంపార్ట్ మెంట్ లో దూరేను.

"ఆ నాలుగో కేబిన్ ఖాళీగా ఉంది సార్!" అన్నాడు కండక్టర్.

"త్రివేంద్రం ఎన్ని గంటలకి చేరుతుంది బండి?" అడిగేను.

"ఉదయం ఆరున్నరకి!"

"త్రివేంద్రం చేరగానే కాస్త నిద్ర లేపాలి నన్ను!" తలూపేడు కండక్టర్.

కేబిన్‌లో వెళ్ళి, సూట్‌కేస్ పై బెర్త్‌మీద పెట్టేను. ట్రేన్ కదలగానే కేబిన్ తలుపు మూసి, బెర్త్‌మీద నడుం వాల్చేను.

చాలా రోజుల తరువాత వెళుతున్నాను అక్కయ్య ఇంటికి. నెల రోజులు హాయిగా గడపొచ్చు. ఆలోచిస్తూ కమ్మని నిదరలోకి జారుకున్నాను.

తెల తెలవారుతుండగా కేబిన్ తలుపు తట్టి లేపేడు కండక్టర్. కిటికీలోంచి తొంగి చూసేను. ట్రివేండ్రం వచ్చేసింది!

సూట్‌కేస్ అందుకుని కేబిన్‌లోంచి బైటికి వచ్చేను. కారిడార్ గుండా ఒక్కో కేబిన్ దాటుకుంటూ తలుపు వైపు నడుస్తున్నాను. చివరి కేబిన్‌లో, కండక్టర్ ఓ వ్యక్తిని తట్టి లేపుతున్నాడు.

ఆ దృశ్యం చూడగానే, ఎందుకో నాకాళ్ళు బ్రేకులు వేసినట్టు ఆగిపోయేయి. కారణం, ఎంత తట్టి లేపడానికి ప్రయత్నిస్తున్నా ఆ వ్యక్తి లేవడం లేదు! అంత మొద్దు నిదర ఎవ్వరూ పోరు.

చూద్దామని లోన అడుగు పెట్టేను.

పై బెర్తుమీద అటు తిరిగి పడుకున్నాడతను.

"చూడండి సార్! అరిచి నా గొంతెండి పోతోంది. ఇంకా కుంభకర్ణుడు నయం. ఈపాటికి లేచేవాడు. ఈయనగారికి చీమ కుట్టినట్టుకూడా లేదు" అన్నాడు కండక్టర్ మొహం చిట్లిస్తూ.

ఆ ఊపులకి ఆ వ్యక్తి కాళ్ళదగ్గిరున్న న్యూస్ పేపరు ఒకటి జారి కిందపడింది. అప్రయత్నంగా దాన్ని అందుకున్నాను.

కండక్టర్ ఓడిపోయినట్టు, "ఇహ నావల్ల కాదు సార్!" అంటూ అవతలికెళ్ళబోయేడు.

అతన్ని ఆపి, అటుతిరిగి పడుకున్న ఆ వ్యక్తి భుజం పట్టి మా వైపు తిప్పేను.

అంతే!

కండక్టర్ కెవ్వుమన్నాడు!

క్షణంపాటు నాకూ మతిపోయింది.

ఆవ్యక్తి నుదురుమధ్య గుండ్రని రంధ్రం. ఆ రంధ్రం లోంచి చారలు చారలుగా మొహంమీద కారి, ఎండి పోయిన రక్తం. కళ్ళు రెండూ తెరచి వున్నాయి. ఆ కళ్ళల్లో జీవకళ శూన్యం.

"మైగాడ్! హత్య!" అన్నాడు కండక్టర్ వణుకుతూ.

ప్రాణంపోయి చాలా సేపయ్యుంటుంది. శరీరం కర్రలా బిగుసుకుపోయింది.

"ఏ స్టేషన్‌లో ట్రేన్ ఎక్కేడితను?"

"మద్రాసులో సార్!"

"ఈ కేబిన్‌లో ఇతనివెంట ఇంకెవ్వరు ప్రయాణం చేసారు?"

"ఎవ్వరూ చెయ్యలేదు సార్, మద్రాసునుంచి ఒకడే వస్తున్నాడు."

"కేబిన్‌లో ఎవ్వరూ ప్రవేశించకుండా హత్య జరగడం అసంభవం. బాగా జ్ఞాపకం చేసుకొని చెప్పు!" అన్నాను.

కండక్టర్ కాసేపు ఆలోచించి "ఆఁ, గుర్తొచ్చింది సార్! మద్రాసులో ట్రేన్ బయలుదేరేక ఈ కాబిన్‌లో ఓ వ్యక్తి ఇతనితో మాట్లాడుతూ నిల్చోడం చూశాను.

అతని తలమీద ఫెల్ట్ హేట్ వుంది. లాంగ్ కోటు వేసుకున్నాడు. వీపు తలుపువైపు వుంది..."

"వారి మాటలు నీకు వినిపించలేదా?"

"ఒకే ఒక వాక్యం వినగలిగేను సార్! ఇతను ఆ వ్యక్తితో 'ఆ ఖ్యాతి నాది, నాది!' అంటున్నాడు. బండి ప్లాట్ ఫాం విడుస్తుండగా, ఆవ్యక్తి కేబిన్ తలుపుమూసి నడుస్తున్న ట్రేన్ లోంచి దిగిపోయేడు సార్..."

"అతన్ని మళ్ళీచూస్తే గుర్తుపట్టగలవా?

కండక్టర్ కాసేపు ఆలోచించి, "గుర్తు పట్టగలను సార్!" అన్నాడు.

ఆలోచిస్తూ మరోసారి శవాన్ని చూసేను. శవం తల గడవైపు పెద్దసూట్ కేస్ వుంది. శవం దుస్తులూ, సామానులు వెదికితే, అతని వ్యక్తిగత వివరాలు తెలుస్తాయి.

ఆ జంజాటం నాకొద్దు. కృష్ణా రామా అంటూ కొన్నాళ్ళు కులాసాగా గడుపుదామని వచ్చేను. మళ్ళీ ఇలాటి రొంపిలో ఇరుక్కోడం బుద్ధితక్కువ.

"వెంటనే రైల్వే పోలీసులకి వివరాలు తెలియచేయ్. నే వెళతాను" అంటూ సూట్ కేసు అందుకొని ట్రేన్ దిగేను.

నన్ను రిసీవ్ చేసుకోటానికి స్టేషన్ వస్తున్నట్టు బావ ఉత్తరం రాసేడు. ఆయన కోసం ప్లేట్ ఫాం ఆ చివరి నుంచి ఈ చివరివరకు వెతికేను. కనిపించలేదు. ఓ కప్పు వేడివేడి టీ తాగివెళదామని స్టేషన్ కాంటీన్ లో దూరి ఓ టేబిల్ ముందు కూర్చున్నాను.

## 2

బేరర్ రాగానే టీకి ఆర్డరిచ్చేను. అప్పుడు పడింది దృష్టి నా చేతిలోవున్న న్యూస్ పేపర్ మీద! కేబిన్

లోంచి అనాలోచితంగా పట్టుకొచ్చానుదాన్ని.

టీ వచ్చేవరకూ తిరగేసి చూద్దామని పేపర్ విప్పేను. మద్రాసునుంచి వెలువడే ఇంగ్లీష్ పేపరు అది. అనుకోకుండా నా దృష్టి ఒకచోట నిలచింది.

సాధారణంగా పేపర్ నాలుగుపక్కలా కొంత ఖాళీ స్థలం వుంటుంది. మధ్యపేజీ కుడివైపు ఖాళీస్థలంలో, పెన్సిల్‌తో పద్యంలాంటి పంక్తులు ఒద్దికగా రాసి వున్నాయి. నాదృష్టిని ఆకట్టుకున్నవి అవే!

'ఎక్కడైతే ఎడారి పాడుతుందో...
ఎక్కడైతే శిధిలాలు కరుగుతాయో...
ఎక్కడైతే జంతువులు మాట్లాడుతాయో...
ఎక్కడైతే సముద్రం ఇగిరిపోతుందో...
అక్కడేవుంది భూలోక స్వర్గం!'

చదివి కాస్సేపు తెల్లబోయాను! నాకు కవిత్వంపట్ల అట్టే ఆసక్తిలేదు. ఐనా పద్యాలూ, గద్యాలూ చదివి అంతో ఇంతో అర్థం చేసుకోగలను.

కవిత్వం అనేది ఛందస్సూ, వ్యాకరణాల మీద ఆధారపడి వుంటుంది. ఈపద్యంలో అటు ఛందస్సుగానీ ఇటు వ్యాకరణంగానీ, ఒక అర్థంగానీ ఏమీ కనుపించడం లేదు.

అసలిది పద్యమేనా? లేక, ఉబుసుపోకకి రాసిన పిచ్చిరాతా? లేక, ఇందులో ఏదయినా గూడార్థం దాగివుందా?

ఆలోచిస్తున్న నా కళ్ళలో ఇంతకుముందు చూసిన శవం మళ్ళీ ప్రత్యక్షమైనది. ఇరవై ఎనిమిదేళ్ళు వుండి వుంటాయతనికి. పెద్దపెద్ద కళ్ళు, ఉంగరాల జుత్తు,

మృత్యువు వల్ల మొహంకాస్త వికృతంగా మారినా, బ్రతివున్నప్పుడు మనిషి అందగాడే అయుంటాడు.

పాపం ఎవ్వరో దురదృష్టవంతుడు.

నాచూపులు మళ్ళీ పేపరుమీదకి మళ్ళేయి. అతను కవి అయుంటాడా? లేక, కొత్తగా కవిత్వం రాయటానికి తంటాలు పడుతున్నాడా? అర్థంపర్థంలేని ఇదేం కవిత్వం మరి?

ఎక్కడైనా ఎడారి పాడుతుందా? శిధిలాలు నడుస్తాయా? జంతువులు మాట్లాడుకొంటాయా? సముద్రం ఇగిరిపోతుందా? అంతా హాస్యాస్పదంగా వుంది. చివర్న 'అక్కడే ఉంది భూలోక స్వర్గం!' అంటున్నాడు.

ఈ ఒక వాక్యంలోనే ఏదో గాంభీర్యం ద్యోతకమాతున్నది. ఇది ఉబుసుపోకకి రాసిన రాతేనా? లేక, ఇందులో ఏదైనా గూడార్థం ఇమిడివుందా? ఆ గూడార్థమే అతని ప్రాణాంతకం కాలేదు కదా?

తీవ్రంగా ఆలోచిస్తోంది అలవాటుపడ్డ నామస్తిష్కం దారినపోయే ఓ కథారచయిత కళ్ళముందు, ఏదయినా చిన్న సంఘటన జరిగిందీ అంటే, అందులో మరి నాలుగు మసాళాలు మేళవించి, ఓఘాటైన కథరాసే వరకూ అతని ప్రాణం ఊరుకోదు.

అట్లాగే మా పోలీస్ డిపార్టుమెంట్ వారికి ఇటువంటి స్యూరియస్ సంఘటనలు ఎదురయితే, వాటి లోతుపాతులు సాంతం తవ్విచూడందే మనసు తెరిపిన పడిచావదు.

ఇందులో నాకు ఒరిగేదీ, తరిగేదీ ఏమీలేదు. కాని, నా కుతూహల మన స్తత్వం ఓ పట్టాన వదిలిపెట్టనివ్వడం

లేదు. బేరర్ టీ పట్టుకురావడంతో ఆలోచనలు చెదిరి పోయేయి.

కప్పు ఖాళీచేసి లేవబోతుండగా "ఇక్కడ కూర్చున్నావటోయ్! నీకోసం ప్లాట్ ఫాం అంతా వెదికి విసిగి పోయాననుకో" అన్న బావ కంఠం విని వెనుదిరిగాను.

లేచి నవ్వుతూ షేక్ హాండ్ ఇచ్చేను. "రెండు నిమిషాలు లేటయింది నేను రావడానికి. పదపద మీ అక్కయ్యా, రవీ నీకోసం కళ్ళల్లో వత్తులేసుకొని ఎదురు చూస్తున్నారు" అన్నాడు తొందర పెడుతూ.

బిల్ పే చేసి, సూట్ కేసుతో ఆయన వెనుక స్టేషన్ బయటకు వచ్చేను. అప్పుడే ఓ అంబులెన్సు కదులుతుండటం కనిపించింది. బహుశా, రైల్వే పోలీసులు ఆ యువకుడి శవాన్ని పోస్టుమార్టంకు తరలిస్తున్నారు కాబోలు.

పార్కింగ్ లో బావ ఆఫీసుజీప్ ఆగివుంది. ఇద్దరం ఎక్కి కూర్చొన్నాం. డ్రైవర్ జీప్ స్టార్టుచేశాడు. నా ఆలోచనలు మాత్రం ఆ యువకుడి చుట్టే భ్రమరనాదం చేస్తున్నాయి. ఆ కవిత్వం గురించి, బావ ఏదయినా అభిప్రాయంవ్యక్తంచేస్తాడేమోచూద్దామని ఆ టాపిక్ ఎత్తేను.

"ట్రేన్ లో నాతోబాటు ఓ వ్యక్తి ప్రయాణం చేసేడు. అతనికి కవిత్వం పిచ్చి కాస్త ఎక్కువ మోతాదులో వున్నట్టుంది. దారి పొడవునా తను రాసిన కొత్త పద్యాలు వినిపిస్తూ వచ్చేడు.

అందులో ఒకపద్యంలోని అర్థం ఎంత ప్రయత్నించినా నా కర్థం కాలేదు. కాలేజీ లైఫ్ లో, నువ్వుకూడా ఏవో పిల్లకవిత్వాలు అల్లేవాడివటగా? ఏదీ ఆ పద్యంలోని అర్థం ఏమిటో కాస్త వివరించు చూద్దాం!" అన్నాను.

"ఏమిటా పద్యం?" అడిగేడు బావ.

దాన్ని యధాతథంగా వినిపించేను ఆయనకి.

అంతా విన్న బావ పకపక నవ్వి, "ఏ మహానుభావు డైతే ఈ పద్యం నీకు వినిపించేడో, అతన్ని అడిగేవా? పిచ్చాసుపత్రినించి పారిపోయి ఎన్నాళ్ళయిందని?" అన్నాడు నవ్వాపుకుంటూ.

"నీకూ అర్థం కాకపోతే ఊరుకోరాదూ? అనవసరంగా ఇతర్లని ఎగతాళి చెయ్యడం దేనికి?" అన్నాను.

"ఇదీ ఒక పద్యమేనటోయ్? నిజంగా ఇది పద్యమే అయుంటే, ఆ మహానుభావుడెవ్వరో ఆధునిక కవి అయుంటాడు. ఆధునిక కవిత్వాలూ, చిత్రాలూ, శిల్పాలూ ఇలాగే ఉంటాయి మరి మానవమాత్రుడికి అర్థం కాకుండా!"

ఈయనదంతా హాస్య ధోరణి. ప్రతిదానికీ నవ్వుతూ, నవ్విస్తూ ఉంటాడు.

నాదంతా సీరియస్ ధోరణి మరి!

ఇంటిముందు జీప్ ఆగేవరకూ నేను ఆలోచిస్తూనే ఉన్నాను. మెట్లమీద అక్కయ్య బాబునెత్తుకుని మా కోసమే ఎదురుచూస్తున్నట్టు నిల్చునుంది. నేను జీప్ దిగగానే, ఐదేళ్ళ ఆ చిట్టివెధవ చేతులాడిస్తూ, "పోలీస్ మావయ్యొచ్చాడు... పోలీస్ మావయ్యొచ్చాడు!" అంటూ కేరింతలు కొట్టసాగేడు.

ముందు అక్కయ్య పాదాలు తాకి, తరవాత వాణ్ణెత్తుకుని మొహమంతా ముద్దులతో నింపేను. జానెడు చేతులు నా మెడచుట్టూ వేసి రాగాలు పోతున్నాడు.

"మీ మావయ్యని కాస్త ఊపిరన్నా తీసుకోనివ్వరా

బాబూ!'' అంటూ వాడి బుర్రమీద చిన్న మొట్టికాయ వేసేడు బావ.

''వచ్చినవాణ్ని గుమ్మంలోనే నిల్చోబెడదారేమిటీ? లోపలికి రానివ్వండి!'' అంటూ ఇంట్లోకి నడిచింది అక్కయ్య.

డ్రైవర్ సూట్ కేస్ తెచ్చి ఇంట్లో పెట్టేడు.

''మావయ్యా! నాకోసం ఏం తెచ్చావ్''అడిగేడు రవి.

''కొత్తగా మార్కెట్లో వచ్చిన బొమ్మలన్నీ తెచ్చాను'' అంటూ సూట్ కేస్ తెరిచి వాడికోసం తెచ్చిన రకరకాల మరబొమ్మలు తీసిచ్చేను.

అవి చూడగానే వాడి ఆనందానికి పట్టపగ్గాలు తప్పేయి. ఆదరాబాదరా ఒక్కొక్కదానికి కీ ఇస్తూ ఆడించసాగేడు.

''స్నానానికి నీళ్ళు తోడేను. పోసుకో. అలసట తీరుతుంది... అ(హా(! వీడికోసం బొమ్మలకొలువొకటి పట్టుకొచ్చావన్నమాట. రేపీపాటికి చూడు. వాటి కాళ్ళూ, చేతులూ ఉంటాయేమో'' అంది అక్కయ్య ఆడుకుంటున్న రవిని చూసి.

''చూడు మావయ్యా! అమ్మ ఒక్క బొమ్మకూడా కొనివ్వదు'' అన్నాడు రవి తల్లిమీద ఫిర్యాదు చేస్తూ.

''నువ్వు వాటి కాళ్ళూ చేతులూ బుద్ధిగా ఉండనిస్తేగా కొనిచ్చేది?... వీడి ఫిర్యాదుకేంగానీ, నువ్వెళ్ళి త్వరగా స్నానం కానివ్వు. నీళ్లు చల్లారిపోతాయి.'' అంది అక్కయ్య నాతో.

బట్టలు మార్చుకుని బాత్ రూంవైపు నడిచేను.

# 3

మర్నాడు అందరం డైనింగ్ హాల్లో కూర్చుని బ్రేక్ ఫాస్ట్ చేస్తున్నాం.

రవి ముద్దుగా ఏవేవో కబుర్లు చెబుతున్నాడు నాతో.

“మామా, అల్లుళ్ళకి మంచి పొత్తు కుదిరింది. ఏమోయ్, త్వరగా పెళ్ళిచేసుకుని మావాడికో పెళ్ళాన్ని కనివ్వరాదూ?” అంటూ ఛలోక్తి విసిరేడు బావ.

“ఏరా? నీకిప్పుడే పెళ్ళాం కావాలా?” అడిగేను రవిని.

అదేదో కొత్తబొమ్మ ఉంటుందనుకుని,“ ఓ! కావాలి. ఆడుకుంటా!” అన్నాడు.

పకపక నవ్వేశాం ముగ్గురం.

అంతలో కాలింగ్ బెల్ మోగింది అవతలి గదిలో.

బావ పనిమనిషిని పిలిచి, “చూడు. ఎవ్వరో?” అన్నాడు.

పనిమనిషి వెళ్ళి వచ్చి, “నంబియార్ గారొచ్చారండి!” అంది.

“నంబియారా? రమ్మను. రమ్మను.” అన్నాడు బావ.

రెండు నిమిషాల తరవాత ఓ నలభై ఏళ్ళ వ్యక్తి నవ్వుతూ నిర్మొహమాటంగా వచ్చేడు డైనింగ్ టేబిల్ దగ్గరికి.

“హల్లో నంబియార్! టూర్నించి ఎప్పుడొచ్చావ్?” అంటూ లేచి ఎడంచేత్తోనే అతనికి షేక్ హాండ్ ఇచ్చేడు బావ.

“నిన్ననే వచ్చాను. ఇహ వారంరోజులు సెలవే... బావున్నావా అమ్మా? రవీ! హవార్ యూ?” అన్నాడాయన అందర్నీ పలకరిస్తూ.

"మీట్ హిమ్! మై బ్రదర్ ఇన్ లా, ది గ్రేట్ డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ రాజారెడ్డి... ఈయన నంబియార్ అని నా థిక్ ఫ్రెండ్! మర్చంట్ నేవీలో రేడియో ఇంజనీర్ గా పనిచేస్తున్నాడు. దమ్మిడీ ఖర్చు పెట్టకుండా ప్రపంచం చుట్టి వస్తుంటాడు ఓడల్లో!" అంటూ పరస్పరం మమ్మల్ని పరిచయం చేసేడు బావ.

ఇద్దరం కరచాలనం చేసుకున్నాం. నంబియార్ కూర్చున్నాక, అక్కయ్య కాఫీ కలిపి ఆయన ముందు వుంచింది.

అప్పుడు తట్టింది నాకు సడన్ గా ఓ ఆలోచన. నంబియార్ ఓడల్లో దేశదేశాలు తిరుగుతూ, చిత్రవిచిత్రమైన అనుభవాలెన్నో గడించిన వ్యక్తి. ఆయన్ని ఆ పద్యంలోని విశేషాల గురించి ప్రశ్నిస్తే ఏమైనా తేలవచ్చు—అనుకుంటూ నంబియార్ వైపు తిరిగేను.

"ఉద్యోగరీత్యా మీరు దాదాపు ప్రపంచ దేశాలన్నీ చుట్టి వుంటారు. చిత్రవిచిత్ర ప్రదేశాలెన్నో చూసి వుంటారు. పాడే ఎడారిగురించి ఎక్కడైనా వినడం జరిగిందా?" అడిగేను.

'లేదు, వినలేదు!' అంటాడనుకున్న నంబియార్, చిన్నగా తలూపి, "వినడం ఏమిటి? స్వయంగా చూసేను!" అనడంతో నా మనసు ఉరకలు వేసింది.

"ఎక్కడుంది ఆ ఎడారి? దయచేసి కాస్త వివరంగా చెప్పండి" అన్నాను ఆతృతగా.

"హిందూమహాసముద్రంలో మనదేశానికి సంబంధించిన అనేక చిన్నా పెద్దా దీవులున్నాయి. అందులో సాన్ ద్వీపం ఒకటి. ఆ దీవి యావత్తూ ఇసుకతో నిండి

వుంటుంది ఎడారిలా! సముద్రం మీదుగా ప్రచండ గాలులు వీచినప్పుడు ఆ యిసుక ఒకచోటునుంచి మరో చోటుకి రివ్వున ఎగురుతుంది.

ఆ వేగానికి ఇసుక రేణువులు పరస్పరం రాసుకొని గాలిలో ఒక విచిత్ర శబ్దం సృష్టిస్తాయి. దానికి తోడు సముద్రం హోరు కలిసి, ఏదో వింత సంగీతంలా వినిపిస్తుంది. సాన్ అంటే స్థానిక భాషలో సంగీతం!" అని అన్నాడు నంబియార్.

ఎంత ఆశ్చర్యం! ఏ పద్యానికైతే అర్థం లేదనుకున్నానో, ఆ పద్యంలోనే ఇప్పుడు వింత అర్థాలు వెలికి వస్తున్నాయి.

"శిధిలాలు కదలడం ఎక్కడైనా చూశారా?" అడిగేను అప్రయత్నంగా.

"చూసాను! సాన్ ద్వీపానికి మైలు దూరంలో సమ్ ద్వీపం వుంది. దానిపై ఒకప్పుడు మనుషులు నివసించేవారేమో, ఇప్పుడక్కడ శిధిలాలూ, రాళ్ళూ రప్పలూ తప్ప జీవరాశి లేదు.

ఆ ద్వీపంలోనే ఓ అగ్నిపర్వతం వుంది. ఏ కాలంలోనో అది పగిలి ,అక్కడ జీవరాశిని తుడిచిపెట్టి వుంటుంది. అందుకే అక్కడ మనుషులు మళ్ళీ స్థిరపడలేదనుకుంటాను.

తరవాత ఆ పర్వతం మళ్ళీ పగలలేదు కానీ, పర్వతం క్రింద లావా అప్పుడప్పుడూ చలించడం వల్ల ద్వీపం భూప్రకంపనానికి గురై అటూఇటూ ఊగుతోంది. దాంతో దానిపైవున్న శిధిలాలూ, రాళ్ళూ రప్పలూ కూడా కదులుతుంటాయి" అన్నాడు నంబియార్.

"ప్రపంచంలో మాట్లాడే పక్షులున్నాయని అందరికి తెలిసిందే! రామచిలుక అచ్చు మనిషిలా మాటాడ గలుగుతుంది. కాని, మాటాడే జంతువుల గురించి ఎక్కడైనా విన్నారా మీరు?" అడిగేను.

నంబియార్ నవ్వేడు. "సీల్ జాతి చేపల గురించి మీరు చదవలేదా? ఆ రెండు ద్వీపాల చుట్టుప్రక్కల సముద్రంలో, సీల్ జాతి చేపలు అధికంగా నివసిస్తాయి. అవి తమ భాషలో విచిత్ర శబ్దాలుతీస్తూ పరస్పరం మాట్లాడుకుంటాయి."

"ఒక సముద్రం యావత్తూ నేలలో ఇగిరిపోతుందని నేంనంటే మీరు నమ్మగలరా?" అడిగేను చివరిసారిగా.

ఈసారి నంబియార్ పెద్దగా నవ్వి "ఎడారి ప్రదేశాలలో సముద్రమేమిటి? మహా సముద్రాలే ఇగిరి పోతాయి కదా?" అన్నాడు.

తరువాత ఆయన ఏదో ఎంగేజ్ మెంట్ వుందని, సెలవు తీసుకొని వెళ్ళిపోయేడు. బావకూడా తయారై ఆఫీస్ కెళ్ళిపోయేడు జీప్ లో. రవి కాన్వెంట్ లో కె. జి. క్లాస్ చదువుతున్నాడు. నేనొచ్చినందుకు ఈ రోజు వెళ్ళనని మారాంచేసి వుండిపోయేడు ఇంట్లో.

# 4

నా మస్తిష్కం నంబియార్ చెప్పిన విషయాలమీదే తీవ్రంగా ఆలోచిస్తోంది.

చనిపోయిన ఆ యువకుడు, పేపర్ మీద పెన్సిలుతో రాసిన ఆ పద్యం ఊరికే ఉబుసుపోకకి రాయలేదనీ, ఆ వాక్యాల్లో అందరికీ అర్థంకాని అర్థాలు కొన్ని యిమిడి ఉన్నాయని స్పష్టమయింది.

చివర్న 'అక్కడే ఉంది భూలోక స్వర్గం!' అని రాసేడు.

ఏమిటది? ఏమిటి? ఏమిటి?

నంబియార్ చెప్పిన ఆ రెండు ద్వీపాల్లో ఏదయినా గుప్తనిధి దాగివుందా? ఇక్కణ్నించి సముద్రంగుండా ప్రయాణిస్తే, ఆ ద్వీపాలను త్వరగా చేరుకోవచ్చు. ఆ రహస్యాన్ని ఎలాగో కనుక్కున్న ఆ యువకుడు ఆ దీవులకెళ్ళి ఆ నిధిని చేజిక్కించుకుందామని ప్రయాణమయ్యేడా? ఆ ప్రయత్నంలోనే వున్న మరెవ్వరో అది అతని పరం కాకుండా మార్గమధ్యలోనే అతన్ని హత్య చేసేరా?

మద్రాసు స్టేషన్‌నుంచి బండి బయలుదేరేక, ఆ యువకుడి కేబిన్‌లో ఎవ్వరో ఒకతన్ని చూసేననీ, బండిప్లాట్‌ఫాం దాటబోతుండగా అతను దిగిపోయేడనీ చెప్పేడు కండక్టర్.

సందేహంలేదు. ఆ యువకుణ్ని చంపిన వ్యక్తిఅతనే! ఇంతలో, బావ ప్యూన్‌వచ్చి ఆరోజు న్యూస్‌పేపర్ ఇచ్చి వెళ్ళేడు. మొదటి పేజీలోనే ఆ యువకుడి శవం ఫోటో, తదితర వివరాలూ ప్రచురించేరు.

ఆత్రుతగా చదవసాగేను.

'ట్రేన్‌లో యువకుడి శవం!

త్రివేంద్రం, 9 జులై :- నిన్న ఉదయం ఆరున్నరకి త్రివేంద్రం చేరిన మెడ్రాస్ ఎక్స్‌ప్రెస్ ఫస్ట్‌క్లాస్ బోగీలో ఓ యువకుడి శవం బైటపడింది. ఎవ్వరో అతన్ని పిస్తోలుతో కాల్చి చంపేరు.

రైల్వే పోలీసులు శవం దుస్తులు తనిఖీచెయ్యగా,కొన్ని

కాగితాలు దొరికేయి. వాటి ఆధారంతో అతని పేరు నరేంద్రబోస్ అనీ, కలకత్తా నివాసి అనీ తెలిసింది. విచిత్రం ఏమిటంటే, అతని సూట్ కేసులోవున్న దుస్తుల మీదా దేశదేశాల లేబిల్స్ అంటించివున్నాయి.

చొక్కా కాలర్ పై హాంగ్ కాంగ్ గుర్తులూ, బూట్ల లోపల ఇండోనీషియా గుర్తులూ, రెడీమేడ్ పాంట్లపై టోక్యో గుర్తులూ వున్నాయి...పోలీస్ ఉన్నతాధికార్ల పర్యవేక్షణలో దర్యాప్తు చురుకుగా సాగుతోంది.'

పేపర్ మడిచి సిగరెట్ అంటించేను. కలకత్తానివాసి అయిన ఆ యువకుడు ఇంతదూరం ప్రయాణం కట్టడం, అతని వస్తువులమీద విదేశీ గుర్తులుండటం అంతా అగమ్యగోచరంగా వుంది.

అతను తరచూ విదేశాలు పర్యటిస్తుండేవాడా? అంత ధనవంతుడా? ఆపద్యం చివర ఉదహరించిన భూలోక స్వర్గం ఎక్కడుంది? ఏమిటిది? ఎలా కనుక్కోడం?

తీవ్రంగా ఆలోచిస్తున్న నాలో తళుక్కుమంది ఓ ఆలోచన. వెంటనేలేచి నా గదిలోకెళ్ళాను. సూట్ కేస్ తెరిచి రైటింగ్ పేడ్, చెక్ బుక్ అందుకున్నాను. టేబిల్ ముందు కూర్చుని, మద్రాసునుంచి వెలువడే రెండు మూడు దిన పత్రికలకు ఓ ప్రకటన తయారు చెయ్యసాగేను.

'ఎక్కడైతే ఎడారి పాడుతుందో...
ఎక్కడైతే శిథిలాలు కదులుతాయో...
ఎక్కడైతే జంతువులు మాట్లాడుతాయో...
ఎక్కడైతే సముద్రం ఇగిరిపోతుందో...
అక్కడేవుంది భూలోక స్వర్గం!'

ఈ పద్యంలోని అర్థాలు ఎవ్వరికయినా తెలిస్తే దయచేసి ఈ క్రింది చిరునామాతో సంప్రదించండి.' అని రాసి, పత్రికా ప్రకటనలకయ్యే డబ్బు చెక్కు రూపంలో జత చేసి విడివిడిగా కవర్లో పెట్టి అతికించేను.

ఆ యువకుణ్ని చంపిన హంతకుడు పత్రికల్లో ఈ ప్రకటన గనక చదివితే, ఆ పద్యంలో నిజంగా ఏదయినా రహస్యం దాగివుంటే తప్పకుండా నన్ను వెతుక్కుంటూ వస్తాడు.

అలా కాని పక్షంలో, ఇక ఇవన్నీ బుర్రలోంచి దులిపేసి బుద్ధిగా ఊరుకోడం ఉత్తమం! ఆ కవర్లు అందుకుని, అక్కయ్యతో బజారెళ్ళొస్తానని చెప్పి తిన్నగా పోస్టాఫీస్ చేరుకున్నాను.

కవర్లు రిజిస్టర్డ్ పోస్ట్ చేసే వరకూ మనసు తెరిపిన పడలేదు.

## 5

రెండవరోజు దినపత్రికల్లో నేను పంపిన ప్రకటన ప్రచురించబడింది. పత్రికవాళ్ళు ఒక్కో కాపీ నాకు ఉచితంగా పంపేరు. ఏం జరుగుతుందో చూద్దామని, మనసు చిత్రమైన కుతూహలంతో కొట్టుకుంటోంది.

పత్రికల్లో ప్రకటనపడి మూడు రోజులయినా ఒక్క ఉత్తరంగానీ, మనిషిగానీ రాలేదు. పడ్డ శ్రమంతా దండగ అయిందని చిన్నబోయేను. ఇక ఆ సంఘటన్ని పూర్తిగా మరిచిపోవడం మంచిదనిపించింది.

ఆరోజు ఉదయం బ్రేక్‌ఫాస్ట్ ముగించి, నా గదిలో ఓ ఆంగ్ల నవల చదువుతూ కూర్చున్నాను. బావ ఆఫీస్ కెళ్ళిపోయేడు. అక్కయ్య వంటగదిలో ఏదో సర్దుతోంది.

ఇంతలో రవి జారిపోతున్న పొట్టి నిక్కరు మీదికి లాక్కుంటూ పరిగెత్తుకొచ్చి "మావయ్యా! మావయ్యా! నీకోసం ఎవరో వచ్చారు," అన్నాడు.

"నాకోసమా?" అన్నాను ఆశ్చర్యంతో.

వాడేదో చెప్పబోతుండగా అక్కయ్య వచ్చి — "ఎవరో వచ్చార్రా నీకోసం! అర్జంటుగా కలవాలిట!" అంది.

ఆ ప్రకటన బాపతేనా? అనుకుంటూ పుస్తకం పక్కన పడేసి గబగబ ముందుగదిలోకి వెళ్ళాను. గుమ్మంలో నిల్చున్న వ్యక్తిని చూడగానే నా కనుబొమలు ముడిపడ్డాయి.

ముప్ఫయిలోపే వుంటుంది అతని వయసు. పొడుగు, పొడుక్కి తగ్గ వెడల్పాటి వక్షం. చురుకైన కళ్ళు, నల్ల తోలు జర్కిన్ వేసుకున్నాడు. చాక్లెట్ రంగు డబుల్ నెట్ పాంటు, కాళ్ళకి బెల్ షూస్.

నన్ను చూడగానే చేతులు జోడించి—"నమస్తే" అన్నాడు.

ప్రతి నమస్కారం చేసేను.

"రాజారెడ్డిగారు మీరేనా?"

"ఔను! మీరు?"

"నన్ను పుష్పనాథ్ అంటారు. పైలెట్ ఆఫీసర్ని. మూడురోజుల క్రితం మీ ప్రకటన చూసి, ఓసారి మిమ్మల్ని కలుసుకుందామని వచ్చేను."

నాగుండె గతి వేగం అందుకుంది. "రండి, కూర్చోండి!" అన్నాను సోఫా చూపిస్తూ.

అతను కూర్చున్నాడు.

అప్పటికే లోపలి కెళ్ళిన అక్కయ్య, పనిమనిషి చేత ట్రేలో కాఫీలు పంపింది. అతను మొహమాట పడకుండా, నేనిచ్చిన కప్పు అందుకుని, తాగి టీపాయ్ మీద పెట్టేడు.

"మీరు ఇండియన్ ఏర్ లైన్స్ పైలెటా? లేక, ఏర్ ఫోర్స్‌లో పనిచేస్తున్నారా?" అడిగేను.

"రెండూ కాదు! ఇక్కడ కార్గో అనే పెద్దమర్చంట్ కంపెనీ వుంది. వారికి రెండు రవాణా విమానాలున్నాయి. ఆ కంపెనీ ఇక్కణ్నించి కొబ్బరినూనె, కొబ్బరికాయలూ స్థానికంగా తయారయ్యే చేతిపని వస్తువులు ఇటు హాంగ్ కాంగ్, జకార్తా, సింగపూర్ వంటి ఏషియా దేశాలకూ అటు బాగ్దాద్, దుబాయ్, కువైట్, టెహ్రాన్ వంటి అరబ్ దేశాలకూ పంపిస్తుంది. ఆ విమానాలే నేను నడిపేది" అన్నాడతను.

"ఇప్పుడు చెప్పండి. పత్రికల్లో నేను ప్రకటించిన ఆపద్యం గురించి మీకేం తెలుసు?" అడిగేను అసలు విషయానికి వస్తూ,

"నిజానికి ఆ పద్యం గురించి నాకేం తెలీదు. మీ ప్రకటన చదివేక ఎందుకో మిమ్మల్ని ఓసారి కలుసుకోవాలనిపించింది. మీ అమూల్య సమయాన్ని అనవసరంగా పాడుచేస్తున్నానేమో అనిపిస్తోందిప్పుడు."

"అంటే పత్రికల్లో ఆ విచిత్ర ప్రకటన వేయించిన నేను ఓ వింతప్రాణి అయుంటానని చూసిపోదామని వచ్చారా?" అన్నాను కాస్త కేవురించిన మొహంతో.

"అబ్బే, అలా అనకండి! నా రాకకి ఓ ముఖ్యమైన కారణంకూడా ఉంది."

"ఏమిటిది?"

"ఇంత సేపూ అదే, ఎలా ప్రారంభించాలా అని తట పటాయిస్తున్నాను. విని మీరు నవ్వు..."

"నో... నో! ప్లీజ్, ప్రొసీడ్!" అన్నాను కుతూహలం ఆపుకోలేక.

అతను సిగిరెట్ అంటించి ప్రారంభించేడు. "నాతో బాటు కార్గో కంపెనీలో మరో పైలెట్ ఆఫీసర్ పని చేస్తున్నాడు. అతని పేరు ఉదయకుమార్. ఇద్దరం ప్రాణమిత్రులం. అతను హాంగ్ కాంగ్, జకార్తా, సింగపూర్ రూట్స్‌లో ప్లేన్ నడుపుతాడు. నేను అరబ్ దేశాలకి సరుకు చేరవేస్తుంటాను.

ఆరు నెలల క్రితం ఏషియా దేశాల్లో మా కంపెనీ సరుకుకు డిమాండ్ తగ్గటంవల్ల కంపెనీ రెండు విమానాలనీ అరబ్ దేశాలకే పంపడం ప్రారంభించింది. ఆ విధంగా నేనూ, ఉదయకుమార్ ఒకే రూట్‌లో వెళ్ళే అవకాశం ఏర్పడింది.

ఒకరోజు మేమిద్దరం మా మా విమానాల్లో బాగ్దాద్ నగరం చేరుకున్నాం. నేనక్కడే సరుకు దించెయ్యాలి. ఉదయకుమార్ అక్కడ తనవిమానంలో ఇంధనం నింపుకుని జోర్డాన్ దేశానికి సరుకు చేరవేసి రావాలి. తరవాత ఇద్దరం కలిసి తిరుగుముఖం పట్టాలి.

బాగ్దాద్‌లో ఇంధనం నింపుకుని జోర్డాన్‌కు బెలు దేరిన ఉదయకుమార్ నిర్ణీత సమయం దాటినా తిరిగి రాలేదు. నాకు చెప్పలేని భయంకలిగింది. కారణం, అతను అరబ్ దేశాలవైపు రావడం ఇదే ప్రథమం. అక్కడి ఎయిర్ రూట్స్ అంత గా తెలీవు.

అంతేగాక, అప్పుడప్పుడూ ఎడారుల్లో భయంకర మైన తుఫాను గాలులు లేచి ఆకాశాన్ని కమ్మేస్తుంది. దారి కనిపించదు. విమానాలు దారి తప్పే ప్రమాదం ఉంది.

చివరికి నా భయమే నిజమైంది. కంట్రోల్ రూంలో ఎంతోసేపు తంటాలు పడ్డాక తెలిసింది. సహారా ఎడారి మధ్య భీకరమైన తుఫాను చెలరేగిందనీ, ఉదయకుమార్ విమానం దారి తప్పిందని.

నా స్నేహితుణ్ని మళ్ళీ చూస్తానో లేదో అని కృంగి పోయేను. కాని, నా అంచనా తారుమారుచేస్తూ ఉద యకుమార్, విమానంతో సహా క్షేమంగా తిరిగి వచ్చేడు. అప్పుడతని మొహం ఏదో భయంకర దృశ్యం చూసినట్టు పీక్కుపోయి, పసుపురంగులోకి మారి వుండటం గమ నించేను.

మూడు గంటల వరకూ ఆ తుఫానులో అతని విమానం రెక్కలు తెగిన పక్షిలా తల్లడిల్లి పోయిందట. కంట్రోల్ రూంనించి వైర్‌లెస్ కమ్యూనికేషన్స్ పూర్తిగా తెగి పోవడం వలన దిక్కుతోచక, ఎంతో నేర్పుతో విమా నాన్ని కూలిపోకుండా కాపాడ గలిగేడట. బ్రతుకు జీవుడా అనుకుంటూ ఇద్దరం తిరుగు ముఖం పట్టాము.

ఆ రోజునుంచి ఉదయకుమార్‌లో హఠాత్తుగా ఏదో మార్పు రాసాగింది. ఏషియా రూట్స్‌లో విమానం నడపవలసిన వ్యక్తి, కంపెనీవారితో పేచీ పెట్టుకొని తను అరబ్ దేశాలకే విమానం నడుపుతానని మంకుపట్టు పట్టసాగేడు.

పైలెట్ వృత్తిలో అతను కాకలుతీరిన వాడు గనక

కంపెనీ అతని మాట కాదనలేక మా డ్యూటీలు మార్చి అతన్ని అరబ్ రూట్ లో వేసింది. ఉదయకుమార్ లో అకస్మాత్తుగా వచ్చిన ఈ మార్పుకు నేను ఆశ్చర్య పోయేను.

అడిగితే, తనకి అరబ్ దేశాలు నచ్చేయనీ, ఆ రూట్ లోనే పనిచేస్తానని ఏవో పుల్ల విరుపుడు సమాధానా లిచ్చి తప్పించుకున్నాడు. అప్పటినించీ అతను ఖాళీ సమయాల్లో అరబ్ దేశాల మ్యాప్ లను కుతూహలంగా, పరీక్షగా చూస్తూ గడపడం ప్రారంభించేడు.

అంతే కాదు, అతని చేతిలో ఎప్పుడూ అరబ్ దేశానికి సంబంధించిన ఏదో ఒక పుస్తకం ఉండటం గమనించేవాణ్ణి. ముఖ్యంగా ఆ పుస్తకాలు అరబ్బు పాశ్చాత్య నాగరికత గురించీ, ఎడారి చరిత్ర గురించీ ఉండేవి.

ఎప్పుడూ చలాకీగా, నవ్వుతూ ఎదటి వాళ్ళని నవ్విస్తూ ఉండే వ్యక్తి ఇప్పుడు శూన్యంలోకి చూస్తూ, ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు ముభావంగా ఉండసాగేడు..."

"ఈ సంఘటనలకీ, ఆ పద్యానికీ, ఎక్కడా సంబంధం ఉన్నట్టు లేదే?" అన్నాను సహనం నశించి.

"ఇదంతా ఉపోద్ఘాతం అనుకోండి. ఇప్పుడు ఆ వైపే వస్తున్నాను. రెండు నెలల క్రితం, ఓరోజు రాత్రి నేనూ అతనూ విస్కీ తాగుతూ కూర్చున్నాం. ఎన్నడూ లేంది అతనా రోజు మోతాదుకు మించి తాగసాగేడు.

కొద్దిసేపటికే తప్పతాగి ఔటాఫ్ కంట్రోలయ్యేడు. ముద్ద ముద్దగా ఏవేవో వాగసాగేడు. ఆ మాటల్లోనే మీరు ప్రకటించిన ఆ పద్యం అతని నోటినుండి వెలువడింది..." పూర్తయిన సిగరెట్ ని ఏష్ ట్రేలో నొక్కడానికి ఆగేడు పుష్పనాథ్.

కుతూహలంతో నా గుండె వేగంగా కొట్టుకో సాగింది.

ఏష్ట్రేలో సిగరెట్ నలిపి, ప్రారంభించేడతను. "మత్తులో ఉన్న ఉదయకుమార్ నా భుజం తడుతూ, 'మైడియర్ ఫ్రెండ్! నువ్వు నా ప్రాణమిత్రుడివి. ఇన్నాళ్ళూ నా మనసులో దాచుకున్న ఓ రహస్యాన్ని ఈరోజు నీకు చెప్పేస్తున్నాను. దాన్ని ఎవ్వరికీ చెప్పక!

ఎందుకంటే, కొద్ది రోజుల్లో నేను ప్రపంచ ఐశ్వర్య వంతుల జాబితాలో చేరబోతున్నాను. ఇహ నాకీ ముష్టి ఉద్యోగం చేసే అవసరం లేదు. త్వరలో నా జీవితం భూలోక స్వర్గం కాబోతోంది.

ఎక్కడైతే ఎడారి పాడుతుందో...

ఎక్కడైతే శిథిలాలు కదులుతాయో...

ఎక్కడైతే జంతువులు మాట్లాడతాయో...

ఎక్కడైతే సముద్రం ఇగిరిపోతుందో...

అక్కడే ఉంది నా భూలోక స్వర్గం!' అంటూ నిషా ఎక్కువై ఇహ మాట్లాడలేక, ఒరిగి మూర్ఛపోయేడు.'

"ఉదయం అతన్ని మళ్ళీ ఆ విషయం అడగలేదా మీరు?"

"అడిగేను! రాత్రి తాగిన మైకంలో తనేం చెప్పేడో అతను పూర్తిగా మర్చిపోయేడు. పైగా, తను ఓవర్ లోడ్‌లో ఏదో వాగి ఉంటాననీ, పట్టించుకోవద్దనీ దాట వేసేడు. తరవాత నేనూ దాదాపూ ఆ విషయం మర్చి పోయేను.

ఆతరవాత ఉదయకుమార్‌లో మరో మార్పువచ్చింది. అప్పుడప్పుడూ సెలవు పెట్టి, మన దేశంలో పేరుపొందిన

ఆర్కియాలజిస్టులని కలుసుకునే ప్రయత్నాలు చెయ్యసాగేడు.''

''ఒక ప్రైవేట్ ఆఫీసర్‌కు పురాతత్వ శాస్త్రవేత్తలతో ఏం పని?''

''అదే నాకూ అర్థంకాకుండా వుంది. కంపెనీవారితో హఠంచేసి, అరబ్ దేశాలకి డ్యూటీ మార్చుకోవడం, ఆ దేశాల మేప్స్ పరిశీలించడం, పుస్తకాలు చదవడం, ఈ మధ్య ఆర్కియాలజిస్టులతో సంపర్కం పెట్టుకోవడం... ఇవన్నీ ఆలోచిస్తే తప్పకుండా ఏదో మర్మం దాగివుందని తోస్తోంది!''

''ఇప్పుడతనెక్కడున్నాడు?''

''ఈ నెల ఒకటవ తేదీన జీతం తీసుకుని ఐదురోజులు సెలవుపెట్టి వెళ్ళేడు. అంతే! సెలవు ఐపోయి ఆరు రోజులు అవుతోంది. ఇంతవరకూ అతని జాడ లేదు. ఏమై పోయేడో అని విచారిస్తున్న నేను సడన్‌గా పేపర్లో మీ ప్రకటన చదివి, ఒక రోజు ఉదయకుమార్ చెప్పిన పద్యం జ్ఞాపకం వచ్చి, అనుకోకుండా మీ దగ్గరికి వచ్చేను , మీ ద్వారా అతని గురించి ఏమైనా తెలుస్తుం దేమోనని.

కంపెనీవారు కూడా ఆందోళన పడుతున్నారు. అతని విషయంలో హైద్రాబాద్‌లో ఉన్న అతని ఇంటికి ట్రంకాల్ చేసి కనుక్కున్నాం. అతనక్కడికి రానే లేదుట! తరువాత అతను తిరుపతిలో ఓ పురాతత్వశాస్త్ర వేత్తని కలుసుకోడాని కెళ్తుందేవాడు. ఆయనకీ ట్రంకాల్ చేశాం. ఉదయకుమార్ జాడ అక్కడా దొరకలేదు! మరి ఏమయ్యేడు? ఉన్నపళాన ఎక్కడికి

మాయమయ్యేడు?" అన్నాడు పుష్పనాథ్ విచారంగా.

"మీ స్నేహితుని ఫోటో ఏదైనా వుందా మీదగ్గర?" అడిగేను.

"ఉంది. మీకు చూపించాలనే పట్టుకొచ్చేను. కాని, అది గ్రూఫ్ ఫోటో. ఓరోజు పది పన్నెండు మంది స్నేహితులం కలిసి, ఓ కొబ్బరి తోటలో పిక్నిక్ జరుపు కోడానికెళ్ళాం. అప్పుడు తీయించిన ఫోటో అది." అంటూ జర్కిన్ జిప్ లాగి, లోపలినించి ఓ కేబినెట్ సైజు ఫోటో తీసేడు పుష్పనాథ్.

రెండు కొబ్బరిచెట్ల నడుమ, పచ్చిక బయలుమీద స్నేహితులంతా మూడు వరుసల్లో నిల్చుని తీయించుకున్న ఫోటో అది. అందులో ఎక్కడున్నాడో వేలుపెట్టి చూప డానికి ముందుకు వంగేడు పుష్పనాథ్.

చేత్తో అతన్ని వారించి, "మీరు చూపకండి! వీరిలో మీ మిత్రుడెవ్వరో నేనే చూసి గుర్తుపట్టడానికి ప్రయ త్నిస్తాను" అన్నాను.

పుష్పనాథ్ తలూపేడు.

ఫోటోమీద దృష్టి నిలిపేను. కింది వరుసలో కూర్చు న్నాడు పుష్పనాథ్. అతని భుజంమీద మోచెయ్యి ఆనించి నవ్వుతున్న యువకుణ్ణి చూడగానే నా గుండె గుభిల్లు మంది!

ఊపిరి ఆగిపోయినట్టు రెప్ప వెయ్యకుండా ఆ రూపాన్నే చూస్తుండి పోయేను.

అతను ఎవ్వరో కాదు!

ఆ రోజు ట్రేన్‌లో నేను చూసిన శవం అతనిదే!!

ఏమిటీ విచిత్రం? ఆ శవం గుస్తుల్లో పోలీసులకి దొరి

కిన కాగితాల ప్రకారం అతని పేరు నరేంద్రబోస్. కలకత్తా నివాసి! పుష్పనాథ్ కథనం ప్రకారం అతని పేరు ఉదయకుమార్. హైద్రాబాద్ నివాసి! ఈ రెంటిలో ఏది నిజం? ఏది అబద్ధం?

హంతకుడు ఉదయకుమార్ని కాల్చి చంపి, పోలీసుల్ని తప్పుదారి పట్టించడానికి, నరేంద్రబోస్ పేరు గల తప్పుడు కాగితాలు ఉంచలేదు కదా? నా సర్వీస్ అనుభవాల దృష్ట్యా అలా అనేకసార్లు జరగడం నేను చూసేను. దీన్ని బట్టి, ట్రేన్‌లో చంపబడ్డ ఆ యువకుడు నరేంద్రబోస్ కాదు. ఉదయకుమారన్నమాట!

ఏషియా దేశాలవైపు విమానం తీసికెళ్ళే ఉదయకుమార్, అకస్మాత్తుగా అరబ్ దేశాలకి డ్యూటీ మార్చుకున్నాడు. తరవాత అతని చేతిలో ఎప్పుడూ అరబ్ దేశాల తాలూకు పుస్తకాలు కనిపించసాగేయి. తాగిన మైకంలో, ఒక రోజు తన మిత్రుడికి ఆ విచిత్ర పద్యం వినిపించి త్వరలో తను గొప్ప ఐశ్వర్యవంతుణ్ణి కాబోతున్నట్టు చెప్పేడు. ఈ మధ్య పురాతత్వశాస్త్రవేత్తల్ని కూడా కలుసుకోడం ప్రారంభించేడు.

వీటన్నిటినీ కూడి ఆలోచిస్తే, అరబ్బు దేశాల్లోనే ఎక్కడో ఆ పాడే ఎడారి ఉండి వుంటుందనిపిస్తోంది. ఆ రోజు నంబియార్ ఏవో గొప్పలు చెప్పుకోడానికి ఆ దీవుల గురించి నాతో కోతలు కోసి వుంటాడు. కొందరి తత్వం అంతే. గోరంత జ్ఞానాన్ని కొండంత ప్రదర్శించుకోడానికి ప్రయత్నిస్తారు.

ఉదయకుమార్ అరబ్ దేశాలపట్ల అంత ఆసక్తి చూపేడంటే, తప్పక అక్కడి ఎడారిలో ఏదో కనుగొని

వుంటాడు. సహారా ఎడారి అరబ్ దేశాల చుట్టూ వ్యాపించి వుంది. ఆ రోజు ఆ ఎడారి తుఫాన్‌లో చిక్కుకున్న అత నికి, పైనించి ఏదో అద్భుత దృశ్యం కనిపించి వుంటుంది.

ఆ దేమిటో తెలుసుకుందామని తరవాత అరబ్ పాశ్చాత్య పుస్తకాలు చదవసాగేడు. పురాతత్వశాస్త్ర వేత్తల్ని కలుసుకోసాగేడు. అంతేకాదు, త్వరలో తను గొప్ప ఐశ్వర్యవంతుణ్ని కాబోతున్నట్టు కూడా చెప్పు కున్నాడు...

"ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టున్నారు" అన్న పుష్పనాథ్ పలకరింపుతో ఆలోచనా విహంగాలు తెగి, మళ్ళీ ఈ లోకంలోకి వచ్చేను.

"ఏం లేదు. ఇతనే కదూ మీ స్నేహితుడు ఉదయ కుమార్?" అంటూ ఫోటోమీద వేలు పెట్టి చూపే నతనికి.

పుష్పనాథ్ కళ్ళు తళతళ మెరిసేయి. "ఔను. ఇతనే! అంటే, మీరతన్ని కలుసుకున్నారన్నమాట. ఎక్కడ కలుసుకున్నారు?" అడిగేడు ఆతృతగా.

"సారీ! నే నతన్ని వ్యక్తిగతంగా కలుసుకోలేక పోయేను."

"మరి ఫోటోలో ఎలా గుర్తించగలిగేరు?"

"కొద్ది రోజులక్రితం అతన్ని ట్రేన్‌లో చూసేను."

"ఎక్కడ?"

"ఇక్కడే, త్రివేండ్రం స్టేషన్లో!"

"ఉదయ్ త్రివేండ్రం వచ్చేడా? ఎప్పుడు?" అడిగేడు పుష్పనాథ్ ఆశ్చర్యంగా.

"ఈ నెల ఏడవ తేదీన! సజీవంగా కాదు శవ రూపంలో!!"

పక్కలో పిడుగు పడ్డట్టు అదిరి పడ్డాడు పుష్పనాథ్.

అతనికి నిదానంగా మొదటినించీ ఇప్పటివరకూ జరిగిన విషయాలన్నీ వివరించేను.

అంతా విన్న పుష్పనాథ్ మొహం పీక్కుపోయింది.

"ఓహ్, గాడ్!" అన్నాడు విచారంగా.

"మిస్టర్ పుష్పనాథ్! మీ స్నేహితుడి మరణానికి దారి తీసిన ఆ చావు కవిత్వంలోని మర్మమేమిటో మనం తెలుసుకు తీరాలి. ఉదయకుమార్ తరుచూ తిరుపతి కెళ్ళి ఎవ్వరో ఆర్కియాలాజిస్టుని కలుసుకు నేవాడని చెప్పేరు. అతనితో మాట్లాడితే ఉదయకుమార్ ఏం తెలుసుకోడానికి అతన్ని కలుసుకు నేవాడో మనకు తెలియావచ్చు. ఆయన పేరేమిటి?" అడిగేను సిగరెట్ అంటిస్తూ.

"ప్రొఫెసర్ నటరాజన్! ఆర్కియాలాజీలో ఆయనకి అంతర్జాతీయ ఖ్యాతి వుంది. మన దేశమే కాదు, విదేశాలు కూడా ఆయన్ని పిలిపించి త్రవ్వకాలు చేయించేవట. అంతేకాక, ఆయన పాశ్చాత్య లిపులు చదవడంలోనూ ఉద్దండ పండితుడుట.

ప్రస్తుతం తన వృత్తికి ఉద్వాసన చెప్పి తిరుపతిలో రెస్టు తీసుకుంటున్నాడుట. ఆయనే కాదు, ఆయన సోదరుడు ప్రొఫెసర్ రామచంద్రన్ కూడా పురాతత్వశాస్త్రంలో మంచి ప్రావీణ్యం కలవాడుట!" అన్నాడు పుష్పనాథ్.

రిస్టువాచీ చూసుకుని, "సరే! రాత్రి ఎనిమిది గంటలకి వెళ్ళే మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో ఇద్దరం కలిసి వెళదాం. అట్నించి మరో బండిలో తిరుపతి చేరుకోవచ్చు. మీరు సరిగ్గా ట్రేన్ టైమ్‌కి స్టేషన్‌లో కలుసుకోండి" అన్నాను.

పుష్పనాథ్ తలూపి, సెలవు తీసుకుని వెళ్ళిపోయేడు.

అప్పుడే ఓ ఆలోచన తట్టింది నాకు. ఓసారి సిటీ లైబ్రరీకెళ్ళి అరబ్బు పాశ్చాత్య నాగరికతకు సంబంధించిన పుస్తకాలు చదివితే, ఏవైనా క్లూస్ దొరకవచ్చు.

అక్కయ్యతో చెప్పి, టాక్సీ ఎక్కి బైలుదేరాను లైబ్రరీకి.

## 6

చాలా పెద్ద లైబ్రరీ అది.

ప్రతి విషయానికీ సంబంధించిన విభాగాలు విడివిడిగా విభజించేరు.

'వరల్డ్ హిస్టరీ అండ్ జాగ్రఫీ' విభాగంలో దూరి వెతకడం ప్రారంభించేను. రెండు గంటలు తంటాలు పడ్డాక దొరికేయి మూడు పుస్తకాలు. ఓ మూల కూర్చుని ఓపిగ్గా చదవడం ప్రారంభించేను. మొదటి రెండు పుస్తకాల్లో నాక్కావలసిన వివరాలేవీ కనిపించలేదు. మూడవ పుస్తకం ఓ ఆంగ్ల రచయిత రాసింది. కొన్ని పేజీలు తిరిగేశాక, ఓ హెడ్ లైన్ ఆకర్షించింది నన్ను.

వానర నగరం!

ఆ హెడ్ లైన్ చూడగానే సడన్‌గా ఓ విషయం జ్ఞాపకం వచ్చింది.

కోతులు తమ భాషలో పరస్పరం మాట్లాడుకుంటూ సైగలు చేసుకుంటాయి. వానరజాతి నించే నరజాతి రూపాంతరం చెందిందని సైన్సుసిద్ధాంతం. అవి మాట్లాడే జంతువులు!

ఉరకలు వేసే మనసుతో ఆ చాప్టర్ చదవసాగేను.

కొన్ని వేల సంవత్సరాల క్రితం సహారా ఎడారి మధ్య "దారాబ్" అనే నగరం ఉండేది. ఓ ఖలీఫా దాన్ని పాలించేవాడు. అతని ఖజానాలో వజ్ర వైడూర్యాలూ, రత్నాలూ, కెంపులూ, పచ్చలూ రాసులుగా వుండేవి.

అక్కడి ప్రజల జీవన విధానం మిగతా ప్రపంచానికి పూర్తి విరుద్ధంగా వుండేది. అక్కడి స్త్రీ, పురుషుల మీద ఎటువంటి ఆంక్షలూ, అడ్డుగోడలూ వుండేవికావు. లైంగిక సంబంధాల విషయంలో విచ్చలవిడిగా జీవించే వారు. అందుకే ఈ చాప్టర్‌కు "వానర నగరం" అని పేరు పెట్టడం జరిగింది.

ఎక్కడి ప్రజల్లో నీతి నియమాలూ వుండవో ఆ రాజ్యం కలకాలం మనగలగదు. ఆ నగరం భగవంతుని ఆగ్రహానికి గురైనట్టు ఒకనాడు భయంకర భూకంపం వచ్చి నగరం యావత్తూ నామరూపాలు లేకుండా శిధిల మైంది. తరవాత ఎడారి తుఫానులు వీచి ఆ శిధిలాలన్నీ ఇసుకలో కూరుకుపోయేయి.

రాజుకు చెందిన ఆ మహాసంపద ఇప్పటికీ ఆ శిధిలాల్లోనే వుండిపోయింది. మహాసాగరం వంటి సహారా ఎడారిలో ఆ శిధిలాలని కనుక్కోవడం దుస్సాధ్యం!

ఐనా, కొందరు ప్రాణాలకు తెగించి ఆ నగరాన్ని వెతకడానికి ప్రయత్నించేరు. సాధారణంగా వెళ్ళినవారు మళ్ళీ తిరిగి రాలేదు. ఒకరిద్దరు వచ్చినా, మతి స్థిమితం కోల్పోయి వచ్చేరు.

ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, కొన్ని సందర్భాల్లో ఆ ఎడారిమీదుగా విమానాలు తీసికెళ్ళుతున్న ఒకరిద్దరు పైలెట్లు, ఎడారి తుఫానులో చిక్కుకుని, దిక్కుతోచక ఆకాశంలో తిరుగుతున్నప్పుడు, అనుకో

కుండా ఆ నగరం శిథిలాలు వారి కంటబడటం జరిగింది.

తరవాత వెళ్ళి ఎంత గాలించినా ఆ శిథిలాలు మళ్ళీ కనిపించలేదు. దీన్ని బట్టి, తుఫాను చెలరేగినప్పుడు ఎడారి ఇసుక ఉవ్వెత్తున పైకి లేవడంతో కింద కూరుకుని వున్న ఆ శిథిలాలు వెలికి వస్తాయి. తిరిగి తుఫాను శాంతించడంతో ఇసుక యథావిధంగా వాటిమీద పేరుకు పోతుంది.

అందుకే అవి మళ్ళీ కనిపించవు!

చాప్టర్ పూర్తిచేసి, కుర్చీ వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాను.

అందులోని ఒకే ఒక పంక్తి నాలో మెదలుతోంది.

కొన్ని సందర్భాల్లో సహారా ఎడారిమీదుగా తీసి కెళ్తున్న పైలెట్లకు 'దారాబ్' నగర శిథిలాలు కనిపించాయి!

ఆనాడు ఆ ఎడారి తుఫానులో చిక్కుకున్న ఉదయ కుమార్ కూడా ఆ శిథిలాలు చూసేడా? వాటికోసమే ఇన్ని తంటాలు పడి, చివరికి ప్రాణాలు కోల్పోయేడా?

# 7

తిరుపతిలో ప్రొఫెసర్ నటరాజన్ ఇల్లు కనుక్కోడం పెద్ద కష్టం కాలేదు మాకు. ప్రొఫెసర్ కలుపుగోరు మనిషిలా కనిపించేడు. మమ్మల్ని సాదరంగా కన్సల్టింగ్ రూంలో కూర్చోబెట్టేడు.

పరస్పరం పరిచయాలయ్యేక, "చెప్పండి. నేను మీకేవిధంగా సహాయపడగలను?" అన్నాడు.

"వారం రోజుల క్రితం ఉదయకుమార్ అనే వ్యక్తి మిమ్మల్ని కలుసుకున్నాడు కదూ?" అడిగేను.

ప్రొఫెసర్ తలూపి, "ఔను! అతడూ, అతని స్నేహితుడూ కలిసి తరుచూ వస్తుంటారు నా దగ్గరికి. చాలా చురుకైన యువకులు. ఐ లైక్ దెమ్. వాళ్ళే కాదు, ఆర్కియాలజీలో ఆసక్తి కలవారెందరో వస్తూ పోతుంటారు నా దగ్గరికి.

వారి సందేహాలకి ఓపిగ్గా సమాధానాలిచ్చి, సహాయపడటం అలవాటుగా పెట్టుకున్నాను. మీరూ ఆ బాపతే అయ్యుంటారనుకుంటాను. ఉదయకుమార్ గురించే ప్రత్యేకంగా దేనికడిగేరు?" అన్నాడు ఆశ్చర్యంగా.

నేనూ, పుష్పనాథ్ ఒకరి మొహాలొకరం చూసుకున్నాం.

"ఉదయకుమార్ వెంట అతని ఫ్రెండుకూడా వచ్చేవాడా? ఎవ్వరతను? ఎలా వుంటాడు?" అడిగేను ఆత్రతని ఆపుకోలేక.

"ఇద్దరూ దాదాపు సమ వయస్కుల్లాగే కనిపించేవారు. ఉదయకుమార్ తన స్నేహితుని పేరు త్రివిక్రమ్ అని చెప్పినట్టు గుర్తు. ఏం? అలా అడిగేరు?"

"కొన్ని విచిత్ర పరిస్థితుల్లో అతను ఈ మధ్యే మరణించడం జరిగింది!"

"వాట్! ఉదయ్ మరణించేడా? ఓహ్! రియల్లీ పిటీ న్యూస్. చాలా తెలివిగల అబ్బాయి. ఎడ్వెంచర్ అంటే ఇష్టపడే తత్వం. అతని మరణం నాకు చాలా విచారాన్ని కలిగిస్తోంది. అతను ఎలా చనిపోయేడు?" అడిగేడు ప్రొఫెసర్ విచారంగా.

"హత్య చెయ్యబడ్డాడు!"

ప్రొఫెసర్ ఆశ్చర్యంతో శిలా ప్రతిమలా చూస్తుండిపోయేడు కాసేపు.

తరవాత నిట్టూర్చి, "అదా సంగతి! అందుకే అతను మళ్ళీ నన్ను కలుసుకోలేదు" అన్నాడు.

"మళ్ళీ వచ్చి కలుస్తానని చెప్పి వెళ్ళాడా మీతో?"

"ఔను!"

"అతను మీ దగ్గిర ఎటువంటి వివరాలు సేకరించడానికి వచ్చేవాడు?" అడిగేను అసలు విషయానికి వస్తూ.

"నానించి అతను తెలుసుకోదలచిన వివరాలు కొత్తవేం కాదు. అంతక్రితం ఎందరో ఆ వివరాలు తెలుసుకోడానికి నా దగ్గరకు వచ్చారు. నేను ఓపిగ్గా వారికి సమాధానాలిచ్చి పంపేవాణ్ని. మీరెప్పుడైనా 'దారాబ్' అనే నగరం గురించి విన్నారా?" అడిగేడు ప్రొఫెసర్.

లేదన్నట్టు తల తిప్పేను.

"కొన్ని వేల సంవత్సరాల క్రితం సహారా ఎడారిలో ఆ నగరం వుండేది. ఒకనాడు ప్రకృతి వైపరీత్యానికి గురై శిథిలమైపోయింది. ఇప్పటికీ ఆ శిధిలాల్లో ఆ నాటి అఖండ సంపద దాగివుందని అరబ్ చరిత్ర చెబుతోంది.

ఆ సంపదనీ, దానితోబాటు అంతర్జాతీయ ఖ్యాతినీ స్వంతం చేసుకోడానికి, ఇప్పటికీ ఎందరో ప్రయత్నిస్తున్నారు. ప్రాణాలు కోల్పోతున్నారు. ఐనా, గుండె నిబ్బరం గలవారు తెగించి ప్రయత్నిస్తూనే వున్నారు."

"ఉదయకుమార్ కూడా ఆ ప్రయత్నాల్లోనే మిమ్మల్ని కలుసుకునేవాడా?"

ప్రొఫెసర్ తలూపి, "ఔను. ఒకరోజు ఎడారి తుఫాన్లో చిక్కుబడ్డ అతనికి, పైనించి ఆ శిధిలాలూ, కళ్ళు చెదరగొట్టే ఏవో వస్తువులూ కనిపించేయట.

తరవాత వాటికోసమే కంపెనీ వారితో పోరి తన డ్యూటీ అరబ్ రూట్స్‌లో వేయించుకున్నాడుట. రెండవసారి వెళ్ళి విమానంలో ఆ ఎడారి సాంతం గాలించినా, ఇసుక దిబ్బలు తప్ప ఆ శిధిలాల ఉనికికూడా కనిపించలేదుట.

దారాబ్ నగరం గురించి అతనెప్పుడో పత్రికల్లో వ్యాసాలు చదివేడుట. దాన్ని ఎలాగైనా శోధించి సాధించాలని కంకణం బూనాడు. పేరు పొందిన అర్క్యియోలజిస్ట్‌లతో సంప్రదించసాగేడు. ఆ ప్రయత్నాల్లోనే నన్నూ కలుసుకోడం జరిగింది. ఆ పని తనొక్కడివల్ల జరగదనుకుని, తన స్నేహితుణ్ణికూడా తోడు తీసుకున్నాడు సహాయంకోసం!

ఆ నగరాన్వేషణలో ఇదివరకు ఎందరు ప్రాణాలు పోగొట్టుకున్నారో అది ఎంతటి దుస్సాధ్యమో అతనికి వివరించి, ఆ ప్రయత్నాలు మానుకుని హాయిగా బ్రతకమని సలహా ఇచ్చేను.

ఐనా అతను తన మంకు పట్టు వదల్లేదు. అతనేకాదు· అతనిలాగే ఒకరిద్దరు యువకులు నన్ను కలుసుకున్నారు, ఒకతను విమానంలోంచి ఆ శిధిలాల ఫోటోకూడా తీశానని వచ్చేడు. మీకా ఫోటో చూపిస్తానుండండి!'' అంటూ లేచి లోనికెళ్ళాడు ప్రొఫెసర్.

రెండు నిమిషాల తరవాత, ఓ కేబినెట్ సైజు ఫోటో తెచ్చిమా ముందుంచేడు. చాలా ఎత్తునించి తీసిన ఫోటో అది. ఎడారి ఇసుకలో ఏవో విరిగి పడున్నట్టు చెల్లా చెదురుగా కనిపిస్తున్నాయి. వాటి మధ్య పెద్ద గొయ్యిలాటిదికూడా కనిపిస్తోంది.

"ఈ ఫోటో తీసినతను ఇవి దారాబ్ శిధిలాలే అంటాడు. కావని నేను ఖచ్చితంగా చెప్పగలను. ఫోటో మధ్య గొయ్యి చూస్తున్నారా? అది ఎలా ఏర్పడిందో తెలుసా?

చెబుతాను వినండి. ఆకాశం నించి ఉల్కలు తెగి భూమివైపు దూసుకు వస్తుంటాయి. 'ఉల్కలు' అంటే కొందరికి త్వరగా బోధపడక పోవచ్చు. రాత్రుళ్ళ అప్పు డప్పుడూ ఏదో చుక్క ఉన్నట్టుండి రివ్వున కిందికి దూసుకుపోడం మనం చూస్తుంటాం. వాటినే మనం ఉల్కలంటాం!

నిజానికవి రాళ్ళూ ఇతర ధాతువుల సమ్మేళనాలై వుంటాయి. తమ స్థానం వదిలి భూమివైపు దూసుకు వస్తూ, భూకక్ష్యలోకి ప్రవేశించగానే వాయు రేణువులతో రాపిడికి గురై కాలి బూడిదగా మారతాయి.

ఒక్కోసారి వాటి తాలూకు పెద్ద పెద్ద ముక్కలు రాలిపోకుండా దూసుకు వచ్చి, భూమిని గుద్దుకుంటాయి. అప్పుడే ఇటువంటి గోతులు ఏర్పడతాయి. అందుకే అన్నాను ఇవి దారాబ్ శిధిలాలు కావని!" అన్నాడు ప్రొఫెసర్.

"ఉదయకుమార్ కూడా వీటినే చూసి దారాబ్ శిధిలాలనుకున్నాడంటారా?"

"కావచ్చు. అతను ఆ రోజు ఏ దిశలోనైతే తుఫానులో చిక్కుకున్నానని చెప్పేడో, ఆ స్థలంకూడా ఆ వైపే ఉంది మరి!" అన్నాడు ప్రొఫెసర్.

"అతని స్నేహితుడు త్రివిక్రమ్ చిరునామాగానీ, వివరాలుగానీ ఏమైనా తెలుసా మీకు?"

"సారీ! నేను కనుక్కోలేదు."

"థాంక్యూ ప్రొఫెసర్! మీ అమూల్యమైన సమయాన్ని ఇలా దుర్వినియోగం చేసినందుకు మన్నించాలి!" అంటూ లేచాను.

"అదేం లేదు! ఆ యువకుడి మరణవార్తే నన్ను కలత పెడుతోంది" అన్నాడు ప్రొఫెసర్ విచారంగా.

ఆయన దగ్గిర సెలవు తీసుకుని ఇద్దరం బైలుదేరాం.

"ప్రొఫెసర్ వల్ల అతి ముఖ్యమైన విషయం తెలిసింది మనకు. అదే, ఉదయకుమార్ స్నేహితుడు త్రివిక్రమ్!" అన్నాను.

"ఔను! కొత్తగా వింటున్నాను ఆ పేరు. ఉదయ్‌కి ఆ పేరుగల స్నేహితుడున్నాడని కూడా నాకు తెలీదు" అన్నాడు పుష్పనాథ్ సిగరెట్ అంటిస్తూ.

"మీరిద్దరూ కూడా మంచి స్నేహితులే కదా? అతను మిమ్మల్నే తన పార్ట్నర్‌గా దేనికి ఎన్నుకోలేదు?"

పుష్పనాథ్ నవ్వి, "అతనికి నామీద నమ్మకం లేదేమో? కేవలం వృత్తిరీత్యా నాతో క్లోజ్‌గా ఉండేవాడేమో? అతనికి నాకన్నా ముఖ్య స్నేహితులెందరో వుండవచ్చుగా? వారిలో ఆ త్రివిక్రమ్‌ని ఎన్నుకుని వుంటాడు!"

సాలోచనగా తలూపేను. "దేనికో వారి మధ్య పొరపొచ్చాలొచ్చివుంటాయి. ఆ మహా నిధినీ, అంతర్జాతీయ ఖ్యాతినీ తానొక్కడే స్వంతం చేసుకుందామన్న దురాశతో త్రివిక్రమే తన స్నేహితుణ్ని చంపి వుంటాడు!" అన్నాను.

"కావచ్చు! చెప్పలేం. ఇప్పుడా త్రివిక్రమ్‌ని ఎక్కడ

వెతకడం?'' అన్నాడు పుష్పనాథ్ నిస్పృహతో.

''పోలీసులకి ఉదయకుమార్ శవంతోబాటు ట్రైన్‌లో అతని సూట్‌కేస్ కూడా దొరికింది. అందులో అతని డైరీ ఏదైనా వుండివుంటే, ఆ త్రివిక్రమ్ గురించి ఏమైనా ఆచూకీ తెలియవచ్చు.

లేదా, హైదరాబాద్ ట్రంకాల్ చేసి అతని ఇంటి వాళ్ళని వాకబ్ చేద్దాం. ఉదయకుమార్ స్నేహితుల్లో త్రివిక్రమ్ పేరు గల వారెవ్వరైనా ఉన్నారా అని' మనం త్రివేండ్రం చేరేసరికి రాత్రి పన్నెండవుతుంది' రేపు ఉదయం ఇంటికి వచ్చి నన్ను కలుసుకోండి' అన్నాను.

పుష్పనాథ్ తలూపేడు.

# 8

ఉదయం బ్రేక్‌ఫాస్టయ్యేక, పేపర్ తిరగేస్తూ పుష్పనాథ్ కోసం ఎదురుచూస్తున్నాను.

నా కళ్ళు పేపర్ మధ్య పేజీలో ప్రచురించిన ఓ హెడ్‌లైన్ని అయస్కాంతంలా ఆకర్షించేయి.

'సహారా ఎడారి ప్రాచీన నగరం కనుగొనబడింది!'

మద్రాసు 14:_ బాంబే ఇంటర్నేషనల్ ఏజెన్సీ ద్వారా అందిన సమాచారాన్ని బట్టి, వేల సంవత్సరాల క్రితం సహారాఎడారిలో కూరుకుపోయిన 'దారాబ్' అనే ప్రాచీన నగరం ఈనాడు కనుగొనబడింది.

ఆ శిథిలాల్లో కొన్ని కోట్లు విలువచేసే వజ్ర వైడూర్యాలు నిక్షిప్తమై వున్నాయి. ఆ ప్రాచీన సంపదను కనుగొనడానికి ఇదివరకెందరో ప్రాణాలు పణం గావించేరు.

దుస్సాధ్యమనుకున్న ఆ నిధిని కనుగొని, కృత నిశ్చ

యంలో శ్రమిస్తే ఈ సృష్టిలో అసాధ్యమేదీ లేదని మరోసారి ఋజువు చేశాడు మానవుడు. ఆ ఖ్యాతి మన దేశ పురాతత్వ శాస్త్రవేత్తలకే లభించడం ముదావహం!

ఆయన పేరు ప్రొఫెసర్ రామచంద్రన్. ప్రఖ్యాత ఆర్కియోలజిస్ట్ ప్రొఫెసర్ నటరాజన్ గారి సోదరుడాయన. ప్రొఫెసర్ నటరాజన్ ప్రస్తుతం తమ వృత్తిని సోదరుడైన రామచంద్రన్‌కు అప్పగించి, తిరుపతిలో విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఈనాడు 'దారాబ్' అవశేషాలు కనుగొని, ప్రొఫెసర్ అన్న ఖ్యాతినికూడా అధిరోహించేడు. ఆ శిథిలాలు బయల్పడిన ప్రదేశం జోర్డాన్ దేశ సరిహద్దులో వుంది గనుక, జోర్డాన్ రాజు ఇదివరకు ప్రకటించిన విధంగా ఆ నిధిలో సగం రామచంద్రన్‌కు ఇచ్చి తమ కృతజ్ఞతలు తెల్పుకుంటారు! భారతీయులకిది నిజంగా గర్వకారణం!"

నిదరలో జోగుతున్న వ్యక్తి పక్కలో హఠాత్తుగా టపాకాయ పేలితే అదిరిపడి కళ్ళు తెరిస్తాడు. సరిగ్గా అలా అయింది నా స్థితి ఇప్పుడు.

గిరగిర తిరుగుతున్న బుర్రని అదుపులో పెట్టడానికి సిగరెట్ తీసి అంటించేను. అది పూర్తయ్యేవరకు తీవ్రంగా ఆలోచిస్తూ ఓ నిశ్చయానికి వచ్చి లేచాను.

ఇంట్లో ఎక్కడికెళ్తున్నానోకూడా చెప్పకుండా టాక్సీ ఎక్కి హుటాహుటిన త్రివేంద్రం పోలీస్ హెడ్ క్వార్టర్స్ చేరుకున్నాను.

ఉదయకుమార్ హత్యకేసు దర్యాప్తు చేస్తున్న డి. ఎస్. పి గార్ని కలుసుకుని, నన్ను నేను పరిచయం చేసుకుని, మొదటినించీ జరిగిన విషయాలన్నీ సమగ్రంగా ఆయనకి వివరించేను.

ఇంతవరకూ ఆ కేసు తలా తోకా అందక తికమక పడుతున్న ఆయన, నా పరిశోధనా వివరాలు విని ఆనం దాన్ని అదుపులో పెట్టుకోలేక పోయేడు.

"ఉదయకుమార్ శవం బైటపడిన రోజు, ఏ కండక్టరైతే ఆకంపార్ట్‌మెంట్‌లో ఉన్నాడో అతన్ని తక్షణం వెదికించి మీ కస్టడీలోకి తీసుకోండి. ఆలస్యం చెయ్యకూడదు. రైల్వే అధికార్లని వాకబ్ చేస్తే ఆ కండక్టర్ వివరాలు తెలుస్తాయి!" అన్నాను తొందరపెడుతూ.

"ఓ.కే! అదెంతసేపు?" అంటూ బల్లమీది కాలింగ్ బెల్ మోగించాడాయన.

# 9

"హల్లో, ప్రొఫెసర్! గుడీవినింగ్!" అన్నాను నవ్వుతూ.

"గుడీవినింగ్ మిస్టర్ రాజారెడ్డీ! రండి. కూర్చోండి. ఆ హంతకుడి ఆచూకి ఏమైనా తెలిసిందా?" అడిగేడు ప్రొఫెసర్ నటరాజన్ సాదరంగా నన్ను ఆహ్వానిస్తూ.

"తెలిసింది! అదే మీతో చెప్పాలని ఇలా వచ్చేను."

"వెరీ గుడ్! ఎవరా హంతకుడు?"

నా కంఠం మారిపోయింది. "ఇంకా ఎవ్వరో కాను నువ్వే!" అన్నాను అతన్ని వురిమి చూస్తూ.

ప్రొఫెసర్ మొహం కోపంతో జేవురించింది. "మిస్టర్! ఏమిటీ పిచ్చి ప్రేలాపన? నేనెవ్వర్నో తెలిసే మాట్లాడుతున్నావా?" అన్నాడు తీక్షణంగా.

"ఔను. అంతా తెలిసే మాట్లాడుతున్నాను ప్రొఫెసర్! ఇక దాచి లాభంలేదు. నిన్న సాయంత్రం వరకూ నీమీద నాకు అనుమానపు వాసన కూడా వెయ్యలేదు. ఈరోజు ఉదయం పేపర్ చూడగానే, నా కళ్ళముందు

కమ్ముకున్న మబ్బుతెరలన్నీ తొలగిపోయేయి. సహారా ఎడారిలో 'దారాబ్' నగర శిథిలాలను నీ తమ్ముడు కనుగొన్నాడా?

మీ అన్నా తమ్ముళ్ళిద్దరూ బ్రహ్మాండమైన నాటకం ఆడి, ఇటు పోలీసుల్నే కాదు, అటు ప్రపంచాన్నే మోసం జేశారు. నిజానికి, ఆ ఖ్యాతి చెందగలసిన వ్యక్తి ఉదయకుమార్!

సహారా ఎడారిలో, ఆ నగర శిథిలాలున్న ప్రదేశాన్ని అష్ట కష్టాలు పడికనుగొన్న ఉదయకుమార్, వాటి త్రవ్వకంలో నీ సహకారం తీసుకుందామని, నిన్ను కలుసుకుని, తను కనుగొన్న విషయాలు, ఫోటోలు వెల్లడించేడు.

అప్పుడే నీలో దురాశ మొలకెత్తింది. అటువంటి అపార సంపదా, అంతర్జాతీయ ఖ్యాతీ ఒక మామూలు వ్యక్తి పరం కాకుండా మీరే దక్కించుకోవాలనుకున్నారు.

అతను కనుగొన్న వివరాలు సరైనవి కావని, పొరపాటు అంచనాలనీ నిరుత్సాహపర్చి పంపేరు. అతనా వివరాలు మరెవ్వరికీ చెప్పకముందే పైలోకం పంపెయ్యాలని, అతన్ని వెంబడిస్తూ మద్రాసు జేరుకున్నావు. అతను త్రివేంద్రం వెళ్ళడానికి మద్రాసు స్టేషన్లో బండి మారగానే అతని కేబిన్లో కళ్ళావు.

నిన్ను చూసి ఉదయకుమార్ తెల్లబోయి వుంటాడు. అతన్ని కాసేపు కబుర్లలో పెట్టి, బండి కదలగానే పిస్తోలులో కాల్చి, పోలీసుల్ని తప్పుదోవ పట్టించడానికి నరేంద్రబోస్ పేరుగల తప్పుడు కాగితాలు అతని జేబుల్లో దాచి, నడుస్తున్న ట్రైన్లోంచి దిగిపోయేవు.

తరవాత, ఉదయకుమార్ చెప్పిన ప్రదేశంలో ఆ

శిధిలాల తవ్వకానికి నీ తమ్ముణ్ని జోర్డాన్ పంపేవు... నేనూ, పుష్పసాఫ్ నిన్ను కలుసుకున్నప్పుడు, ఉదయ కుమార్ వెంట ఎవ్వరో త్రివిక్రమ్ అనే స్నేహితుడు వచ్చేవాడని చెప్పి, మా అనుమానం ఆ అమాయకుడి మీదికి మళ్ళించాలని ప్రయత్నించేవు..."

ప్రొఫెసర్ మధ్యలో పకపక నవ్వి, "కథ బాగుంది! కాని, ఈ కాకమ్మ కథని కోర్టువారు ఎలా నమ్ముతారను కున్నావ్?" అన్నాడు.

ఈసారి నవ్వడం నావంతయింది. "నానోటి మాటగా చెబితే నమ్మరు. నిజమే. కోర్టువారిని నమ్మించడానికి నా దగ్గర సాక్ష్యం వుంది ప్రొఫెసర్!" అంటూ తలుపువైపు చూశాను.

సరిగ్గా అదే సమయంలో, ఆనాటి రైల్వే కండక్టర్, కేరళ పోలీస్ డి. ఎస్. పీ, ఇద్దరు కానిస్టేబుళ్ళూ వంతుల వారిగా లోన అడుగుపెట్టేరు.

కండక్టర్, ప్రొఫెసర్ని చూడగానే—"ఆ రాత్రి ఇతనే సార్ ఆ యువకుడితో మాట్లాడి, బండి దిగి పోయింది!" అన్నాడు దాదాపు అరుస్తూ.

"ఈ మాత్రం సాక్ష్యం చాలా ప్రొఫెసర్, నీకు యావజ్జీవ శిక్ష పడటానికి?" అన్నాను నవ్వుతూ.

పాపం, ఈపాటికి ప్రొఫెసర్ కళ్ళల్లో చీకట్లు కమ్ము కుంటాయి. నిల్చోలేక, ఉన్నపళంగా సోఫాలో కూలబడిపోయేడు.

నిట్టూర్చేను తృప్తిగా!

—: ఐపోయింది :—

# ఆకలిచావు!

ఎస్. గీతారాణి

తళ, తళ లాడుతున్న హుస్సేన్‌సాగర్ మీద అప్పు డప్పుడూ దృష్టిని సారిస్తూ పోనిస్తున్నాను కారుని.

మెత్తటి రోడ్ మీద నా చేతిలో జారిపోతున్న కారుకి సడన్ బ్రేక్ వేసాను. డోర్ తెరచి, కారుదిగి బస్‌షాప్ వైపు నడిచాను.

బస్‌స్టాపులో ఒక యువతి చేతిలో బుక్స్‌తో నిలిచి వున్నది.

ఆ యువతిని చూడగానే నాలో రక్తం సల, సలా కాగిపోసాగింది.

అయితే ఆమె ఒక్కర్తే కాదు నాకు కావలసింది. ఆమె తండ్రి నాగభూషణం కావాలి. వాడి ఎదురుగా

ఈ మెని నానా హింసలూ పెట్టి చంపాలి. అప్పటికి కాని నాపగ చల్లారదు.

నేను ఆ మెకి అటు ప్రక్కగా సెనగకాయలు అమ్ము తున్న వాడిని "ఏయ్ అబ్బీ ఇలారా!" అని పిలిచాను. అలా పిలవటం కేవలం నేను ఆమె దృష్టిలో పడాలనే.

నేను సెనగకాయలు కొంటూంటే ఆమె నావైపు చూసింది.

నన్ను చూడగానే ఆమె చేతిలో బుక్స్ జారిక్రింద పడ్డాయి. 'భా...స్క...ర్' అంది వణుకుతున్న పెదవులతో.

"ఎక్స్ క్యూజ్ మీ నాపేరు రాజశేఖరం" అన్నాను వంగి క్రిందపడ్డ బుక్స్‌ని ఏరి, అందిస్తూ.

నా మాటలకి ఆ యువతి ముఖం చిన్నపోయింది. 'భాస్కర్‌లాగే కనిపిస్తే భాస్కరే అనుకొన్నా" అంది.

"ఏం? భాస్కర్ అనేవ్యక్తి ఎక్కైనా పారిపోయాడా? కనిపించటం లేదా?" ఆశ్చర్యాన్ని నా ముఖంలో కన బరుస్తూ, అమాయకంగా ముఖాన్ని పెట్టాను.

"అఁ హఁ ఆదేంలేదు. అతను...అతను" ఆమె తడ బాటుగా అంటుంటే అదోలా నవ్వుకొన్నాను. ఎలా చెప్పగలదు? భాస్కర్‌ని తాము అంతం చేసామని, అతని జీవితానికి చితిని పేర్చామని నేను లోలో ఆవేదనగా అనుకొన్నాను పైకి మాత్రం చిరునవ్వు నవ్వుతూ.

"మీరు బస్ కోసం వైట్ చేస్తున్నట్లున్నారు. ఆ బస్ వచ్చేసరికి గంట పడుతుంది. మీ కభ్యంతరం లేకపోతే నా కార్లో డ్రాప్ చేస్తానురండి" అన్నాను.

ఆమె ఓసారి నా ముఖంలోకి చూసి.

"సరే పదండి" అంది.

నాలో చెప్పలేనంత వుషారు కలిగింది. నేను వేసు కొన్న ప్లాను అమలులోకి రావటంతో.

నా కారు దగ్గర కెళ్ళి డోర్ తెరచి, ఆమె ఎక్కాక, డోర్ మూసేసి స్టీరింగ్ దగ్గర కూర్చున్నాను. ఆక్సిలేటర్ మీద కాలుని అదిమిపట్టి కారుని ముందుకి దూకించాను.

కారుని చాలా నెమ్మదిగా నడుపుతూ, ఆ యువతి ముఖ భావాలని ఓరగా గమనించసాగాను. నన్ను చూసి త్రుళ్ళి పడటం, నా ఎడం చెంపమీద చిన్న సొట్టని పదే, పదే చూడటం చేస్తున్నది. ఆమె ఎందుకలా అవు తున్నదో నాకు బాగా తెలుసు.

భాస్కర్, నేను ఒకే రక్తం పంచుకు పుట్టిన అన్న దమ్ములం. మా ఇద్దరికీ చాలా పోలికలు వున్నాయి.

అన్నయ్య నవ్వినా, నేను నవ్వినా, మా ఇద్దరి బుగ్గలు సొట్టలు పడతాయి. అందుకే ఈమె నన్ను చూసి అంతగా కలవర పడింది.

తాము చంపేసిన భాస్కర్ ఎలా తిరిగి వచ్చాడా? అని ఆశ్చర్యపోయిందో? లేక తమని చంపటానికి అతను దెయ్యమై వచ్చాడనో? భయపడిందో?

"రాజుగారూ!" ఆ యువతి పిలుపుకి వులిక్కిపడి చూసాను.

"నా ఇంటి ఎడ్రస్ అడక్కుండా నా ఇంటికి తీసు కొచ్చేస్తున్నారు. చాలా ఆశ్చర్యంగా వుందే?"

ఆమె మాటలకి పట్టు బడ్డట్టు అయింది నా పరిస్థితి.

రాజు దొరికి పోతున్నావ్, నా అంతరాత్మ చిన్నగా హెచ్చరిక చేసింది.

"మిస్."

"నా పేరు సునీత."

"సునీత గారూ! నేను వెళ్ళేది ఇదేదారి. మీరు వేరే చెప్పలేదు కాబట్టి మీరు వెళ్ళేది ఇటే అనుకుంటు న్నాను."

నా మాటలకి సునీత చిరునవ్వు నవ్వుతూ "మీరు చక్కగా మాట్లాడుతున్నారు" అంది.

నేను ప్రతిగా నవ్వేసి ఆమె ఇల్లు ఎక్కడో అడి గాను. ఆమె ఎడ్రస్ చెప్పాక, నేను నడిపేదే ఆ వైపు కాబట్టి, కారుని మరోవైపుకి మళ్ళించే అవసరం కలగ లేదు.

"మీరేం చేస్తున్నారు?"

సునీత ప్రశ్నకి ఓ నిముషం సమాధానం చెప్పటానికి సంశయించేను.

"బి. ఎ. పాసయ్యి, ప్రస్తుతం నా ఫ్యాక్టరీ చూసు కొంటున్నాను" అని అన్నాను.

"అహ అలాగా" అంటున్న ఆమె చూపులు స్టేరింగ్ మీదవున్న నాచేతి వేళ్ళకున్న ఖరీదైన వజ్రపు టుంగరాల మీద పడ్డాయి.

ఆమె చూపుల్ని పసి కడుతున్న నాకు చిన్నగా నవ్వు వచ్చింది.

కారుని పెద్ద బంగళాముందు ఆపాను.

బంగళా చుట్టూ గోడ. ఆ గోడల మధ్య రక రకాల మొక్కలు, ఆ మొక్కల వెనుక అందంగావుంది బంగళా.

సునీత కారు దిగి 'లోపలకి రండి' అని ఆహ్వానించింది.

నేను కారు దిగకుండా 'అర్జెంట్ పనివుంది. మరో సారి వస్తానులెండి' అని, ఏక్సిలేటర్ మీద కాలు వేసి నొక్కుతూ కనకొసలనుంచి ఆమె వదనాన్ని గమనించాను.

నేను ఆమె కోర్కెని తిరస్కరించి నందుకు ఆమె వదనం ముకుళించుకుపోయింది.

ఆమెకి చెయ్యి వూపి, కారుని ముందుకు దూకించాను.

## 2

క్లబ్ ముందు కారుని ఆపి, లోపలికి నడిచాను.

అందమైన జంటలు ఓ వారగా కూర్చొని ఒకరిపై ఒకరు సోలిపోయి, ఈ ప్రపంచాన్నే మరచిపోతున్నారు. కొందరు వృద్ధులు ప్రముఖ నర్తకి 'రెవరీ' డాన్స్ కోసం ఆతృతగా ఎదురుచూస్తున్నారు. మరి కొందరు విస్కీ బాగా పట్టిస్తున్నారు.

వాళ్ళందర్నీ దాటుకొంటూ మరో చోటుకు వెళ్లాను.

ఓ రౌండు టేబిల్ చుట్టూ కూర్చొని రవి తదితరులు కార్డ్స్ ఆడుతున్నారు.

రవి లక్షాధికారి బిడ్డ. అతని చుట్టూ బెల్లం చుట్టూ మూగిన చీమల్లా మూగుతుంటారు స్నేహితులు. రవి దృష్టిలో వందనోటు విలువ రూపాయినోటు. ఖరీదైన సూట్లలో, కమ్మని సెంటు వాసనలతో, అదృష్టమంతా తన సొత్తే అన్నట్లుంటాడు రవి. రోజూ అతని పర్సులో వెయ్యి రూపాయలకి తక్కువ వుండదు.

ఎందరెందరు అతని చుట్టూ తిరుగుతున్నా రవి మాత్రం

నా చుట్టే తిరుగు తుంటాడు.

అందుకు కారణం లేక పోలేదు. 'అపన'లో నా డిటెక్టివ్ నావెల్స్, కథలు తరచూ పడుతుంటాయి.

రవి అభిమాన పత్రిక 'అపన'. అపనలో నా రచనలని చదివి తనంత తానుగా వచ్చి, నా స్నేహాన్ని కోరాడు.

ధనవంతుల స్నేహం అంటే నాకు చాలా భయం, అసహ్యం కూడా. కాని రవి నిష్కల్మషమైన స్నేహాన్ని తిరస్కరించ లేకపోయాను. అలా కొద్ది కాలంలోనే ఇద్దరం ప్రాణ మిత్రులమైనాము.

"రాజూ!" రవి హస్తం నా భుజంపై పడగానే వులిక్కిపడి వాడి కళ్ళలోకి చూసాను.

"బయటకి పద మాట్లాడుకుందాం," అన్నాడు రవి కార్డ్స్ టేబుల్ మీద పడేస్తూ.

నేను మౌనంగా వాడివెనుక నడిచాను.

ఇద్దరం బయటికి వచ్చి కారెక్కాం. రవి స్టీరింగ్ అందు కొన్నాడు.

కారు రోడ్ మీంచి వెళుతుంటే అన్నాను నేను.

"రవీ! నీ డ్రెస్‌లు ఓ నాలుగు కావాలి నాకు" అని.

"వై నాట్! తప్పకుండా ఇస్తాను. అయితే ఈ నాటకం అంతా ఎందుకో చెప్పు."

పచ్చి వెలక్కాయి నాగొంతు కడ్డం పడ్డట్టయింది, నా ప్లాను కాని చెప్తే, రవి నా చెంపల్ని వాయించి, నా ప్రయత్నాన్ని ఆపు చేయిస్తాడు. నేను బ్రతుకు తున్నదీ పగకోసం, నా అణుకణువూ ఎదురు చూస్తు న్నది ప్రతీకారం కోసం.

ఏ రీతిలో అయితే అమాయకుడైన అన్నయ్యని హత్య చేసారో, అదే రీతిలో సునీతకి నాగభూషణానికి ఈ లోకంలో నరకాన్ని సృష్టించాలి. ఇదే నా ఆశయం. ఈ ఆశయం నెరవేరాలన్నదే నా ఆశ.

"రాజూ!" రవి పిలుపుకి ఆలోచనలకి ఫుల్‌స్టాప్ పెట్టి, ఏమిటన్నట్లు చూసాను.

"మాట్లాడవేం."

"ఏం మాట్లాడేది."

"ఈ డ్రెస్ ఎందుకు? నువ్వు ఆడబోయే నాటకం ఏమిటి?"

"రవి చేసిన ఆడే ప్రతీ నాటకానికి ముగింపు వుండక పోదు. తెర దించక పోరు. నా నాటకానికి ఇది నాంది మాత్రమే. కథ ఇంకా క్లైమాక్స్‌కి రాలేదు."

"రాజూ! నీ రచయిత పోజులు నా దగ్గరకొట్టకు. నాటకాన్ని వ్రాసే ప్రతి రచయితకి, నాటకం వేసే ప్రతి నటుడికి ముగింపు తెలియకపోదు. కనక నిజం నాతో చెప్పు. లేదా? నాకు చాలా కోపం వచ్చేస్తుంది."

రవి మాటలు చాలా సీరియస్‌గా ధ్వనించాయి. నేను ఏదో ఒక అబద్ధాన్ని నిజంగా మార్చి చెప్పకపోతే, వాడికి నిజంగానే కోపం వచ్చేస్తుంది.

"రవీ! సునీతా బ్యాటరీ ఫ్యాక్టరీ అధినేత నాగభూషణాన్ని తెలుసా?"

"ఆయన్ని చూడలేదు. కాని ఆ ఫ్యాక్టరీ పేరు మాత్రం చాలాసార్లు చూసాను."

"ఆ నాగభూషణం కూతురు సునీతని నేను ప్రేమిస్తున్నాను."

"వ్హాట్" రవి ముఖంలో ఆశ్చర్యం తొంగి చూసింది.

"అయితే వచ్చిన చిక్కల్లా ఏమిటంటే ఆ నాగభూష ణానికి ఆ స్త్రీపరులయడల వున్న ఆప్యాయత పేదలయెడ లేదు. నేను పేదవాడినని తెలిస్తే తన కూతుర్ని నా కివ్వడు. నాగభూషణం దృష్టిలో నేను ధనవంతుడిలా కనిపించాలి. నేను డబ్బున్నవాడినని అనుకొని సునీతని ఇచ్చి పెళ్ళిచేస్తాడు."

"రాజూ! సునీతకి నీవంటే ఇష్టమేనా?"

"అవు."

"హాయిగా రిజిస్టర్ మేరేజ్ చేసుకోవచ్చుగా."

"అలా సునీతకి ఇష్టంలేదు. నాకూ ఇష్టంలేదు."

"రాజూ! నీ పెళ్ళికోసం నువ్వు ఏం చెయ్యమన్నా చెయ్యటానికి సిద్ధంగా వున్నాను."

రవి దృఢస్వరాన అంటుంటే నేను ఆనందంగా వాడి చేతిని ముద్దుపెట్టుకొన్నాను.

## 3

నేను తాళం తీసి ఇంట్లోకి అడుగుపెట్టాను. స్విచ్ వేసి లైట్ వెలిగించాను. ఆ వెలుగుల్లో నా కంటికి ముందుగా కనిపించిన టేబిల్ మీద చిరునవ్వులు చిందిస్తున్న అన్నయ్య ఫోటో.

ఆ ఫోటోని చూడగానే నా గుండెల్ని ఎవరో పిండి చేసినట్లు అయింది.

తలుపుల్ని వేసేసి, నీరసంగా మంచం మీదే కూల బడ్డాను.

అన్నయ్య రూపం కళ్ళ ముందు మెదలింది.

అన్నయ్యా నూరేళ్ళ నీ నిండు జీవితాన్ని ముప్ఫయ్

ఏళ్ళకే కాలరాచి వేసిన ఆ నాగభూషణం, సునీతలని నీదగ్గరకి పంపేదాక నా గుండెల మంటలు చల్లారవు.

ఆ నాగభూషణం తనంత తానుగా నా కాళ్ళు కడిగి కూతుర్ని నాకిచ్చి చేసిన రోజున నా ప్లాను పూర్తిగా అమలు జరుపుతాను. చిత్రహింసలు పెట్టి ఆ సునీతని వాడి ఎదురుగానే చంపుతాను.

ప్రతిజ్ఞ చేస్తున్నట్లు అనుకొన్న నామదిలో భాస్కర్ మరణం గుర్తుకు రాసాగింది.

అన్నయ్యా, నేను, తప్పించి మాకు నా అన్నవారు ఎవ్వరూ లేరు. అన్నయ్య లైఫ్ ఇన్సూరెన్స్ ఆఫీసులో పనిచేస్తున్నాడు.

నేను బి.ఎస్సి. చదువుతున్నాను. సెకండ్ ఇయర్‌లో వుండగా రవి పరిచయమైనాడు.

అన్నయ్యా, నేనూ, రవీ రోజూ పబ్లిక్ గార్డన్‌లో కలుసుకుని కబుర్లు చెప్పుకొనేవాళ్ళం. అలా కాలమే తెలిసి వచ్చేదికాదు మా ముగ్గురికి.

నేను బి.ఎస్సి. ఆఖరి సంవత్సరం పరీక్షలు వ్రాస్తున్నాను. ఆఖరి పరీక్ష వ్రాసి ఇంటికి వస్తుండగా నాలుగు రోడ్ల జంక్షన్ దగ్గర చాలా కార్లు ఆగివున్నాయి. ఎర్రటి కారులో ఓ అందమైన యువతి ప్రక్కన అన్నయ్య కనిపించాడు.

అలా అన్నయ్యని చూడగానే నాకు చాలా గాబరా వేసింది.

ధనవంతులంటే మొదటినుంచి నాకు అసహ్యం. డబ్బున్న వ్యక్తులు ఆ డబ్బుకే మాత్రమే విలువనిస్తారు. అందుకే వాళ్ళ నీడనికూడా భరించలేను. అన్నయ్య

ఆ ధనవంతుల పడగ నీడలోకి వెళుతున్నాడేమోనని చాలా భయపడ్డాను.

అన్నయ్య ఇంటికి రాగానే 'నీ ప్రక్క కారు నడుపుతున్న ఆ సుందరాంగి ఎవరు?' అని అడిగాను. అన్నయ్య నావంక తికమకగా చూసి, నా చెయ్యి పట్టి తన ప్రక్కన కూర్చోబెట్టుకొని.

"రాజూ! సునీతా బ్యాటరీ ఫ్యాక్టరీ తెలుసా? ఆ ఫ్యాక్టరీ అధినేత నాగభూషణంగారి అమ్మాయి సునీత, నేనూ ప్రేమించుకొంటున్నాం" అన్నాడు.

"అన్నయ్యా! మనం పేదవాళ్ళం, ఆ అమ్మాయి చాలా డబ్బున్న పిల్లలా వుంది, వాళ్ళ నాన్నగారు మీ ఇద్దరి పెళ్ళికి అంగీకరిస్తారనే అనుకొంటున్నావా?"

"రాజూ! నీకన్నీ అనుమానాలే. సునీత ఆయనకి ఒక్కర్తే సంతానం. ఒక్కగానొక్క కూతురి సుఖాన్ని తీర్చటానికి ఏ తండ్రీ వెనుకాడడు."

"అది నీ ఉవాచ. అసలు ఆయనకి మీ సంగతి తెలుసా?"

"ఇప్పటికి ఇంకా తెలియదు."

"అన్నయ్యా! ఒకవేళ ఆయన మీ పెళ్ళికి ఇష్టపడక పోతే?"

నా ప్రశ్నకి అన్నయ్య చిన్నగా నా తలపై తన చేతో కొట్టి, "డిటెక్టివ్ కథలు రాసే నీ బుర్రకి అన్నీ సందేహాలే" అని లేచిపోయాడు.

నేను మరేం మాట్లాడే అవకాశం లేకపోయింది.

రోజులు గడుస్తున్నాయి. అన్నయ్య ఓసారి దూరం నుంచి సునీత బంగళా చూపించాడు.

అప్పుడే గేటుముందు ఆగిన కారులోంచి దిగుతున్న ఓ మధ్య వయస్కుడిని చూపించి అతడే సునీత తండ్రి అని చెప్పాడు.

ఎందుకో ఆయన్ని చూడగానే సదభిప్రాయం కలగ లేదు నాకు. అయితే నా అభిప్రాయాన్ని బయటపెట్ట లేదు.

ఓరోజు నీరసంగా ముఖాన్ని వేలాడేసుకొని వచ్చాడు అన్నయ్య.

"ఏమైంది?" ఆత్రంగా ప్రశ్నించాను నేను.

అన్నయ్య మంచంమీద కూర్చొని, "రాజా! నువ్వు అన్నదే కరెక్టురా" అన్నాడు.

"ఏమిటి?"

"నాగభూషణం నిన్న నన్నూ, సునీతనీ చూసేసా డట. సునీతతో నేను పేదవాడినని, నాతో తిరగవద్దని అన్నాడట. ఈరోజు కలుసుకొన్న సునీత చెప్పింది."

"నేను చెప్పలే! ఆ ధనవంతులకున్న రోగమే ఇది" కసిగా అన్నాను.

"సునీత అలాంటిది కాదురా."

"కాకపోతే తండ్రిని ఎదిరించి నీ వెంట రాలేక పోయిందా."

"రాజూ! రేపు వుదయం ఆయన ఇంటికి వెళతాను. సునీతని పెళ్లాడుతానని చెప్తాను. ఆయన అంగీకరించారా సరే, సరి. లేదా సునీతని తీసుకొని ఇక్కడకి వచ్చేస్తాను."

"అంత ఇష్టంలేని వ్యక్తులకు అల్లుడు కావటం దేనికి?"

"ఆయనకి అల్లుడు కావాలని వాచిపోవటం లేదు. సునీతా, నేను ప్రేమించుకొన్నాం. అందుకే ఆయన వద్దన్నా పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించుకొన్నాం."

అన్నయ్య సునీతని చేసుకొంటాను అని అంత ఖచ్చితంగా చెప్తుంటే నేను మరేం అనలేకపోయాను.

ఆ మర్నాడు సునీత ఇంటికి వెళ్ళటానికి తయారౌతున్నాడు అన్నయ్య.

ఆకుపచ్చరంగు షర్టూ, కాఫీ రంగు ప్యాంటూ వేసుకొన్నాడు. వాడు జోళ్ళు వేసుకొంటుండగా అపనకి వ్రాసిన కథ కవరులో పెట్టి, స్టాంప్స్ అంటించి అన్నయ్య చేతికి ఇచ్చి పోస్టు చెయ్యమన్నాను.

వాడు దాన్ని జేబులోకి తోసేసి బయటకు వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళాక నేను స్నానం ముగించుకొని పత్రికకు పంపాలనుకొని సగం వ్రాసి వదిలేసిన మరో కథని పూర్తి చెయ్యటానికి కాగితాలు ముందు వేసుకొని కూర్చున్నాను.

పన్నెండు గంటలకి అవి పూర్తిచేసి జాగ్రత్తగా పిన్ చేసి కవర్లో పెట్టి వుంచాను.

అప్పుడు అన్నయ్య గుర్తు వచ్చాడు. వుదయం అనగా వెళ్ళినవాడు ఇంకా రాకపోవటానికి కారణం వెతుక్కోసాగాను.

ఒంటి గంట అయింది. రెండు, మూడు, నాలుగు.

సాయంత్రం ఆరు అయింది. రవి ఇంటికి వచ్చి క్లబ్ కి రమ్మంటే తలనొప్పిగా వుందని రాలేనని చెప్పి వాడిని పంపేసాను.

ఆ రాత్రికూడా అన్నయ్య జాడ లేకపోయేసరికి నాలో కలవరం మొదలైంది.

నాగభూషణం ఇంటికి వెళ్ళిన అన్నయ్య ఇంకా ఎందుకు రాలేదు? ఆయన తమ పెళ్ళికి ఇష్టపడకపోతే సునీతని తీసుకొచ్చేస్తానన్నాడే? మరి ఎందుకు రాలేదు? ఒకవేళ అన్నయ్యా, సునీత ఆ ఇంట్లోంచి వస్తుండగా నాగభూషణం తన మనుషుల్ని పంపి కూతుర్ని వెనక్కి తీసుకురమ్మంటే ఇద్దరూ ఎటైనా పారిపోయారా? అలా గాని జరిగితే వాళ్ళకి సురక్షితమైన ప్రదేశం ఇదే. ఇక్కడికి రాకుండా ఎటు వెళతారు?

రకరకాల ఆలోచనలు నన్ను ఆవరిస్తున్నాయి. ఏదీ తేల్చుకోలేకపోతున్నాను. అన్నయ్య ఇంటికి వచ్చేంత వరకూ ఇలా ఆలోచనలతో తల బ్రద్దలు కొట్టుకోవలసిందే తప్ప ఏం జరిగిందీ తెలియదు.

నేను ఆలోచించటం మానుకొని అన్నయ్య కోసం ఎదురుచూడసాగాను.

ఆ మర్నాడు అన్నయ్యతో పనిచేస్తున్న ఆయన వచ్చి అన్నయ్య గురించి అడిగితే అన్నయ్య ఊరెళ్ళాడని చెప్పి సెలవు చీటి ఇచ్చివేసాను.

అలా మరో నాలుగు రోజులు పోయేసరికి నాకు మతి పోతున్నట్లు అనిపించింది.

అన్నయ్య కనిపించలేదని పోలీస్ రిపోర్ట్ ఇస్తే అని అనుకొన్నాను.

తీరా రిపోర్ట్ ఇచ్చాక అన్నయ్యా, సునీత ఇంటికివస్తే, పోలీస్ రిపోర్ట్ ఇచ్చిన సంగతి అన్నయ్యకి తెలిస్తే 'నేనేం చిన్న కుర్రాడిని అనుకొంటున్నావా తప్పిపో

డానికి, ఎవరైనా ఎత్తుకుపోటానికి' అని నన్ను మందలిస్తే.

అటు పోలీస్‌లుకూడా తమ లైఫ్‌ని వేస్టు చేశారని విసుక్కుంటే.

అందుకే పోలీస్ రిపోర్ట్ ఇవ్వటానికి సంశయించాను.

నిజం ఏమిటో నేనే తేల్చుకోవాలనుకొన్నాను చివరకు.

ఆ మర్నాడు నాగభూషణం ఇంటికి బయలుదేరాను.

నాగభూషణం గేటు తలుపులకి పెద్ద తాళం కప్ప నన్ను వెక్కిరించింది.

నిలువునా నిరాశ క్రమ్మివేసింది నన్ను.

ఆ ఇంటికి దగ్గరగా ఏ ఇల్లు లేదు. దూరంగా వున్న ఇళ్ళవాళ్ళకి వీళ్ళు ఎక్కడకు వెళ్ళిందీ తెలియక పోవచ్చు.

ధనవంతుడైన నాగభూషణం ఆ చిన్న ఇళ్ళలో వుంటున్న వారికి తాము ఎటు వెళుతున్నదీ చెప్పడు.

నేను వెనుక ప్రక్కగా వెళ్ళాను. అతికష్టంమీద పిట్ట గోడ ఎక్కాను. క్రిందకి వంగి చూశాను. ఏవేవో పిచ్చి మొక్కలు గుబురుగా పెరిగిపోయి వున్నాయి. అలా వంగి చూస్తున్న నా కళ్ళకి ఏదో కవరులాంటిది కనిపించింది. అది కథలు పంపే పొడవాటి కవరు అని గుర్తించగానే ఎందుకో నా గుండెలు దడ దడ లాడాయి.

జామిచెట్టు ఆధారంతో క్రిందకిదిగి ఆ కవర్ని తీసాను. ఓపెన్ చేసేవుంది కవరు. అపరాధపరిశోధన ఎడ్రస్. అది నా రాతే.

నా గుండెలు గుబగుబలాడాయి. ఆరోజు అన్నయ్య నాగభూషణం ఇంటికి వెళుతుండగా ఈ కవరు పోస్టు చెయ్యమని వాడిచేతికిచ్చాను. ఇది పోస్టు చెయ్యలేదా?

చచ్చువూహా! పోస్టు చేస్తే ఇక్కడికి ఎలా వస్తుంది? కవరు ఓపెన్ చేసివుంది. అంటే అన్నయ్య దీనిద్వారా నాకేదో సందేశాన్ని పంపివుంటాడు.

నేను ఆ కవర్ని జేబులో పెట్టుకొని, ఓసారి పైకి చూశాను. చిన్న కిటికీలాంటిది కనిపించింది. ఆ కిటికి లోంచి చూస్తే లోపల ఏముందో అనుకొన్నాను. కాని మీదకి వుండటంతో చూడడం కష్టమని, బయటకొచ్చేసాను.

రోడ్ మీదకి వచ్చాక కవరులోంచి కథ బయటకి తీసాను. హామీపత్రంమీద 'వెనక్కి తిప్పు' అని వ్రాసి వుంది.

ఆత్రంగా వెనక్కి తిప్పాను.

“రాజా! ఈ వుత్తరం నీ చేతుల్లోనే పడుతుందని నాకు నమ్మకం లేదు. ఒకవేళ అదృష్టవశాత్తూ నన్ను వెతుక్కుంటూ వస్తే, ఈ కథ చూస్తే నీ చేతుల్లో పడవచ్చు. రాజా! నాగభూషణం ఎంత భయంకరమైన వ్యక్తో తెలుసుకొన్నాను. ఆ నిజం తెలుసుకొనేసరికి నేను మృత్యువుకి చాలా దగ్గరగా వచ్చేశాను. నాగభూషణం నన్ను చాలా తెలివిగా హత్య చేస్తున్నాడు. తిండిలేక, నీరులేక, చాలా చిత్రంగా చంపాలనుకొంటున్నాడు. నా చావుకి సాక్ష్యం వుండదు. అతని పాపానికి శిక్ష వుండదు. రాజా! ఇది నీవు చేరేసరికి ఆకలికి, దాహానికి తాళలేను నేను...”

ఎవరో నన్ను గట్టిగా ఢీ కొనటంతో త్రుళ్ళిపడి చూసాను.

"సారీ సార్ ఆ పేటలో ఎవడో తిండిలేక చచ్చిపోయాడట. చూద్దామని వెళుతూ తొందరలో గుద్దేశాను" ఎవరో కుర్రాడు క్షమాపణ చెప్పకొని వెళ్ళిపోయాడు.

తిండిలేక చచ్చిపోయాడా?

నేను జేబులో ఆ కవర్ని కుక్కుకొని ఆ కుర్రాడు వెళ్ళినవైపే వెళ్ళాను.

ఆ పేట అడుక్కు తిన్నవాళ్ళదని అక్కడున్న అనామకుల్ని చూసి తెలుసుకొన్నాను.

ఇంకొంత దూరం వెళ్ళేసరికి గుంపుగా మూగివున్న జనం కనిపించారు.

జనాన్ని తోసుకొంటూ వెళ్ళి చూసిన నేను విభ్రాంతుడనై అలాగే నిలిచిపోయాను.

చిరిగి పేలికలై వున్న ఆకుపచ్చ రంగు షర్టు, ఖాకీరంగు ఫ్యాంటు వికృతంగా కనుగుడ్లు వెళ్ళుకొచ్చి, ముఖంనిండా ఎర్రటి రక్తపు గాట్లుతో భయంకరంగా వున్న అన్నయ్య శవాన్ని మున్సిపాలిటీవాళ్ళు బండిలోకి ఎక్కిస్తున్నారు.

ఆ హృదయవిదారకమైన దృశ్యాన్ని ఎక్కువసేపు చూడలేని వాడిలా తెలివి తప్పిపోయేను. తిరిగి తెలివి వచ్చేసరికి అంతా నా చుట్టూ మూగివున్నారు. మున్సిపాలిటీ బండి వెళ్ళిపోయింది. నా కళ్ళనుంచి కారే కన్నీటిని చూసి నాది జాలిగుండె అనే సర్టిఫికేట్ నా ముఖాన కొట్టిన కొందరు నన్ను వూరడించారు.

"కొందరి బ్రతుకులే అంత బాబూ! ఏం పాపం చేసుకొన్నాడో అడుక్కు తిన్నవాడి జన్మ ఎత్తాడు. ఆ

పాపం బద్దలైయిందేమో ఆకలి బాధతో చచ్చి పోయాడు'' అని జాలిగా అన్నారు.

వాళ్ళ మాటలకి నా గుండెలు మరింత మండిపో సాగాయి.

ఆ దైవం సృష్టించిన అనాధకాదు నా అన్న. నాగ భూషణం చేతిలో నలిగిపోయిన అమాయకుడు.

అరే, నాగభూషణం నా అన్నని అనాధ శవంగా మార్చిన నిన్ను...నిన్ను వదిలిపెట్టను.

సునీతా! నీకు తెలియకుండా నా అన్న నీ ఇంట్లో ప్రాణాలు వదలడు. ఇందులో నీకు భాగముంది.

నిన్నూ నా అన్నని చంపిన రీతిలోనే చంపుతాను. తిండీ, నీరు లేక నీవు దిక్కుమాలిన చావు చస్తే నీ తండ్రి నీ చావుని కళ్ళ చూడాలి. ఆ తరువాతే వాడి చావు.

నేను నా పగ తీర్చుకొని నా అన్న ఆత్మకి శాంతి చేకూర్చుతాను.

అక్కడే ప్రతిజ్ఞ చేసుకొన్నాను.

ఆనాటినుంచి నాగభూషణం బంగళా చుట్టూ తిరిగే వాడిని. చాలాసార్లు సునీతని చూశాను. ఆమెని ఎలా వలలో వేసుకోవాలా అని ఆలోచించేవాడిని. కాని అవకాశం కుదరలేదు. ఆఖరికి సునీతతో పరిచయం కలి గింది. ఆ పరిచయాన్ని ప్రణయంలోకి దింపాలి. పెళ్ళి దాకా రావాలి. పెళ్ళి అయాక నాగభూషణానికి నేను పేదవాడినని తెలియాలి. ఆ తరువాత సునీతని పైకి పంపాలి. ఆ తరువాత నాగభూషణం...

ఇదే నా జీవితానికి మిగిలిపోయిన ఆశ. నా ఆశయం ఇదే. ఇది నెరవేరితే నా గుండె మంటలు చల్లారుతాయి.

అన్నయ్య ఆత్మకి శాంతి, నా మనసుకు ప్రశాంతి లభిస్తుంది.

ఆ మర్నాడు ఉదయాన్నే తెల్ల కాయితాలు ముందు వేసుకొన్నాను.

అమాయకుడైన అన్నయ్య జీవితాన్ని, నాగభూషణం క్రౌర్యాన్ని యదార్థంగా చిత్రించే అవకాశం దొరికింది. 'నేరం నాదికాదు' అన్న పేరుని అందంగా తీర్చి దిద్ది పన్నెండువరకూ వ్రాస్తూ కూర్చున్నాను.

పన్నెండు గంటలకి ఆ కాయితాలని వరసన పెట్టి హోమీ పత్రం జతపరచాను. నాకు ప్రతీ పత్రికతో చాలా పరిచయం వుండబట్టి, సగం నవలే ముందు పంపిస్తున్నానని, మిగిలినది అతిత్వరలో పంపగలనని వ్రాసాను.

అది పోస్ట్ చెయ్యటానికి డ్రెస్ చేసుకొంటుంటే అన్నయ్యతో పనిచేస్తున్న ఆయన వచ్చి, అన్నయ్య ఉద్యోగం పోయిందని చెప్పాడు. మనిషే పోయినపుడు యిక ఉద్యోగం పోతే వచ్చే నష్టమేముంది.

ఆయన ఓ పది నిమిషాలు మాట్లాడి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్లాక వీధిలో పడ్డాను. ఆ నవల పోస్ట్ చెయ్యటం అయాక రవి ఇంటికి వెళ్ళాను. రవి ఒక్కడే వున్నాడు ఇంట్లో. వాళ్ళ నాన్నగారు, అమ్మగారు తిరుపతీ, మద్రాసు, ఇంకా ఏవేవో చూడటానికి వెళ్లారట. ఆ పూట రవి భోజనం చేస్తేకాని వీల్లేదని వుంచేసాడు నన్ను.

## 4

ఆరోజు లైబ్రరీకి వెళదామని తయారౌతున్నాను నేను. అంతలో పోస్ట్‌మాన్ ఓ కార్డు ఇచ్చి వెళ్ళాడు.

'మీ నవల నేరం నాదికాదు జూలై నెలనుంచి ప్రచురించబోతున్నాం. మిగిలినది అతిత్వరలో పంపవలసినది...'

నాకు తెలుసు. నా కథలుగాని, నవలలుగాని తిరిగి రావని. ఒకప్పుడు యాభై కథలు తిరిగివచ్చినా, ఇప్పుడు పేరున్న రచయితని. ఏది ఏమైనా త్వరగా నాగభూషణం, సునీతల జీవితాలని ముగించి, నా నవల ముగింపు పంపెయ్యాలి, అనుకొంటూ ఆ కార్డు టేబిల్ పై పడేసి బయట కెళ్ళిపోయాను.

లైబ్రరీలో కూర్చొని తెరచి రాజు చదువుతున్నాను.

ఎంతోసేపు నా కళ్ళు అక్షరాలవెంట పరుగులు తియ్యలేకపోయాయి.

అన్నయ్య రూపం నా కళ్ళముందు కదలాడసాగింది. అన్నయ్య శవం నా కనులముందు కదలాడి నన్ను విపరీతంగా కలవరపెడుతున్నది. ఇక ఆ పుస్తకం చదవలేననిపించి విసుగ్గా బుక్ మూసేసాను.

అంతలో "హలో" అన్న సన్నని కంఠస్వరం వినిపించింది.

వెనక్కి తిరిగి చూసాను.

ఆకు పచ్చటి దుస్తుల్లో అతి అందంగా నిలిచివుంది సునీత.

"మీరా?" అన్నాను ఆశ్చర్యంగా.

ఆమె ఇంత వేగిరం కనిపిస్తుందని కాని, అనతి కాలంలో ఆమె పరిచయం పెంపొందుతుందని నేను అనుకోలేదు. ఆమెని చూడగానే ఆశ్చర్యపోయాను.

సునీత నాకెదురుగా కూర్చుంటూ నన్ను పరీక్షగా చూసింది.

అప్పుడే నన్ను నేను చూసుకొన్నాను.

సాదా దుస్తుల్లో వున్నాను. నేను పేదవాడినని తెలిస్తే నా స్నేహాన్ని ఆశించదేమో? అలాగే కాని జరిగితే నా ప్లాను ఇంతటితో సరి.

"నేను ఓ డ్రామాలో పేద పాత్ర వేస్తున్నాను. ఫైనల్ రిహార్సిల్ కి పేదతనంగా రమ్మన్నాడు డైరెక్టర్. నాకు ఇలాంటి గుడ్డల్లో కనిపించటం అంటే చాలా చికాకుగా ఉంది. ఆ డైరక్టర్ నా ఫ్రెండ్ కాబట్టి తప్పనిసరిగా వేసుకొన్నాను."

నేను తెలివిగా సునీత ముఖంలోకి చూసాను.

"మీరు ఈ దుస్తుల్లోనే బాగున్నారు."

ఆమె మాటలకు తెలతెలబోతూ చూసాను. ఆమె నిజంగానే ఈ మాటల్ని అన్నదా? లోలో అనుకొం టున్నా నేను.

"మీరు రోజూ ఇక్కడికి వస్తారా?" అని ప్రశ్నిం చాను.

"రోజు తప్పి రోజు వస్తాను. మీరు."

"నేనూ అంతే."

"అలాగా!" సునీత కళ్ళలో చిన్న మెరుపు మెరిసింది.

నేను లేచి నిలబడి "నాకు రిహార్సిల్ కి టైమ్ అవు తున్నది" అన్నాను.

"రాజుగారూ! మీరు ఎల్లుండి మళ్ళీ వస్తారా?"

"వీలైతే" కావాలనే అలా అన్నాను.

"ప్లీజ్! నాకోసం రండి."

నేను వింతగా చూసాను ఆమె కళ్ళలోకి.

సునీత తలవంచేసుకొని తన చేతివ్రేళ్ళతో హేండ్ బేగ్ జిప్ అటూ, ఇటూ లాగుతూ___

"రాజుగారూ! మీ రూపాన్ని చూస్తూ, మీ మాటల్ని వింటూ నాలో ఆవేదన నంతటిని మరచిపో గలుగుతున్నాను. దయచేసి నాకోసం రండి."

తలెత్తి చూసిన ఆమె కళ్ళలో తడి నన్ను ఆశ్చర్య చికితుణ్ని చేసింది.

ఆమె ఎందుకిలా చింతిస్తోంది? నిజంగా అన్నయ్యని ప్రేమించిందా? ప్రేమించినదే అయితే తన ప్రియుడిని అలా ఆకలిచావు చంపుకోగలదా? తన ఇంట్లో బందీ అయి, తిండి నీరు లేకుండా మరణించిన ప్రియుడిని రక్షించుకోలేకపోయిందా? ఆమెకి తెలియకుండా అన్నయ్య హత్యాప్రయత్నం జరగగలదా?

ఆ వూహ నన్ను రెచ్చగొట్టింది. ఆమెని అక్కడి కక్కడే పీక పిసికి చంపెయ్యాలనేంత కసి, క్రోధం చెలరేగింది. కాని అది చాలా సులభమైన చావు. చాలా ఆనందమైన చావు. ఆ మాత్రంగా చనిపోయిన వాళ్ళ బాధ నా ఆవేదనని అణగార్చలేదు.

ఆ వూహ నా ఆవేశాన్ని అణగద్రొక్కింది. గుండెలో దావానలాన్ని దాచుకొని బలవంతాన పెదవులమీదకి చిరునవ్వుని ఎరువు తెచ్చుకొని_

"మిమ్మల్ని చూశాక, మీరు రమ్మని ఆహ్వానించాక రాకుండా వుండగలనా? ఎల్లుండే కాదు. రోజూ మీ సాన్నిధ్యంలో గడపమన్నా నాకెటువంటి అభ్యంతరం లేదు. మీరు అదృష్టాన్ని నాకు వరంగా ఇవ్వాలేగాని" అని అన్నాను.

సునీత కళ్ళు వెలిగిపోయాయి. "థేంక్యూ" అంది.

ఆమెకి చెప్పి నేను బయటికి వెళ్ళిపోయాను.

## 5

"మే ఐ కమిన్" దగ్గరగా వేసివున్న తలుపుల మీద చిన్నగా కొట్టాను.

"యస్ కమిన్" ఓ కరకు గొంతు వినిపించింది.

నెమ్మదిగా తలుపుల్ని తోసి లోనికి ప్రవేశించాను.

నాకు ఎదురుగా నాగభూషణం నిలబడి వున్నాడు. నన్ను ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

అతన్ని చూడగానే అన్నయ్య భయంకర మరణం గుర్తువచ్చి నాలో రక్తం సలసలా కాగిపోయింది. వుద్రేకం పొంగివచ్చి నా మెడక్రింద నరాలు వుబ్బాయి. పళ్ళు గట్టిగా బిగుసుకొన్నాయి. ఆ ఆవేశంలో నాగ భూషణాన్ని ఏదో చెయ్యాలని ఒక్క అడుగు మాత్రమే ముందుకు వేసాను.

అంతలో "డాడీ! ఈయనే నన్ను రౌడీల బారినుంచి రక్షించినది" అన్న సునీత గొంతు నా ఆవేశాన్ని చప్పున చల్లార్చివేసింది.

సునీత కావాలనే అబద్ధమాడింది. అలా హఠాత్ గా తన ఇంటికి వచ్చేసినందుకు తండ్రి ఏమంటాడనో అలా చెప్పివుంటుందని అనుకొన్నాను.

"గ్లాడ్ టు మీట్ యూ!" నాగభూషణం నా ఖరీదైన డ్రెస్ ని, మెడలో బంగారు గొలుసుకు వ్రేలాడు తున్న పెద్ద పతకాన్ని, తన చేతికివున్న వ్రేళ్ళకి వజ్ర పుటుంగరాలని, బంగారపు సామగ్రీనంతటిని ఒక్క చూపులో పరికిస్తూ అన్నాడు.

"సేమ్ టూ యూ!" అని సునీతవైపు తిరిగి_

"నిన్న తగవులాటలో మీ బేగ్ మరచిపోయి వెళ్ళిపోయారు. దానిలో మీ ఎడ్రస్ వుండబట్టి దీన్ని మీ కిచ్చివేసి వెళదామని వచ్చాను," అన్నాను.

చాలా రోజులై సునీత, నేను లైబ్రరీలో కలుసుకొంటున్నాం. మా స్నేహం చాలా బాగా పెరిగింది. నిన్న లైబ్రరీలో తన బేగ్ మరచిపోయింది సునీత.

ఈ బేగ్‌తో నా పరిచయాన్ని నాగభూషణంతో కలగజేసుకొందామని వచ్చాను.

నేను బేగ్‌ని ఆమెకి అందించి, "వెళతాను" అన్నాను.

నాగభూషణం వెంటనే అందుకొన్నాడు.

"కాఫీ అయినా తీసుకోకుండానా? వీల్లేదు. సునీతా! అసలు నిన్ను రక్షించిన ఈయన్ని వెంటనే ఇంటికి ఎందుకు తీసుకురాలేదు? వెళ్ళు, వెళ్ళి కాఫీ, టిఫిన్ తీసుకురా!"

ఒరీ, నాగభూషణం నీకు పద్మవిభూషణ్ బిరుదు ఇవ్వచ్చురా. నువ్వు నా బట్టలకి, బంగారానికి మాత్రమే విలువనిస్తున్నావ్, లోలో అనుకొన్నాను.

తండ్రి మాటలకి సునీత ఆనందంగా "ఓకే డాడీ! రెండు నిమిషాల్లో తెస్తాను" అని వెళ్ళిపోయింది.

"సునీతా! ప్లీజ్ అలాంటివేవీ పెట్టకండి. ఇంటి దగ్గర నాకోసం 'చైర్‌మన్' ఎదురుచూస్తుంటారు. వీలైతే మరోసారి తీసుకొంటాను."

నేను హుందాగా బయటకి నడిచాను.

నేను తమ కోర్కెని తీసిపారేసినందుకు ఆ తండ్రీ,

కూతుళ్ళ సుఖాలు అప్పుడాళ్ళా మాడిపోయాయి.

కారెక్కి చెయ్యి వూపాను ఇద్దరికీ.

## 6

నా నవల ప్రచురితమైంది.

మొదటిది చదివిన పాఠకుల వద్దనుంచి నాకు చాలా వుత్తరాలు వచ్చాయి.

ఆ వుత్తరాలు ఒక్కొక్కటీ చదువుతుంటే, 'రాజూ! నీ జీవితాన్ని నీ చేతులతో నీవే నలిపి వేసుకొంటు న్నావు.'

అని అంతరాత్మ గోల ప్రారంభించింది.

అయితే అన్నయ్య మరణంతో నా గుండె బండబారి పోయింది.

ఇప్పుడు నాలో రాక్షసత్వం తప్ప, మానవత్వం లేదు.

పగ, ప్రతీకారం తప్పించి నా భవిష్యత్ ని గురించి ఆందోళన లేదు.

ఆరోజు లైబ్రరీకి వెళ్ళాలని ఫుల్ సూట్ వేసుకొన్నా. ముందుగా క్లబ్ కెళ్ళాను.

క్లబ్ లో రవీ, నేను కార్డ్సు ఆడుతుండగా నాగ భూషణం వచ్చాడు.

నన్ను చూసి ఆఫీసర్ ని చూసి నవ్వినంత వినయంగా నవ్వాడు.

రవికి ఆయన్ని సునీత తండ్రిగా పరిచయం చేసి, రవిని నా పి. ఏగా పరిచయం చేసాను.

నాగభూషణం చేతులు పిసుక్కొంటూ "తమరు ఆది వారం నా ఇంటికి దయచెయ్యాలి. నేను గ్రాండ్ గా

పార్టీ ఇవ్వాలనుకొంటున్నాను'' అని అన్నాడు.

''ఆదివారమా? మీ ఇంటికా?'' కనుబొమలు ముడిచి, పై సర్దుకొంటూ అన్నాను.

''సునీతా బ్యూటిఫుల్ గరల్ అన్నారు. ఆ అమ్మాయి ఇంటికేనా సార్'' రవి కావాలనే అలా అన్నాడు.

నాగభూషణం వెంటనే అందుకున్నాడు.

''మా సునీత మిమ్మల్ని మరీ మరీ రమ్మని చెప్పింది. మీరు గాని ఆదివారం రాకపోతే తను వచ్చి మంచినీళ్ళు ముట్టనంది'' అన్నాడు మళ్ళీ.

ఆ పండుగ ముందు వుందిలే అనుకున్నాను లోలోపల.

''ఆయనంతలా పిలుస్తూంటే కాదనటం భావ్యంలేదు. ఆదివారం ఏమైనా ప్రోగ్రామ్స్ వుంటే కాన్సిల్ చేస్తాను. మీరు వెళ్ళండి'' రవి మాటలకి రెండు క్షణాలు తటపటాయించి—

''ఓ.కే. సునీతకోసం వస్తాను'' అన్నాను చిరు నవ్వుతో.

నా మాటలకి నాగభూషణం ముఖం చింకి చేటంత అయింది.

ఆదివారం తన ఇంటికి తప్పక రమ్మని మరీ మరీ చెప్పి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళాక నేను, రవీ పడి పడి నవ్వుకొన్నాం.

## 7

నాగభూషణం చాలా ఘనంగా పార్టీ ఇచ్చాడు.

ఆ పార్టీలో నన్ను సునీతని కావాలనే ఒంటరిగా వదిలేసాడు.

నాతో చిలిపిగా మాట్లాడుతున్న సునీతలో కొత్త అందాలు సంతరించుకొంటున్నాయి.

నాగభూషణం పార్టీ ఇచ్చాక, రవి నా పేరుమీదుగా తనూ పార్టీ ఇస్తానన్నాడు.

ఈ పార్టీలోనే సునీతని నా దానిగా చేసుకొంటానని, రవి నోటిమీదుగా చెప్పించాలని ప్లాను వేసుకొన్నాం. మరో ఆదివారం రవి ఇంట్లో రవి అందజేసిన పార్టీ చూసి, నాగభూషణానికి దాదాపు మతిపోయిందేమో ననిపించింది నాకు.

నాగభూషణం బంగళా కన్నా రవి బంగళా చాలా పెద్దది.

హాల్లో రవి తండ్రిగారి ఫోటో చూసి 'జగన్నాథం గారు మీతండ్రిగారా' అని ప్రశ్నించాడు నాగభూషణం.

రవి అవునని చెప్పాడు. ఆ మాటలు వినగానే నాగభూషణం ముఖంలో రంగులు మారిపోయాయి.

జగన్నాథంగారు ఎంతటివారో తెలియనివారు వుండరు. నేను ఆయన కొడుకునని అనగానే నాగభూషణం మతి పూర్తిగా పోయివుంటుంది.

రవి తల్లిదండ్రులు వూరినుంచి రాగానే— వారి బిడ్డనని చెప్పి, వాళ్ళచేత నాటకం ఆడించి, సునీత మెడలో తాళి కట్టాలి. ఇది రవి ప్లాను. ఈ ప్లానును రవి వాళ్ళవాళ్ళు వచ్చాక చెప్తానని, సునీతతో పెళ్ళి జరిగేవరకూ వారిని నా తల్లి, తండ్రిలా నటించమంటానని కూడా చెప్పాడు.

మేం నలుగురం డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చున్నాం. టిఫిన్ తీసుకొంటుండగా రవి అన్నాడు.

"నాగభూషణంగారూ! మా రాజుగారికి మీ సునీత చాలా నచ్చిందట" అని.

నాగభూషణం నావంక కలా? నిజమా అన్న మాదిరిగా చూస్తున్నాడు.

"నిజం నాగభూషణంగారూ! సునీతని నా భార్యగా చేసుకోవాలని వుంది. ఆమె ఇష్టపడితే మా నాన్నగారూ, అమ్మా వూరినుంచి వచ్చాక మీరు మాట్లాడ వచ్చు."

నేను బిరియానీ తింటూ ఓరగా సునీత ముఖంలోకి చూసాను.

ఆమె తల పూర్తిగా వంచి వుండటంతో ముఖ భావాలు ఏవీ కనిపెట్టలేకపోయాను.

"మా సునీత ఎలాంటి అభ్యంతరం చెప్పదులెండి."

అలా అనటంలో ఈ పుత్రాడినివదులుకోకు అన్న హెచ్చరిక చేస్తున్నాడనిపించింది.

సునీత తలవంచుకొని "నాకిష్టమే నాన్నగారూ" అంది.

"చూసారా, మా సునీత నామాట కాదనదు" అన్నాడు పళ్ళు ఇకిలిస్తూ..

ఆ తరువాత కావాలనేమో ఇద్దర్నీ ఒంటరిగా వదిలేసారు రవి, నాగభూషణం.

"సునీతా! ఈ పెళ్ళికి నీ అభ్యంతరం వుంటుందేమోనని జడిసిపోయాను."

"రాజూ! మీతో పెళ్ళికి ఏ మూర్ఖురాలూ అభ్యంతరం చెప్పదు. అయితే మీతో జీవితాన్ని పంచుకోబోతున్నాను కాబట్టి నిజాన్ని చెప్తున్నాను. నేను ఇది

వరలో భాస్కర్ అనే వ్యక్తిని ప్రేమించాను."

"ఈజిట్" అప్పుడే నాకీ సంగతి తెలిసినంతగా ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసాను.

"మరి అతన్ని ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?"

సునీత కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. "భాస్కర్‌ని పెళ్ళిచేసుకోవాలని ఎంతగానో ఆశపడ్డాను."

"మీ నాన్నగారు వద్దనేశారా?"

"ముందు పేదవాడని వద్దన్నారు. కాని నేను భాస్కర్‌ని తప్పించి మరెవర్నీ చేసుకోనని చెప్పేసరికి, తన ఆస్తిలో చిల్లిగవ్వ ఇవ్వనని పెళ్ళిమాత్రం చేస్తానని అన్నారు."

"మరి పెళ్ళిచేసుకోలేదేం?"

సునీత కళ్ళలోంచి నీళ్ళు జారిపడ్డాయి. రుమాలుతో కళ్ళు తుడుచుకొంది.

"నాన్నగారు ఆస్తిలో చిల్లిగవ్వ ఇవ్వననేసరికి భాస్కర్ నన్ను కలవటం మానేశాడు. అతను నా డబ్బునే ప్రేమించాడు కాని, నన్నుకాదు. ఆస్తిరాదని ఎటో వెళ్ళిపోయాడు."

అబద్ధం అని పిచ్చిగా అరవాలనిపించింది నాకు.

సునీత ఎంత అందంగా అబద్ధం చెప్పింది. అమాయకుడైన భాస్కర్‌ని హత్యచేసి, పైగా మోసగాడని అంటుందా?

"రాజూ! భాస్కర్‌కి, మీకు రూపంలో చాలా పోలికలు వున్నాయి. అందుకే ఆ రోజు మిమ్మల్ని చూసి భాస్కర్ తిరిగి వచ్చాడా? అని ఆశ్చర్యపోయాను. నాన్నగారు మొదట మిమ్మల్ని చూసి అలాగేఅనుకొన్నా రట."

బ్లడీ వుమెన్ ఎంత తెలివిగా అంటోంది. తమ చేతులలో తాము చంపాక తిరిగి ఎలా రాగలిగాడా? అని తండ్రీ కూతుళ్ళు ఆశ్చర్యపోయారో? లేక తమమీద పగ తీర్చుకొందుకు దెయ్యంగా మారివచ్చాడో? అని భయపడ్డారో? లోలో కసిగా అనుకొన్నాను.

# 8

రెండు రోజులైనా రవి నా ఇంటికి రాని కారణంగా, అటు క్లబ్ కి రాని కారణంగా ఎందుకు రాలేదో తెలుసుకొందామని వాడి ఇంటికి వెళ్ళాను.

హాల్లో జగన్నాధంగారు కనిపించారు.

"రవి లేడా? మీరు పూర్ణించి ఎప్పుడొచ్చారు?" సోఫాలో కూర్చుంటూ ప్రశ్నించాను.

"రవీ వాళ్ళ మామయ్యకి సీరియస్ గా వుందట, టెలిగ్రామ్ వచ్చింది. రవి, వాళ్ళమ్మా వెళ్ళారు" అని చెప్పారాయన.

చెప్పలేనంతటి నీరసం నన్ను ఆవహించింది.

రవి తిరిగి ఎప్పుడొస్తాడో? ఈలోగా నాగభూషణం ఇక్కడికి వస్తే నా ప్లాను నాశనమౌతుంది. అసలు రవి వీళ్ళకి మా ప్లాను చెప్పాడో లేదో?

"రవి మీకేమైనా చెప్పాడాండీ?"

"ఏది రాజూ! మేం ఇలా టాక్సీ దిగాం. వాడు టెలిగ్రామ్ చూపించాడు. అలాగే ఆ టాక్సీమీదే తల్లీ కొడుకూ వెళ్ళిపోయారు. ఏం? ఏదైనా విశేషముందా?"

తిరగేసి ఆయనే నన్ను ప్రశ్నిస్తుంటే ఏం చెప్పలేక పోయాను.

ఓ ఐదు నిముషాలు మాట్లాడి బయటపడ్డాను. మన సంతా చికాకుగా తయారైంది. నేను ఊహించినదానికి విరుద్ధంగా ఏం జరుగుతుందో అనే భయం నన్ను ఆవరించింది.

కొత్తగా వచ్చిన పత్రికలో నా నవల చదువుతున్నాను.

అంతలో ఎవరో తలుపులమీద చిన్నగా కొట్టారు.

బుక్ టేబిల్ మీద పడేసి వెళ్ళి తలుపుల్ని తీసాను.

ఎదురుగా నాగభూషణం నౌకర్ వీరన్న కనిపించాడు.

"ఏం? వీరన్నా ఎందుకొచ్చావు?" ప్రశ్నించాను నేను.

"సాయంత్రం అయ్యగారు మిమ్మల్ని ఓసారి ఇంటికి రమ్మన్నారండి."

నా గుండెలు గుబ గుబలాడాయి.

నన్ను సాయంత్రం ఇంటికి రమ్మన్నాడా? ఎందుకు? నిజం తెలిసిపోయిందా? చీవాట్లు పెట్టడానికి పిలుస్తున్నాడా? లేక నన్ను అంతం చెయ్యటానికి ఆహ్వానిస్తున్నాడా?

నేను ఆలోచనలను ఆపి, "వస్తానని చెప్పు" అని చెప్పా.

వాడు వెళ్ళిపోయాక తిరిగి ఆలోచనలో పడ్డాను.

ఆనాడు కూతురు ప్రేమించిన భాస్కర్ పేదవాడని తెలిసి అతనిని అంతం చేసాడు. కూతురికి ఏ ఫారిన్ రిటర్న్డ్ నో తెస్తానంటే ఆశపడి తండ్రితో చెయ్యికలిపి వుంటుంది సునీత.

ఈరోజు ఆ ఇద్దర్నీ తను వంచించాడు. ధనవంతుణ్ని అని నమ్మించాను. ఇపుడు నేను పేదవాడినని తెలిసి పోయి వుంటుంది. అందుకే భాస్కర్‌లా నన్ను చంపా లని అనుకొంటున్నారేమో? సాయంత్రం నేను వస్తానని కట్టుదిట్టాలు చేసుకొంటాడు.

వాడి ప్లాను పడగొట్టాలంటే ఇప్పుడే వెళితే.

నా ఈ ఆలోచన బాగున్నట్లు అనిపించింది. లేచి డ్రెస్ చేసుకొని చిన్న సైజు సీసాలతో నీళ్ళని నింపు కొని జేబులో పెట్టుకొన్నాను. జేకరీలో జేబులో పట్టే టంతటి బ్రెడ్స్ కొని జేబుల్లో కుక్కాను. ఇన్ని చాక్ లెట్లు చొక్కా జేబులో వేసుకొన్నాను. ప్యాంట్ జేబులు చాలా ఎత్తుగా కనిపించాయి.

నాగభూషణం చాలా ప్రమాదకారి అని నాకు తెలుసు. ఎలా? ఏ రీతిలో అన్నయ్యని ఆకలి బాధతో చంపాడో తెలియదు.

కీడుని శంకిస్తున్న మనసు చేసిన హెచ్చరికవల్లే ఆ జాగ్రత్తలు తీసుకొని నాగభూషణం ఇంటికెళ్లాను.

నాగభూషణం హాల్లోనే వున్నాడు.

నన్ను చూడగానే అతని మొహంల్లో క్రౌర్యం కొట్టొచ్చినట్టు కానరాసాగింది.

అప్పుడే హాల్లోకి వచ్చిన సునీత నన్ను చూడగానే "మీరా" అంది ఆనందంగా.

"సునీతా! ఈ రాస్కెల్ ఎవడో తెలుసా?"

నేను అనుకొన్నంతా అయింది. నాగభూషణం జగ న్నాథం గారింటికి వెళ్ళి నేను ఆయన కొడుకుని కాదన్న నిజం తెలుసుకొని వుంటాడు. నా ప్లాన్ ధ్వంస మయింది.

"నాన్నగారూ! ఆయనే" సునీత కలవరంగా ఏదో అనబోతుండగా నాగభూషణం చెయ్యి నా చెంపని తాకింది.

అది నేను వూహించని చర్య. ఆ దెబ్బకి సర్రున కరెంట్ ప్రాకినట్లు అయింది నాలో.

"రాస్కెల్! నువ్వు జగన్నాథంగారి అబ్బాయివా? నన్ను వంచించటానికి నీకెన్ని గుండెలుండాలిరా!" సునీత నావంక అయోమయంగా చూసింది.

నేను పెళ్ళున నవ్వాను.

"నాగభూషణం! జగన్నాథంగారి అబ్బాయిలా నటించాను. కారణం సునీతని నేను ప్రాణంగా ప్రేమిస్తున్నాను. ఆమె లేనిదే బ్రతకలేననిపించింది. పేదవాడినని తెలిస్తే సునీతని నాకిచ్చి పెళ్ళి చెయ్యనని డబ్బున్నవాడిలా నటించాను. సునీతకి నన్ను చేసుకోవటం ఇష్టమే. నీవు ఏ తగవూ లేకుండా మా పెళ్ళికి అంగీకరిస్తే పరవాలేదు. లేదా ఇద్దరం మైనార్టీ తీరిన వాళ్ళమే రిజిష్టర్ మారేజ్ చేసుకొంటాం."

కరకుగా అంటున్న నా మాటల్ని నివ్వెరపోయి వింటున్న నాగభూషణం కట్లు తెగి వీధిలో పడ్డ ఆబోతులా నామీదకి రాబోయేడు.

సునీత తండ్రిని చప్పున ఆపింది.

"నాన్నగారూ! ప్రేమించిన భాస్కర్ ఎటో వెళ్ళిపోయాడు. ప్రేమించబడ్డ రాజుని దూరం చెయ్యవద్దు. భాస్కర్ నాకు ఆస్తి రాదని తెలిసికొని పారిపోయాడు. కాని రాజు నాకోసం ఆస్తిపరుడిలా నటించాడు. ప్లీజ్, మా ఇద్దర్నీ ఆశీర్వదించండి. మా పెళ్ళికి అభ్యంతరం తెలపకండి."

"సునీతా! ఒకవేళ నేను ఆశీర్వదించకపోతే?"

సునీత నిశ్చలంగా చూసింది. "రాజు వెంట నడవటానికి సిద్ధంగా వున్నాను. డబ్బుతో నా కేనాడూ సుఖం లేదు. ప్రేమలో లభిస్తుందని తెలుసుకొన్నాను.

నన్ను, నన్నుగా ప్రేమించే రాజుకోసం ఏదైనా చేస్తాను. భాస్కర్‌ని ప్రేమించానని తెలిసికూడా నన్ను అభిమానించే రాజుని మీరు కాదూ అన్నా పెళ్ళాడుతాను!"

సునీత మాటలకి నా తల గిర్రున తిరిగిపోసాగింది. నిజంగా సునీత నన్ను పిచ్చిగా ఆరాధిస్తున్నదా? మరి భాస్కర్‌ని ఇలాగే ఎదిరించి ఎందుకు పెళ్ళాడ లేకపోయింది?

"రాజూ!" నాగభూషణం పిలుపుకు వులిక్కిపడి చూసాను.

"నువ్వు నా బలహీనతని చూసి సునీతని ప్రేమించావు. సునీత నా సర్వస్వం కాబట్టి అది ఏం కోరినా కాదనగల శక్తి నాకు లేదు. నీలో ఏం చూసిందో నిన్ను వరించింది. తండ్రిగా నా బాధ్యతలని నేను నెరవేర్చాలి. అయితే ముందు నిన్ను నా ఫ్యాక్టరీ మానేజరుగా వేసుకుంటాను. ఆ తరువాతే నిన్ను నా అల్లుడిగా చేసుకొంటాను."

"నాన్నగారూ!" సునీత సంతోషంగా తండ్రి పువేసింది.

నేను కలలోలా ఆయన్ని చూస్తూ నిలిచిపోయాను.

"సునీతా! నాకు, రాజూకి త్వరగా వంట రెడీచెయ్. రాజూ నాతో రా" ఆయన ఆమాట అనేసి ముందుకు నడిచారు. నాకు అయోమయంగా వుంది. మంత్రముగ్ధుడిలా ఆయన వెంట నడిచాను.

నాగభూషణం సునీత ఎంత ముద్దుగా పెరిగిందీ చెప్తూ, వరుసగా నాలుగు గదులు దాటాడు. ఆయన చెప్తున్నవి ఏవీ నా తలకి ఎక్కటం లేదు. సునీత నిష్కల్మషమైన ప్రేమ నన్ను వివశుణ్ని చేసింది.

అంతలో హఠాత్తుగా తూలి ముందుకు పడ్డాను. నిల ద్రొక్కుకొనే అవకాశం లేదు. ఏవో మెట్లున్నాయి. దొర్లుకొంటూ వెళ్ళి గోడకి గుద్దుకొన్నాను. నుదుటిపై బుసబుసా పొంగిపోయింది. తలుపులు మూసుకొన్న శబ్దం వినిపించింది.

తలమీద తగిలిన ఆ దెబ్బతో నాగభూషణం తీసిన దెబ్బతో పది నిముషాల వరకూ నా మెదడు పూర్తిగా మొద్దుబారిపోయింది. అలాగే స్తబ్దుగా కూర్చుండి పోయాను.

ఎంత మోసం చేశాడు నాగభూషణం. ఎంత తెలివిగా నన్ను ఈ చీకటి కొట్లో బంధించాడు. ఆనాడు అన్నయ్యని ఇదే రీతిలో హత్యచేసి వుంటాడు.

పెళ్ళికి వప్పుకొన్నట్లు వప్పుకొని ఇలా బంధించి తిండీ నీరు లేక చంపి వుంటాడు. అంటే నన్నుకూడా తిండీ నీరు, లేకా మాడ్చి చంపి, అడుక్కొనే వాళ్ళ పేటలో, మున్సిపాలిటీ బండిలో...

మైగాడ్! ఎంత భయంకరమైన వ్యక్తి. ఈ వూహకి నా తనువు కంపించిపోయింది. ముఖం నిండా పట్టిన చెమటల్ని అరచేతులతో తుడుచుకొని చుట్టూ చూసాను. మంచం, తలగడా, దుప్పటీ, తప్పించి మరేం లేవు గదిలో.

కొంచెం ఎత్తుగా చిన్న కిటికీ వుంది. అందులోంచే

అన్నయ్య కవర్ని బయటకి విసిరాడని గ్రహించాను. గది నంతటిని పరీక్షగా చూస్తున్న నాకు ఆ గదిలో అన్నయ్య పెన్ను దొరికింది.

ఆ పెన్నుని చూస్తుంటే నా జీవితానికి సమాధి పేర్చ బడిందని అనుకొన్నాను. తప్పించుకొనేందుకు అవకాశం లేదు. ఆఖరికి ఎవరినైతే చంపాలని ప్లాను వేసానో వాళ్ళ చేతిలోనే నా చావుని కొని తెచ్చుకొన్నాను. ఈవిధంగా, ఇలా దెబ్బతీస్తాడని కలలోకూడా వూహించని నేను, చాలా అజాగ్రత్తగా వుండటంతో నాగ భూషణం చాలా ఘోరంగా దెబ్బతీశాడు. ఆటంబాంబు లాంటి నాగభూషణాన్ని ప్రక్కలో పెట్టుకొని, అది పేలదని అనుకోవటం నా అవివేకం. ఇపుడెంత విచారించి ఏం లాభం?

నేను నిరాశగా నిట్టూర్పు విడిచి, నీరసంగా మంచం మీద వాలిపోయాను. సునీత రూపం నా కనులముందు కదలాడింది.

సునీత నన్నుగురించి అడగదా? అడిగితే నిజం బయట పడదా? ఎలా పడుతుంది? నేను కనిపించకపోయేసరికి నన్నుగురించి అడుగుతుంది. ఏదో పనిమీద బయటకెళ్ళా డనో, మరేదో సాకు చెప్తాడు. ఇందులో సమాధి అయిన నేను తిరిగి రాకపోవటంతో ఆసి రాదని తెలియగానే ఆమెని పెళ్ళిచేసుకోవటం ఇష్టంలేక లోకం ముడిచేసానని అనుకొంటుంది. అందుకేనేమో భాస్కర్‌ను వంచకు డన్నది.

సునీతా ఎంత అమాయకురాలివి. నువ్వు పేదవాడిని పెళ్ళాడితే తన ప్రతిష్ట గంగలో కలుస్తుందని నిన్ను

చాలా ప్రేమగా వంచించి, అన్నయ్యని చంపాడు. మళ్ళీ నువ్వు పేదవాడినే పెళ్ళాడుతానన్నావు. ఫలితం నేను చావబోతున్నాను. ఇకనువ్వు పేదవాళ్ళమీద అసహ్యంతో ఎవర్నీ ప్రేమించలేవు. తండ్రి కుదిర్చిన ఏ ఫారెన్ రిటర్న్డ్ డినో పెళ్ళాడి జీవితాన్ని యాంత్రికంగా గడిపివేస్తావు.

అమాయకురాలవైన నిన్ను చంపాలనుకొన్నాను. ఏ పాపం ఎరుగని నీమీద మొదటినుంచీ అనుమానపడి పోయాను. నిజం తెలుసుకొనేసరికి మృత్యువు ముందు నిలచి వున్నావు.

నేను బలవంతాన ఆలోచనలని నొక్కిపెడుతూ, కళ్ళు గట్టిగా మూసాను. మూసిన కళ్ళకి నిద్ర రావటం సాధ్యమా—అసలు అలాంటి పరిస్థితిలో నిద్ర పడుతుందా?

# 9

నాలుగు రోజులు గడిచాయని కిటికీలోంచి ప్రసరిస్తున్న వెలుగు, చీకట్లనిబట్టి తెలుసుకొన్నాను. ఈ నాలుగు రోజులు నా దగ్గరున్న రొట్టెలతో, నీళ్ళతో గడిపేసాను.

ఇంక రేపటినుంచి ఎలా? ఎవరూ తలుపులు తీస్తారన్న ఆశ లేదు.

ఆ మర్నాడు చాక్లెట్లతో తృప్తిపడ్డాను.

కాని అవి ఏమాత్రం.

ఆ మర్నాడు ఆహారం లేక, నీళ్ళులేక దాదాపు నాకు పిచ్చి ఎక్కినట్లు అనిపించసాగింది.

రెండో రోజు నా పరిస్థితి చాలా అధ్వాన్నంగా

తయారైంది. ఆకలితో కడుపు మండిపోసాగింది. దాహంతో గొంతు ఎండిపోసాగింది.

కసి కొద్ది ఖాళీ సీసాలని నేలకేసి పగులగొట్టాను. తలగడా విసిరికొట్టాను. తలుపుల దగ్గరకెళ్ళి శక్తి వున్నంత వరకూ కొట్టి, కొట్టి అలాగే పడిపోయాను.

తిరిగి తెలివి వచ్చేసరికి వెలుగు రేఖలు నా గదిలో పడుతున్నాయి.

మైగాడ్, సరిగ్గా పదమూడు గంటలు నిద్రపోయి వుంటాను అనుకొంటూ వాచీ చూసుకొన్నాను.

అది పగిలిపోయింది. ఆకలి కోపంలో దాన్ని పగల గొట్టుకొన్నాను.

బాగా వెలుతురు వుండటంతో ఏ పదో అయివుంటుం దనుకొన్నాను.

లేచి నిలబడి రెండు అడుగులు వెయ్యబోయాను.

కడుపులో కత్తి పెట్టి కలికినంత బాధ వేసింది. పూర్తిగా శక్తిని కోల్పోయాను. పెదవులు ఎండిపోయి బొప్పరలు వచ్చేస్తున్నాయి. కళ్ళు వాలిపోతున్నాయి. మళ్ళీ అక్కడే కూలబడ్డాను.

తిరిగి తెలివి వచ్చేసరికి గది అంతా చీకటిగా వుంది.

తల విపరీతంగా నొప్పి పెడుతున్నది. ఆకలికి కడుపులో పేగులు వికృతంగా అరుస్తున్నాయి. గోడ ఆసరాతో లేచి నిలబడ్డాను. నా చుట్టూవున్న ప్రదేశం గిర్రున తిరిగి పోతున్నట్లు అనిపించింది. ఏదో మైకంలాంటిది నన్ను ఆవహిస్తున్నది. కళ్ళు భగభగ మండిపోతున్నాయి. రెప్ప లైనా పైకి ఎత్తలేకపోతున్నాను.

మళ్ళీ నిద్ర పట్టేస్తే బాగుండుననుకొన్న నేను తుళ్ళి పడ్డాను.

ఇంకోసారి నిద్ర వస్తే అది శాశ్వత నిద్ర కాదుకదా? తిండీ, నీరు, లేక ఏ కోమాలోకో దించితే. నేను నిలువునా వణికిపోయాను. బలవంతాన కళ్ళని పూర్తిగా విప్పాను. నిద్రపోకూడదని లేనిశక్తిని కూడగట్టుకొంటూ మంచం దగ్గరికి వెళ్ళాను.

ఆహారం వుండదని తెలిసికూడా పిచ్చిగా మంచం క్రింద చెయ్యిపెట్టి వెతికాను. ఖాళీ రొట్టి పేపర్స చాక్లెట్ కాయితాలు తగిలాయి. ఆ కాయితాలని పిచ్చిగా చింపేసాను.

తలుపుల దగ్గర కెళ్ళి—

'అరేయ్, నాగభూషణం తలుపులు తియ్యరా' అంటూ పేగులు తెగేలా అరిచాను.

ఎండిపోయిన నా గొంతులోంచి ఆ మాటలు సప్త స్వరాలతో వెలువడ్డాయి.

చేతులు నొప్పి పుట్టేలా తలుపుల్ని బాదసాగాను.

ఫలితం శూన్యం!

నిద్రాదేవి నన్ను ఆవహిస్తున్నది. పిచ్చిఎక్కినవాడిలా, బంధింపబడ్డ పులిలా గదిలో తిరగసాగాను.

అదే నా ఆఖరి రోజు అని తెలిసిపోయింది. నాకు తెలియకుండానే నా కళ్ళవెంట కన్నీరు ధారగా కారిపోసాగింది. చెంపలమీంచి కారి పెదవులకి తగలగానే ఆత్రంగా చప్పరించాను.

వుప్పగా తగిలినా దాహంతో అల్లాడిపోతున్న నాకు అసహ్యంగా అనిపించలేదు.

అలా మంచంమీదే కూలబడ్డాను. కూర్చుంటే నిద్రకి ముందుకి వంగిపోతున్నాను.

ఆకలి మంట కడుపులో. గొంతు ఎండిపోయి భగభగ మని మండుతున్నది. ఇంక ఎంతోసేపు బ్రతక నేమోనని పించింది. జుత్తు పీక్కున్నాను. నా చేతిని కరిచేసుకొని రక్తంతో నా గొంతుని తడుపుకోవాలని అనిపిస్తోంది.

అన్నయ్యా నీ ఆత్మశాంతి చేకూర్చటానికి, నా ప్రతీకారాన్ని తీర్చుకోవాలని అనుకొన్నాను. కాని నాగభూషణం చేతుల్లో నా జీవితానికి సమాధి పేర్చబడింది. నేనూ నిన్ను చే......

ముందుకు వరగబోతున్న నా చెవులకి తాళం తీస్తున్న శబ్దం వినిపించింది.

అంతే! ఒక్కవుదుటన లేచి నిలబడ్డాను. అంతటి శక్తి నాకెలా వచ్చిందో అర్థం కావటంలేదు. తప్పించుకోవాలన్న తపన నన్ను తలుపుల దగ్గరకి నడిపించింది. తలుపుల వెనక్కి వెళ్ళి నిలబడ్డాను. వూపిరి బిగబట్టి అలా పొజిషన్‌లో నిలుచున్నాను.

తలుపులు తెరుచుకొన్నాయి. ఏదో ఆకారం లోపలికి వచ్చింది.

ఆ వచ్చినది ఎవరూ అని ఆలోచించలేదు నేను.

ఆ ఆకారాన్ని ముందుకు తోసి, బయట కెళ్ళి గడియ పెట్టేను.

నేను వున్న గదిలో ఎవరూ లేరు. తలుపులకి తాళం కప్పా, వుండకుండా వుండదని చుట్టూ చూసాను. టేబిల్ మీద తాళంకప్పలు కనిపించాయి. గదికి తాళం వేస్తూండగా—

"రాజా! తలుపులు తెరవు" అని ఏడుస్తూ అన్న నాగభూషణం గొంతు చిన్నగా విన్పించింది.

అంత నీరసంలోనూ పగలబడి నవ్వాను.

"మై డియర్ నాగభూషణం. ఎవరు తవ్వుకొన్న గోతులో వారు పడతారన్న సామెతకి అర్థం తెలియవచ్చిందనుకొంటాను. నేను అన్నంకోసం, నీళ్ళకోసం ఎంతలా తపించిపోయానో, నువ్వు అలాగే తపించిపోవాలి. నా అన్న భాస్కర్ ఎలా మరణించాడో నీవు అలాగే చావాలి. నా అన్నశవాన్ని బండిలో వేస్తుండగా చూసి ఎంతగా కుంగిపోయానో, నీ శవాన్ని చూసి అంతగా పొంగిపోవాలి."

ఈ మాటల్ని వైకే అని గదికి తాళంవేసి ఆ చెవిని నా జేబులో పడేసుకొని, మిగిలిన తాళం కప్పలతో ముందుకు నడిచాను. నా దగ్గరున్న తాళంకప్పల్ని రెండు గదులకి వేసి మరో గదిలోకి వచ్చాను.

ఆ గదిలో పాత సామానులు వున్నాయి. మరో గది లోకి వచ్చాను. అది నాగభూషణం గది. ముందుగా నా దృష్టి కూజామీద పడింది. ఒక్క పరుగున దాని దగ్గర వెళ్ళి దాన్ని ఎత్తుకొని ఆత్రంగా నీళ్ళని త్రాగేసాను.

షర్ట్ నిండా నీళ్ళు వలికిపోయాయి. కూజా క్రిందకి దించబోతుండగా చిన్న దగ్గులాంటిది వినిపించింది. కల వరంగా తలుపుల వంక చూసాను. దగ్గరగా వేసి వున్నాయి. బయట ఎవరో నిలిచివున్నారనిపించింది. ఒక వేళ నాగభూషణం నా శవాన్ని ఈడ్పించటానికి మను షుల్ని రప్పించలేదు కదా అని అనుకొన్నాను. తడిసిన షర్ట్ని విప్పి, తువ్వాలు భుజాల చుట్టూ కప్పుకొని, 'అయితే వాళ్ళని వెళ్ళిపొమ్మని చెప్పేస్తాను మామయ్యా' అని అంటూ తలుపులు దగ్గరగా తెరచాను.

నా వూహే నిజం. ఇద్దరు వ్యక్తులు నిలిచివున్నారు.

"చూడండి, లోపలున్న మనిషి ఇంకా చావలేదు" అన్నాను.

"బాబుగారూ."

నేను చిరాగ్గా ముఖాన్ని పెట్టాను. "రేపు మిమ్మల్ని తనే కలుస్తానన్నాడు వెళ్ళండి" అని అన్నాను.

వాళ్ళిద్దరూ ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకొని 'చిత్తం' అని వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళాక తలుపుల్ని వేసి, నేను వుషారుగా ఈల వేసుకుని, లోపలికెళ్ళి నా షర్ట్ వేసుకొని, పెరటి తలుపులు తెరచుకొని వెళ్ళిపోయాను.

# 10

హోటల్ మీద దాడి ప్రారంభించి, మస్తుగా తిని ఇంటికి వచ్చి జరిగిందంతా వ్రాసి, కవరులో పెట్టి పోస్ట్ చెయ్యడానికి వీధిలోకి వెళ్ళబోతుంటే రవి కనిపించాడు.

"రెండు రోజులై ఎటు పోయావు" అన్నాడు కోపంగా.

అంటే రవి వచ్చి రెండు రోజులే అయిందన్నమాట అనుకొన్నాను.

పనిమీద వూరు వెళ్ళానని, "మీ మామయ్య కెలా వుంది" అని ప్రశ్నించాను.

"ఇప్పుడు బాగానే వుంది" అని అన్నాడు.

ఇద్దరం క్లబ్ కి బయలుదేరాం. తోవలో రవి నానవలని గురించే మాట్లాడేడు.

క్లబ్ లో ఓగంట గడిపి సునీత ఇంటికి బయలుదేరాను. సునీత ఏమనుకొంటుందో నన్ను చూడగానే, అని

అనుకొంటూ ఆమె ఇంటికి వెళ్ళాను.

నేను వెళ్ళేసరికి హాల్లో ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర, పోలీస్‌లు కనిపించారు. వాళ్ళని చూడగానే నా గుండెలు దడ దడ లాడాయి. జారిపోతున్న గుండె ధైర్యాన్ని చిక్కబట్టుకొంటూ సునీతని చూశాను. అప్పుడే నన్ను చూసిన సునీత "రాజూ!" అని గట్టిగా అరచి నా దగ్గరకి పరిగెత్తి వచ్చి, "ఇన్నాళ్ళూ ఎటు వెళ్ళావు" అంది చిరుకోపంతో.

"మీ నాన్నగారు చెప్పలేదా?" ఆమెకే వినిపించేంత నెమ్మదిగా అడిగాను.

"నాన్నగారికి మాత్రం చెప్పావా? ఆ ఫ్రెండ్ ఎవరో వచ్చి ఏదో చెప్పగానే ఇప్పుడే వస్తా అని వెళ్ళిపోయావట. తిరిగి ఇపుడు వచ్చావు."

నాగభూషణం అలా చెప్పి వుంటాడు అని అనుకొంటూ "పోలీసు లెందుకొచ్చారు" ప్రశ్నించాను.

"నిన్న రాత్రి పడుకోవడానికి వెళ్ళిన నాన్నగారు కనిపించలేదు. అంతేకాక పెరటి తలుపులు తీసేసి వున్నాయి. ఏదో అనుమానం వచ్చి ఇనస్పెక్టర్ గార్ని రప్పించాను. ఆయనకి మా నాన్నగార్కి బాగా పరిచయంకూడా వుంది. అందుకే ఆయన్ని పిలిపించాను."

ఇంతలో ఇనస్పెక్టర్ మా దగ్గరగా వచ్చాడు.

"ఇనస్పెక్టర్ ఈయన నా కాబోయే భర్త" అంది సునీత.

ఇనస్పెక్టర్ నా చేతిని అందుకొని కరచాలనం చేసి, "మీ ఇంటి పేరు?" అని అడిగాడు.

"యస్."

"ఐసీ." అని తల పంకించి, "మీతో కొన్ని విష యాలు మాట్లాడాలి" అన్నాడు.

"మీరు మాట్లాడుతుండండి కాఫీ తెస్తాను" అని సునీత లోపలికి వెళ్ళిపోయింది.

"రాజశేఖరంగారూ! మీ పెళ్ళికి అంగీకరించే ముందు మీకూ, నాగభూషణంగారికీ చిన్న తగవు అయిందని వీరన్న ద్వార తెలిసింది నిజమేనా?"

"ఆ తరువాత ఏమయిందో వీరన్న చెప్పలేదా?" దాచుకుందామన్నా నాలో వ్యంగ్యం దాగలేదు.

ఇనస్పెక్టర్ నా ముఖంలోకి చూసి, "అంతవరకే చూసానని, నాగభూషణంగారు వెళ్ళి పొమ్మని సైగ చేస్తే వెళ్ళిపోయానని చెప్పాడు. మిగిలింది మీరు చెప్పండి."

నేను ఇబ్బందిగా చూసాను.

"చెప్పటానికి ఏముంది. మేము రిజిష్టర్ మారేజ్ చేసుకుంటామని అనగానే కూతురిమీద అభిమానంతో తనే పెళ్ళి చేస్తానన్నారు. ఆ తరువాత కొంతసేపు మాట్లాడి వెళ్ళిపోయాను."

"సునీత మీరు ఎటు వెళ్ళారని అడిగింది. ఆమెకి చెప్పకుండా ఎటు వెళ్ళారు?"

"ఓ ఫ్రెండ్ ప్రమాద స్థితిలో వున్నానని టెలిగ్రాం ఇస్తే అతన్ని చూడటానికి వెళ్ళాను."

అంతలో సునీత కాఫీలు తెచ్చి అందరికీ ఇచ్చింది.

ఇనస్పెక్టర్ కాఫీ తాగేసి నా రూమ్ ఎడ్రస్ తీసుకొని వెళ్ళిపోయాడు.

వీరన్న బయట కూర్చున్నాడు.

"రాజూ! భోంచేద్దాం రా" సునీత మాటలకి సరే నన్నట్లు తల వూపాను.

భోజనం అయ్యాక సునీత, నాతో కబుర్లు పెట్టుకొంది. సునీత నన్ను అక్కడే వుంచేసింది.

ఆ మర్నాడు వుదయాన్నే లేవగానే వీరన్నకి బదులు కొత్త నౌకరు కనిపించాడు.

టిఫిన్ తీసుకొంటున్నప్పుడు ఆ కొత్త నౌకర్ గురించి సునీతని అడిగాను.

అతను వీరన్న కొడుకట. వీరన్న ఏదో వూరు వెళ్ళాడట. కొడుకుని పనిలోకి పంపాడని చెప్పింది. నేను టిఫిన్ తినేసి వీధిలోకి వెళ్ళిపోయాను. రవితో కొంతసేపు గడిపి, నా రూమ్‌కి వెళ్ళి సగం చదువుతూ వదిలేసిన నా నవల, పూర్తిగా చదవాలని ఆ బుక్ తీసుకొని సునీత ఇంటికెళ్ళాను.

సునీత ఇంటికి వస్తూండగా సందు మొదట్లో కాని స్టేబుల్ కనిపించాడు. నన్ను చూసి చిరునవ్వు విసిరితే ప్రతిగా నేనూ ఒక చిరునవ్వు పారేశాను.

నేను వెళ్ళగానే నన్ను చూసి సునీత టెలిఫోన్ చేసి "ఇనస్పెక్టర్! రాజు వచ్చాడు" అని అంది.

"సునీతా! ఎందుకలా ఫోన్ చేశావు" తీవ్ర స్వరాన ప్రశ్నించాను.

"రాజూ! నువ్వు రాగానే ఇనస్పెక్టర్ గారు ఫోన్ చెయ్యమన్నారు ఎందుకో? నువ్వు వచ్చావని చెప్పటం నా విధి కదా" అంది.

ఆమె మాటలతో నాలో కలవరం చెలరేగింది.

ఎందుకు ఇనస్పెక్టర్ నేను వస్తే ఫోన్ చెయ్య

మన్నాడు? నన్ను అనుమానిస్తున్నాడా?

నేను పేరుకి బుక్ పట్టుకొన్నానే కాని ఆలోచనా ప్రవంతిలో కొట్టుమిట్టాడుతున్నాను.

అలా ఎంతసేపు కూర్చున్నానో తెలియదు కాని, "హలో" అన్న ఇనస్పెక్టర్ గొంతు విని ఆలోచనలని ఆపుచేసి ఆయన్ని చూసాను.

సునీత కాఫీ తెస్తానని లోపలికి వెళ్ళిపోయింది.

ఇనస్పెక్టర్ నా ఎదురుగా కూర్చొని నాచేతిలో బుక్ అడిగి తీసుకొని తిరగవెయ్యసాగాడు.

"ఇది మీరు వ్రాసింది కదూ? మీ రచనలని విడవకుండా చదువుతాను" అని అన్నాడు.

అవును అని ఒప్పుకోక తప్పిందికాదు. కారణం ఒక్కొక్కసారి కథలతో పాటుగా నా ఫోటోకూడా పడుతుంది.

ఆ తరువాత ఆ బుక్ అటూ, ఇటూ, తిరగేసి సునీత కాఫీ తెస్తే తాగేసి లేచి నిలబడ్డాడు.

"మా నాన్న గురించి ఏమైనా తెలిసిందా?" సునీత రుద్ధపోయిన కంఠంతో అడిగింది.

"ఒకటి, రెండు రోజుల్లో మీ నాన్నగారి జాడ తెలియవచ్చు" అన్నాడు ఇనస్పెక్టర్ బయటికి వెళుతూ.

# 11

హాల్లోనే సోఫాలో పడుకొని పుస్తకం చదువుకొంటున్నాను. అలా చదువుతూ, చదువుతూ నిద్రపోతున్నట్లు నిద్రని నటించాను.

సునీత నా దగ్గరికి రావటం "రాజూ! రాజూ!" అని పిలిచి నేను పలకకపోవటంతో ఆమె తిరిగి వెళ్ళిపోవటం అంతా గమనిస్తున్నాను.

వీరన్న కొడుకు హాల్లోనే కూర్చొని ఏవో పదాలు పాడుకొంటున్నాడు.

తొమ్మిదింపావు వరకూ వాడి ఘోర గొంతుకని అసహనంగా వింటూ గడిపాను.

ఆ తరువాత పాట ఆగిపోయింది. అంటే వాడు నిద్ర పోయివుంటాడు. నిద్ర పోయే ముందే అలా పాడుకొంటాడు వాడు. అది ఈ వారం రోజుల్లో గ్రహించాను.

మరో అరగంట అలాగే అదే స్థితిలో వుండి ఆ తరవాత లేచాను.

వీరన్న కొడుకు గుర్రు కొడ్తున్నాడు. నా జేబులోంచి రుమాలు తీసి వాడి ముక్కు దగ్గరుంచాను. తెల్లవారే వరకూ ఏనుగులు తొక్కినా లేవడు వాడు.

బయటకెళ్ళి వరండాలో నిలుచున్నాను. సరిగ్గా పది గంటలు దగ్గరవుతుండగా ఇద్దరు మనుషులు వచ్చారు.

ఆ ఇద్దర్నీ వెంటబెట్టుకుని నాగభూషణం బంధింపబడ్డ గది దగ్గర వెళ్ళాను.

తలుపుల్ని తెరచి టార్చిలైట్ వేసాను. ఆ వెలుగులో నాగభూషణం శవాన్ని చూసి క్షణంపాటు బిర్ర బిగుసుకుపోయింది నా శరీరం.

చాలా భయంకరంగా వున్నాడు. అతను పోయి ఎంతసేపయిందో గాని చిన్నగా దుర్గంధం కొడుతున్నది శవం. అలా శవాన్ని చూస్తున్న నా పెదవులపై తృప్తికరమైన చిరునవ్వు విరిసింది.

నాగభూషణం శవాన్ని తిలకిస్తుంటే నా గుండె మంటలు చప్పున చల్లారిపోయాయి. అన్నయ్య ఆత్మకి శాంతిని చేకూర్చాననిపించింది.

ఆ మనుషులతో శవాన్ని బయటికి తీసుకెళ్ళమని చెప్పాను.

వాళ్ళిద్దరూ శవాన్ని నల్లటి గుడ్డలో కట్టారు. ఒకడు ఆ మూటని భుజానికి ఎత్తుకున్నాడు.

ముగ్గురం హాల్లోకి వచ్చాం. మేము హాల్లో వచ్చేసరికి ఒక్కసారి హాలంతా వెలుగులతో నిండిపోయింది.

ఆ వెలుగులో ఇనస్పెక్టర్, వీరన్న కొడుకు, సునీతా తదితరులు కనిపించారు.

వాళ్ళందర్నీ చూస్తూ అలాగే నిలిచిపోయాను.

"రాజూ! ఏమిటి ఇదంతా?" సునీత గొంతు పూడుకుపోయింది.

ఇనస్పెక్టర్ నా దగ్గరగా వచ్చి, నా ప్రక్కనున్న మనుషుల్ని మూట దించమని చెప్పి, వాళ్ళచేతే మూట విప్పించాడు.

ఆ మూట విప్పగానే తండ్రి శవాన్ని చూసి సునీత, "నాన్నా" అంటూ గుండెలపై పడి రోదించసాగింది.

"మిస్టర్ రాజశేఖరం! మీ రచనలంటే చెవి కోసుకొనే వారిలో నేనూ ఒకడిని. మొట్టమొదట మిమ్మల్ని చూడగానే మీ 'నేరం నాదికాదు' అన్న నవల గుర్తొచ్చింది. అందులో పాత్రలు సజీవమైనవే అన్న అనుమానం, సునీత, భాస్కర్‌ని ప్రేమించానని చెప్పడంతో నిజమనిపించింది.

భాస్కర్ మీ అన్నయ్యా కాదో, అవునో తెలుసుకోవాలనే వుద్దేశ్యంతో మీ రూమ్‌లో భాస్కర్ ఫోటోని దొంగలించి, సునీతకి చూపించాను. తను ప్రేమించిన భాస్కర్ అతడేనని చెప్పింది. వీరన్న

కొడుకుగా నటిస్తున్నది మా ఏజెంట్. మీరు అతనికి తెలివి తప్పించటానికి ప్రయత్నిస్తే తెలివి తప్పినట్లు నటించి, నాకు ఫోన్ చేసాడు.

అంతేకాదు, ఎడిటర్ దగ్గరకెళ్ళి మీ నవల పూర్తిగా చదివాను. నిజం అంతా తెలిసినా నాగభూషణాన్ని మీరు తీసుకొస్తుండగా బంధించాలని ఇంతవరకూ ఆగాను. మీరే ఆ నవల వ్రాయకపోతే మిమ్మల్ని పట్టటం చాలా కష్టం. అన్ని డిటెక్టివ్ రచనలని చేసిన మీరు-మీ యధార్థగాధే మిమ్మల్ని పట్టి ఇస్తుందని తెలుసుకోలేక పోయారు. మీ నవలే మిమ్మల్ని పట్టి ఇచ్చింది.''

ఇనస్పెక్టర్ గర్వంగా అంటూంటే విషాదంగా నవ్వుకొన్నాను.

నేను దొరికిపోతాననే భయం నాకేనాడూ లేకపోబట్టి యదార్థ నవల రచించానని ఇనస్పెక్టర్‌కి తెలియదు కాబోలు అనుకొంటూ నా చేతుల్ని ముందుకు చాచాను.

నా చేతికి సంకెళ్ళు వేసి తీసుకెళుండగా 'రాజా! నాన్నగారూ లేక, నువ్వూ లేక, ఒంటిగా నేను ఎలా బ్రతికేది' అని విలపిస్తున్న సునీత కంఠం, నా చెవుల్లో గింగురుమనసాగింది.

—: ఐపోయింది :—

# వేషగాళ్ళు-మోసగాళ్ళు!!

## టెంపోరావ్

విశాలమైన ముందు హాల్లోని సోఫాలో కూర్చొని గోవిందరావు దినపత్రికను చదువుతున్నాడు. టిఫిన్ తిని, కాఫీతాగి దినపత్రికను పూర్తిగా చదవడం అతడి కలవాటు.

అతడి పక్కనుంచి ఎవరో గబగబా వెళ్తున్నారు.

పేపర్ పైనుంచి అతడు చూశాడు. అతడి కొడుకు రమేష్ టెన్నిస్ ఆడ్డానికి వెళ్తున్నాడు!

పద్దెనిమి దేళ్ళ యువకుడు. పచ్చగా, పొడుగ్గా తండ్రి పోలికలో వున్నాడు. హాఫ్ పాంట్ స్పోర్ట్స్ బనియన్, వైట్ కాన్వాస్ షూస్! మెళ్లో ఒంటిపేట బంగారం గొలుసు, చేతికి ఖరీదైన డే అండ్ డేట్ సెట్ వాచ్!

ఒక్కగానొక్క కొడుకు! కొడుక్కి ఏం కావలసినా అతను యిస్తూనే వుంటాడు!

అతను మళ్ళా పేపరు చదవడంలో నిమగ్నుడయ్యాడు. కారు దూసుకు పోతున్న చప్పుడు అతడికి వినపడింది. కార్లు నడపడమంటే రమేష్‌కి పిచ్చి ఎక్కువ!

పేజీలు తిప్పి గోవిందరావు వార్తలను చదువుతున్నాడు.

నిమిషాలు దొర్లిపోతున్నాయి. టైమ్ ఎనిమిది దాటింది.

గుమ్మం బయటనుంచి బూట్ల చప్పుడు వినపడింది.

"ఎవరు? కమిన్!" అన్నాడతను.

పోలీస్ సార్జంటులా వున్నాడతను. లోపల కొచ్చి ఎదురుగా నిలబడ్డాడు. అతడికి వినయంగా దణ్ణం పెట్టాడు.

"మీ పేరు విన్నాను సార్! మీ అబ్బాయి రమేష్‌కి యాక్సిడెంట్ అయింది," అన్నాడతను.

పేపర్ని టీపాయిమీద పడేసి గోవిందరావు గాభరాగా సార్జంటు వంక చూశాడు.

"ఏమైంది? రమేష్‌కి దెబ్బలు తగిలేయా?"

"ఆయన క్షేమంగానే వున్నారు. సార్, ఆయన కారు కింద ఒక కుర్రాడు పడ్డాడు. ఆ కుర్రాడిని హాస్పిటల్లో చేర్పించారు. అతడు బతక్కపోవచ్చు!"

"మా అబ్బాయి ఎక్కడున్నాడు?"

"పోలీస్ లాకప్‌లో?"

గోవిందరావు అతడివైపు సూటిగా చూశాడు.

"నువ్విక్కడకి ఎందుకొచ్చావు?"

"పోలీసులు ఏదేనా చేసేలోపల తనని రక్షించమని రమేష్ మీతో చెప్పమన్నాడు!"

"నేను మాత్రం ఏం చెయ్యగలను? ఒళ్ళు తెలియనట్లు వాడు కారును పోనిస్తాడు! రాస్కెల్!"

కొడుకుమీద తనలో తలెత్తిన ఆగ్రహాన్ని అతడు ఆపుకోలేకపోయాడు. సార్జంట్ వెనక్కి తిరిగాడు.

"మిస్టర్, మీ సలహా ఏమిటి?" అడిగాడు గోవిందరావు.

"మీరు వెంటనే ఇన్స్పెక్టర్ చంద్రన్ గారితో మాట్లాడండి. ఆయన ఇంట్లో వుంటారు! ఆయన తల్చుకుంటే ఏదేనా చెయ్యగలరు!" అన్నాడతను.

"నీ పేరు?"

"సెల్వరాజు, సార్."

గోవిందరావు లోపల కెళ్ళాడు, ప్లాస్టిక్ బాగ్ తో హాల్లో కొచ్చాడు.

"పద, వెళ్దాం," అన్నాడతను.

గేటు ప్రాంతంలో ఆపిన మోటర్ బైక్ మీద వెళ్తున్న సెల్వరాజు వెనుక డాడ్జి కారును డ్రయివర్ పోనిస్తున్నాడు.

గోవిందరావు మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి రమేష్ కి లెర్నర్స్ లైసెన్స్ మాత్రం వుంది. ఇది పెద్ద కేసుగా రూపొందుతుంది. మొదట్లోనే తను జాగ్రత్త పడాలి!

మోటర్ బైక్ ఒక కాంపౌండులోకి వెళ్ళి ఆగింది. వెనకనే డాడ్జి కారు ఆగింది. సెల్వరాజు ముందుహాల్లో

కెళ్ళి వెనక్కి తిరిగొచ్చి, "రండి!" అన్నాడు.

గోవిందరావు హాల్లో కెళ్ళాడు. సోఫాలో కూర్చున్న తడికి నమస్కరించాడు.

గోవిందరావు అతడివైపు చూశాడు. సెల్వరాజు బయటకు వెళ్ళిపోయాడు. సోఫాలో వున్నతను లుంగీ, బనియన్‌తో వున్నాడు.

"సార్జంట్ అంతా చెప్పాడు. మీ అబ్బాయికి లైసెన్స్ లేదట!" అన్నాడతను.

"లెర్నర్స్ లైసెన్స్‌వుంది! నాకు మీరు సహాయ పడాలి!" అన్నాడు గోవిందరావు.

"అనేకమందికి లంచాలివ్వాలి. కనీసం యిరవై వేలవుతుంది!"

బాగ్‌లోంచి రెండు కట్టలుతీసి గోవిందరావు అతడి కిచ్చాడు.

"ఇరవై వేలు! ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో మీరే ఆలోచించండి! మా అబ్బాయిని వదిలేయాలి! ఈ కేసు కోర్టు కెళ్ళకుండా చూడాలి!"

"ఆల్‌రైట్ చూస్తాను. బెంగ లేకుండా యింటి కెళ్ళండి!" అన్నాడతను.

అతడు సార్జంటును పిల్చాడు. లోపలకు పరుగెత్తు కొచ్చాడు సెల్వరాజ్.

"సార్జంట్, ఈ కేసును గురించి నే నొచ్చినదాకా ఏమీ రాయొద్దని చెప్పా. నేను పదిహేను నిమిషాల్లో స్టేషన్‌కి వస్తాను" అని సోఫాలోంచి లేచాడతను.

సెల్వరాజ్ శెల్యూట్ చేసి వెళ్ళి పోయాడు. గోవింద రావు నమస్కరించి బయటకు నడిచాడు. కారు

ప్రాంతంలోవున్న సార్జంట్‌కి గోవిందరావు ఐదువంద లిచ్చాడు. అతడు కూర్చోగానే డ్రయివర్ కారును పోనిచ్చాడు.

## 2

పది కావస్తోంది. గోవిందరావు ముందు హాల్లోనే కూర్చున్నాడు. భార్య హాల్లో కొచ్చినా ఆమెతో జరిగిందేదీ అతడు చెప్పలేదు. ఆడవాళ్ళు ఏడ్వడం ప్రారంభిస్తారు!

బర్రున కారొచ్చి బయట ఆగింది. టెన్నిస్ రాకెట్ పట్టుకుని వుషారుగా రమేష్‌లోపల కొచ్చాడు. తండ్రి ముందు ఆగకుండా లోపలకు వెళ్తున్నాడతను.

అతడు కోపంగా కొడుకుకేసి చూశాడు.

"ఒరేయ్ రమేష్, యిప్పుడు బుద్ధి వచ్చిందా?" అర్చాడతను.

"ఏమిటి డాడీ మీ రనేది?" అడిగాడతను.

"అంతా నీకు తెల్సిందేగా! నేను నలువైపులా డబ్బు విసిరి లాకప్‌నుంచి నిన్ను విడుదల చేయించేనురా! థాంక్సైనా చెప్పకుండా లోపలకు మార్తున్నావు!"

"లాకప్ ఏమిటి డాడీ?"

రమేష్ ముఖంలో ఆశ్చర్యం గోచరిస్తోంది. తండ్రి అతడివైపు సూటిగా చూశాడు.

"ఎవడో స్కూలు పిల్లాడు నీ కారుకింద పడ్డాడుటగా?" అన్నాడు గోవిందరావు.

"ఇదంతా ఫన్నీగా వుంది, డాడీ. నేను టెన్నిస్ ఆడి తిన్నగా యిక్కడకొస్తున్నాను. ఎవ్వరూ నా కారుకింద పడలేదు! ఎవరో మీతో అబద్ధాలు చెప్పి

వుంటారు!'' అన్నాడు కొడుకు.

రమేష్‌ని వెళ్ళమని గోవిందరావు ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. ఏదో ఆలోచన తట్టి అతడు బయటకు నడిచాడు. కారులో కూర్చుని తలుపు మూశాడు.

"ఇందాకా వెళ్ళిన యింటికి పద!'' అన్నాడతను.

కారును డ్రయివర్ స్పీడుగా పోనిచ్చాడు. మెయిన్ గేటు మూసివుంది. గేటు సమీపంలో వున్న బోర్డు వంక గోవిందరావు చూశాడు. "వై. సి. విన్‌సెంట్, డైరెక్టర్, మలబార్ టీ ఎస్టేట్స్ లిమిటెడ్,'' అని బోర్డు మీదుగా వ్రాసి వుంది.

'ఈ యింట్లో పోలీస్ యిన్‌స్పెక్టర్ చంద్రన్ ఎందుకు వున్నాడు' అనుకున్నాడు గోవిందరావు తనలో తాను.

"గేటు తెరిచి కారును లోపలకు పోనీ!'' అన్నాడు డ్రయివర్‌తో.

డ్రయివర్ దిగి గేటు తెరిచాడు. కారును లోపలకు పోనిచ్చి ఆపాడు. బయటకు దిగి గోవిందరావు కాంపౌండ్ నలువైపులా చూశాడు. ఇంత పెద్ద భవనంలో పోలీస్ యిన్‌స్పెక్టర్ వుండడు లేడు! తన కొడుకు మీదుండే ఆప్యాయత అతడిని గుడ్డివాడిని చేసింది!

గోవిందరావు ముందు గుమ్మం దగ్గరకు వెళ్ళాడు. పెద్ద తాళం కప్ప అతనికి కనిపించింది! కాన్‌ఫిడెన్స్ ట్రిక్‌స్టర్స్! వాళ్ళిద్దరూ తనను మోసంచేసి ఇరవై వేల అయిదువందలు తీసుకున్నారు!

గోవిందరావు ఒళ్ళు మండులోంది. అతడు వెనక్కి తిరిగి గబగబా వెళ్ళి కారులో కూర్చుని తలుపుమూశాడు.

"హోటల్ అశోకాకి పద!'' అన్నాడతను.

# 3

పడక్కుర్చీలో వెనక్కి బోర్లాబడి డిటెక్టివ్ వాలి కూర్చున్నాడు. చుట్ట పొగ గాలిలో పైకిలేస్తోంది. అసిస్టెంట్ గిరి ఏదో చెప్తున్నాడు. వాలి మౌనంగా వింటున్నాడు.

గుమ్మంలో నిలబడిన వ్యక్తివైపు వాలి సూటిగా చూశాడు. గోవిందరావు! పంచ, పొడగాటి కోటుతో వున్నాడతను. పొట్టిగా కత్తిరించిన క్రాపు, కాళ్ళకు స్లిప్పర్లు వున్నాయి.

"అబ్బాయి, లోపలకు రా!" అన్నాడు వాలి.

గోవిందరావు లోపలకొచ్చి ఎదురుగావున్న సోఫాలో కూర్చున్నాడు.

"వాలిగారూ, ఇటువంటి మోసం యీ పట్నంలో జరగడం యిదే మొదటిసారేమో!" అన్నాడు గోవిందరావు.

"నీకు మొదటిసారి కావచ్చు! ఏం జరిగింది?" అన్నాడు వాలి.

జరిగినదంతా అతను వాలికి వివరంగా చెప్పాడు.

"గోవిందరావు భాయ్, నువ్వు ధనవంతుడవని వాళ్ళకు తెలుసు. ఒక్కగానొక్క కొడుకుమీద నీకు మమకారం ఎక్కువని వాళ్ళు తెల్సుకున్నారు. నీలో భయం సృష్టించారు వాళ్ళు. కొడుకు జైలుపాలవుతాడేమో అని నువ్వు హడలిపోయావు. నీ బుర్ర ఆలోచించడం మానేసింది. వాళ్ళు ఎంతడిగినా యిచ్చి కొడుకును రక్షించాలి! ఒకే ఆలోచన నీ బుర్రలో నిల్చిపోయింది. దానితో సులభంగా మోసపోయావు!

యాక్సిడెంట్ ఎక్కడైందో, ఇన్‌స్పెక్టర్ చంద్రన్

ఏ పోలీస్ స్టేషన్‌కు చెందినవాడో నువ్వు అడగలేదు! నీ కొడుక్కి లెర్నర్స్ లైసెన్స్ వుందని వాళ్ళు కనుక్కున్నారు! నీగురించి కొన్ని విషయాలు తెల్సుకొని వాళ్ళు రంగంలోకి దిగారు,'' అన్నాడు వాలి.

''మీరు చెప్పింది నిజమే, వాలిగారూ. ఆ సమయంలో నా బుర్ర క్రమబద్ధంగా ఆలోచించలేదు.''

వాలి నవ్వుతూ గిరివైపు చూశాడు.

''గిరీ, మలబార్ టీ ఎస్టేట్స్ లిమిటెడ్ ఆఫీసు నంబరు చూసి ఫోన్ చేసి మాట్లాడు. వై.సి. విన్‌సెంట్ గురించి కనుక్కో!'' అన్నాడు వాలి.

చుట్ట పొగ వదుల్తూ వాలి ఆలోచిస్తున్నాడు.

గిరి ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. తనలాటి పారిశ్రామికవేత్తని అంత సునాయాసంగా మోసగించిన వాళ్ళిద్దర్నీ తొందరగా బంధించి జైల్లో పడేయించాలని గోవిందరావు తాపత్రయపడుతున్నాడు.

''వాలిగారూ, వై. వి. విన్‌సెంట్ రెండు నెలల సెలవుమీద కాశ్మీర్ వెళ్ళారు, సకుటుంబంగా! ఇక్కడున్న అతడి యింటికి వాచ్‌మన్ కాపలాగా వుంటాడని చెప్పారు,'' అన్నాడు గిరి ఫోన్ పెట్టేస్తూ.

వాలి నవ్వుతూ గోవిందరావువైపు చూశాడు.

''అతడు యిన్‌స్పెక్టర్‌గా నటిస్తూ నీతో ముందు హాల్లో మాట్లాడుతున్నప్పుడు వాచ్‌మన్ మహావీర్ ఏమయ్యాడు?'' అన్నాడు వాలి.

''అతడికి ఏదో వాటా వుండొచ్చు, సార్,''అన్నాడు గోవిందరావు.

వాలి కుర్చీలోంచి లేచాడు.

"నిన్ను మోసగించినట్లే వాళ్ళు అతడిని కూడా మోస గించి వుండొచ్చు," అన్నాడు వాలి.

గోవిందరావు అడ్రెసునూ, టెలిఫోన్ నంబర్లనూ గీసి రాసుకున్నాడు. గోవిందరావు సెలవు తీసుకొని వెళ్ళి పోయాడు.

# 4

సూర్యకాంతిలో XYZ కారు తళతళ మెరుస్తోంది. వాలి ముందు సీటుమీద కూర్చున్నాడు.

కారు విన్ సెంట్ భవనం ముందు ఆగింది. గేటు మూసి వుంది.

వాలి కిందకు దిగాడు. ఇనప వూచల గేటును లోప లకు తోసి పెద్ద అంగల్లో భవనంవైపు నడవసాగాడు.

చుట్టూ ఎత్తయిన ప్రహరీ గోడ వుంది. నౌఖర్లు వుండే క్వార్టర్స్‌లోనుంచి ఒకతను వాలివైపు పరుగెత్తు కొచ్చాడు. ఖాకీ దుస్తుల్లో వున్నాడతను. అతడు వాలికి వినయంగా నమస్కరించాడు.

నవ్వుతూ వాలి అతడివైపు చూశాడు.

"మహావీర్ నువ్వేనా?" అడిగాడు వాలి.

"నేనే, సార్."

"పొద్దుట ఎనిమిది, తొమ్మిది మధ్య నువ్వు ఎక్క డున్నావు?"

"నేను యిక్కడికొచ్చి పావుగంట అయింది, సార్. పొద్దుటే ఫోన్ కాల్ వచ్చింది. నా భార్యకి పురు డొచ్చిందని చెప్పారు. వెంటనే విల్లివాకం వెళ్ళాను. దొంగనాకొడుకు అబద్ధం చెప్పాడు!" అన్నాడతను.

"ఇంటి తాళం చెవులు నీదగ్గరున్నాయా?"

"లేవు సార్."

"ఫోన్ ఎక్కడుంది?"

"ముందు హాల్లోని కిటికీలో ఫోన్ని వుంచారు. ఇటు వైపునుంచి రిసీవర్ తీసుకొని మాట్లాడొచ్చు," అన్నాడు మహావీర్.

ఇంటిముందుకు వెళ్ళాడు వాలి. వరండామీదకు నడిచాడు. కిటికీలోవున్న ఫోన్ అతడికి కనపడింది. విన్సెంట్ కాశ్మీర్‌లో వున్నాడనీ, విల్లివాకంలో గర్భవతి అయిన మహావీర్ భార్య వుందనీ వాళ్ళు తెల్సుకున్నారు.

గోవిందరావును మోసగించడానికి విన్సెంట్ భవనాన్ని పావుగంటపాటు వాళ్ళు వుపయోగించారు! ఇదంతా ఆలోచిస్తూ వాలి ముంగుగుమ్మం దగ్గరకు వెళ్ళాడు. స్కెలిటన్ కీలో ఆ తాళాన్ని సులువుగా తెరవొచ్చు!

పక్కనే నిలబడిన గిరికేదో ఆంగ్లంలో చెప్పాడు వాలి. వాచ్‌మన్‌ని ఏదో అడుగుతూ గిరి అతడిని దూరంగా తీసుకుపోయాడు. వాచ్‌మన్ని ప్రశ్నిస్తూ గిరి భవనం వెనుకవైపు దారితీశాడు.

స్కెలిటన్ కీతో వాలి తాళాన్ని తెరిచి లోపలకు వెళ్ళాడు. ఫోన్ తిరుగుతోంది. గోవిందరావు పోగానే వాళ్ళిద్దరూ తొందరగా మోటర్‌బైక్ మీద వెళ్ళిపోయి వుండొచ్చు. ఆన్ చేసిన ఫోన్ని ఆఫ్ చేయడం కూడా వాళ్ళు మర్చిపోయారు!

టీపాయిమీద యాష్ట్రే వుంది. దాన్ని పరీక్షించాడు వాలి. దానిలో రెండు సిగరెట్ పీకలున్నాయి. చార్మి

నార్ సిగరెట్ పీకలు! ఇన్స్పెక్టర్ చంద్రంగా నటించి నతను వాటిని కాల్చివుండాలి! సార్జంట్ సెల్వరాజులా నటించేవాడి రాకకోసం ఎదురుచూస్తూ నకిలీ యిన్స్పెక్టర్ సోఫాలో కూర్చుని వుండాలి!

సోఫాల అడుగున అన్నివైపులా చూశాడు వాలి. తనకు వుపయోగపడేదేమీ వాళ్ళువదల్లేదు! బయటకొచ్చి వాలి మళ్ళీ తలుపు మూసి తాళం వేశాడు.

వాచ్‌మన్ మహావీర్, గిరి ప్రత్యక్షమయ్యారు. వాలి చుట్ట పీలుస్తూ మళ్ళా మహావీర్ వంక చూశాడు.

"నీకోసం స్నేహితులు యిక్కడకు వస్తూంటారా?" అడిగాడు వాలి.

"ఎక్కువమంది రారు, సార్. వాడుమాత్రం వస్తూంటాడు, లింగరాజు!"

"నీ భార్య పుట్టింటికెళ్ళిందని అతడికి తెలుసా?"

"వాడికన్నీ తెలుసు సార్."

"అతడిల్లెక్కడ?" అడిగాడతను.

"మీరు వెళ్ళలేరు సార్. పొరంబోకు స్థలంలో గుడిసేసుకుని వుంటున్నాడు."

"అక్కడకు మమ్మల్ని తీసుకెళ్ళు. కారులోకూర్చో," అన్నాడు వాలి.

"ఏదేనా దొంగతనం జరిగిందా సార్?" అడిగాడు మహావీర్ గాభరాగా.

అతడివంక సూటిగా చూశాడు వాలి.

"లింగరాజుకి దొంగతనం చేసే అలవాటుందా?" బులెట్‌లా వెలువడింది వాలి ప్రశ్న.

"వాడు మంచివాడు సార్. స్నేహితులకు సిగరెట్లూ అవీ యిస్తూంటాడు."

ముందు సీటుమీద కూర్చుని వాలీ తలుపు మూశాడు. మహావీర్‌ని కారులో ఎక్కించి, గిరి తన సీటుమీదకు జరిగాడు. కారును పోనిచ్చాడు.

చెరువు ఒడ్డున లైనులో ఎన్నో గుడిసెలు వున్నాయి. ఒక గుడిసె ముందు గిరి కారును ఆపాడు. మహావీర్ దిగి లోపలకు వెళ్ళాడు. పొట్టిగా సన్నగా వున్న మరొకడితో అతను తిరిగివచ్చాడు.

వాలి అతడివైపు చూశాడు. లింగరాజు కళ్లు ఎర్రగా వున్నాయి. రమ్ వాసన బయటకు కొడ్తోంది.

"దండాలయ్యా!" అన్నాడు లింగరాజు.

కార్లోంచి దిగాడు వాలి. అతడిముందు నిలబడిన లింగరాజు లిల్లీపుట్‌లా వున్నాడు.

"బాగా రమ్ సేవిస్తున్నట్లున్నావు!" అన్నాడు వాలి.

"నా జీవితం అంతేనయ్యా! బాటిలుంటే గాని నా బుర్ర పనిచేయదు!"

"మహావీర్ పెళ్ళాం పురుడు పోసుకోడానికి విల్లివాకం వెళ్ళిందని నువ్వెవరికి చెప్పావు? ఆలోచించి జవాబియ్యి! ఒక రమ్ బాటిలు నీకొస్తుంది!" అన్నాడు వాలి.

"ఆ మోటర్ సైకిలాడికి చెప్పానయ్యా!"

"ఎవరతను?"

"ఆడిపేరు రామలింగం. వాడి ప్రశ్నలకు సరైన జవాబులిస్తే రెండు రమ్‌బాటిల్సు యిస్తానన్నాడు. విన్‌సెంట్ కాశ్మీర్‌లో వున్నారని చెప్పాను," లింగరాజు జవాబిచ్చాడు.

"అతడెక్కడుంటాడు?"

"తెలియదయ్యా. ఇక్కడికొచ్చాడు. అంతా తెల్సుకుని రమ్ బాటిల్సుకు డబ్బిచ్చాడు!" అన్నాడతను.

"అతడు మళ్ళా వస్తాడేమో!" అన్నాడు వాలి.

"ఏమో, సార్!"

"వస్తే అతడిని రహస్యంగా వెంటాడు. అతడి యిల్లు ఎక్కడో కనుక్కో! నీకు వందరూపాయిలిస్తాను."

"తప్పక వెంటాడుతాను, సార్."

గిరివైపు వాలి చూపించాడు.

"ఇతను యిక్కడికొస్తాడు. ఏమైనా తెలిస్తే అతడికి చెప్పు!"

"అలాగే, సార్."

జేబులోంచి యిరవైఐదు రూపాయిలు తీసి వాలి అతడికిచ్చాడు.

"నేను తర్వాత యింటికెళ్తానయ్యా," అన్నాడు మహావీర్.

గిరి కారును పోనిచ్చాడు.

వాళ్ళిద్దర్కీ ఒక మోటర్ బైక్ వుంది. అంతా తెల్సుకుని వాళ్ళు మోసం చేస్తున్నారు! ప్రస్తుతం యిద్దరు కలిసే యిదంతా చేస్తున్నారని అనుకోవాలి! వాలి మెదడులో ఆలోచనలు చేపల్లా గెంతుతున్నాయి!

# 5

వరండా మీద నిలబడి ఉష తన భర్తకు బై బై చెప్పింది. స్కూటర్ మీద కూర్చుని, ఆమె వైపు నవ్వుతూ చూస్తూ, అతడు ముందుకు కదిలాడు. స్కూటర్ గేట్లోంచి బయటకు దూసుకు పోయింది.

వీధి తలుపుమూసి ఆమె పడగ్గదిలోకి వెళ్ళింది. దిన పత్రికను చూస్తూ పరుపుమీద వెల్లకిలా పడుకుంది.

భర్తతో ఆమె టిఫిన్ తింది. అతడికి భోజనాన్ని కేరియార్‌లో పెట్టి యిచ్చింది. సాయిత్రం ఆరింటికి రామ్‌గోపాల్ వస్తాడు. అంతవరకూ తను ఒంటరిగా కాలం గడపాలి!

రామ్‌గోపాల్, తనూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. పెళ్ళయినాక ఆమె బొంబేనుంచి మద్రాస్ వచ్చింది. అన్నానగర్‌లో ఒక ఫ్లాట్ తీసుకుని కాపురం వుంటు న్నారు.

పేపర్ని ఆమె కిందపడేసి నిద్రపోయింది. తటాలున ఆమె మేల్కొంది. ఎవరో తలుపును తట్టుతున్నారు. ఆవులిస్తూ ఆమె వెళ్ళి తలుపు తెరిచింది.

పోలీస్ యూనిఫామ్‌లో వున్న వ్యక్తిని చూసి ఆమె వులిక్కిపడింది. అతడు లోపలకు వచ్చాడు.

"మీ పేరు ఉషా?" అడిగాడతను.

ఆమె తలాడించింది.

"నేను ఇన్‌స్పెక్టర్ రాఘవన్ని. మీ భర్తకు యాక్సి డెంట్ అయింది. ఆయన హాస్పిటల్లో వున్నాడు. ఉషా, ఉషా అని కలవరిస్తున్నారు. మీరు వెంటనే హాస్పిటల్‌కి రావాలి," అన్నాడతను.

"ఇన్‌స్పెక్టర్, ఎక్కడ యాక్సిడెంట్ అయింది?" అడిగిందామె.

"పాడీ ప్రాంతంలో. ఆయన్ని మేం ఇ.ఎస్.ఐ. హాస్పి టల్లో చేర్చాం అక్కడకి మీరు రావాలి!" అన్నా డతను,

“ఇన్‌స్పెక్టర్, పదండి!” అందామె కంగారుగా.

“వున్న డబ్బు పట్టండి!” అన్నాడతను.

“ఇంట్లో ఎక్కువగా డబ్బులేదు,” అందామె.

“హాస్పిటల్లో ఖర్చులకు వుపయోగ పడ్తుందని చెప్పాను” అన్నాడతను.

ఆమె పడగదిలోకి వెళ్ళింది. బొంబేలోవున్న ఆమె తండ్రి రెండువేలకు డ్రాఫ్ట్ పంపాడు. అది కాష్‌చేసి ఆమె ఒక కవర్లో దాచింది. ఏదేనా కొనుక్కో అన్నాడు తండ్రి! ఆమె యింకా ఏమీ కొనుక్కోలేదు. ఆమె ఆ కవర్ను హేండ్ బాగ్‌లో పడేసుకుంది.

పడగదిలోంచి ఆమె ముందు గదిలో కొచ్చింది. ఇద్దరూ బయటకు నడిచారు. ముందు తలుపుమూసి ఆమె తాళం వేసింది. బయటనున్న జీప్‌లో ఆమె కూర్చుంది.

అతడు జీప్‌ను బయటకు పోనిచ్చాడు. జీప్ ముందు ఎవరో సార్జంట్ మోటర్ బైక్ మీద పోతున్నాడు.

జీప్ స్పీడుగా వెళ్తోంది. ఆమె అతడి ప్రక్కనే మౌనంగా కూర్చుంది. అతడు జీప్‌ని ఆపాడు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. జేబురూమాల్ను ఆమె ముక్కు మీద అదిమి పెట్టాడు.

ఉష సీటుమీద వెనక్కి వాలి కళ్ళు మూసింది. అతడు ఆమె వంటిమీదున్న నగల్ను తీసుకున్నాడు. ఆమె చేతిలోవున్న రెండువేలును అతడు తీసుకున్నాడు. ఆమెను దింపి రోడ్డు వారగా పడేశాడతను.

జీప్ శరవేగంగా వెళ్ళిపోయింది!

# 6

పడక కుర్చీలో కూర్చున్న వాలి టెలిఫోన్ రిసీవర్ని యెత్తాడు.

"హలో, వాలి స్పీకింగ్?" అన్నాడతను.

"వాలి గారూ, నేను ఇన్‌స్పెక్టర్ రామన్ని!" అన్నాడతను.

"రామన్ బాయ్, ఏమిటి సంగతి?" అడిగాడు వాలి.

"రోడ్డు వారగా పడున్న ఒక యువతి మాకు దొరికింది. ఆమెను రాయపేట హాస్పిటల్లో చేర్చాం. మీరు వెంటనే ఇక్కడకు రండి!" అన్నాడతను.

"వస్తున్నాను," అన్నాడు వాలి.

వాలి XYZ కారును శరవేగంగా పోనిచ్చాడు. రాయపేట హాస్పిటల్ కాంపౌండులో అతడు కారును ఆపి దిగాడు.

ఇన్‌స్పెక్టర్ రామన్ అతడివైపు వేగంగా వచ్చాడు.

"రండి సార్! ఆమె గదిలోకి వెళ్దాం," అన్నాడు ఇన్‌స్పెక్టర్ రామన్.

వరండా మీద నడిచి వెళ్లాడు వాలి. ఎందరో రోగులు వరండా మీద పడుకుని వున్నారు. ఒక గదిలోకి వాలి ప్రవేశించాడు.

ఉష పరుపుమీద పడుకునివుంది. అతడివైపు విచిత్రంగా చూసింది. ఇన్‌స్పెక్టర్ రామన్ యింతకుముందే డిటెక్టివ్ వాలి వస్తాడని ఆమెతో చెప్పాడు.

"వాలిగారూ?" అంది ఉష.

"అమ్మాయి, ఏమైంది?" అడిగాడు వాలి.

కాస్సేపు ఆమె మాట్లాడ లేదు. బుగ్గమీసాలు నోట్లో చుట్ట!

ఉష అతడివైపు మౌనంగా చూస్తూ వుండిపోయింది.

"అమ్మాయి చెప్పు!" అన్నాడు వాలి.

"వాలి గారూ, నా భర్తకు స్కూటర్ యాక్సిడెంట్ అయిందనీ, అతడు హాస్పిటల్లో వున్నాడనీ చెప్పాడతను. తన పేరు ఇన్‌స్పెక్టర్ రాఘవన్ అన్నాడతను. అతడి జీప్‌లో నేను కూర్చున్నాను, అతడు నాకు స్పృహ లేకుండా చేసి నా నగలన్నీ పట్టుకుపోయాడు. ఆ జీప్ ముందు ఒక సార్జంట్ మోటర్ బైక్ మీద వెళ్ళటం నేను గమనించాను," అందామె.

"అతడు తీసుకున్న నగల విలువ ఎంతుంటుంది?"

"కనీసం ఆరువేలు. అదికాక నా బాగ్‌లో వున్న రెండువేలు అతడు తీసుకుపోయాడు," అందామె.

ఎనిమిది వేలు! వాలి ఆమె కేసి సీరియస్‌గా చూశాడు.

"జీప్ నంబరు చూశావా?"

"గుర్తు లేదు, సార్," అందామె.

ఆమె భర్త రామ్‌గోపాల్ గదిలో కొచ్చాడు. అతడిని చూడగానే ఆమె ఏడ్వసాగింది. రామ్‌గోపాల్ పరుపు మీద కూర్చొని ఆమెకు ధైర్యం చెప్పాడు.

"పోయిం దేదో పోయింది, డోంట్ బాదర్! మనం క్షేమంగా వున్నామని సంతోషించు" అన్నాడతను.

వాలి వాళ్ళిద్దరి కంకా చూశాడు.

"రామ్, నీకు యాక్సిడెంట్ కాలేదుగా?" అడిగాడు వాలి.

"నో సార్! అంతా హంబగ్! నా భార్యను వాళ్ళు మోసగించారు. ఆమె దగ్గరున్నదంతా వూడ్చుకు పోయారు," అన్నాడతను.

"వాళ్ళను త్వరలో నేను పట్టుకుంటాను," అన్నాడు వాలి.

"ప్లీజ్, తొందరగా పట్టుకోండి!" అన్నాడు రామ్ గోపాల్.

# 7

పడక కుర్చీలో కూర్చున్న వాలి రిసీవర్ని యెత్తాడు.

"హలో, వాలి స్పీకింగ్!" అన్నాడతను.

"వాలిగారూ, నేను గోవిందరావుని వాళ్ళను గురించి ఏదేనా తెలిసిందా?" అడిగాడతను.

"గోవిందరావు భాయ్, పరిశోధన సాగిస్తున్నాం. నేరస్థులు శాశ్వతంగా దాక్కోలేరు. ఎప్పుడో అప్పుడు మనకు దొరుకుతారు," అన్నాడు వాలి.

"వాలిగారూ! వాళ్ళను తొందరగా పట్టుకోండి," అన్నాడు గోవిందరావు.

వాలి రిసీవర్ని పెట్టేశాడు. అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఇన్స్పెక్టర్ రామన్ గదిలో కొచ్చాడు.

"రామన్ భాయ్, కూర్చో!" అన్నాడు వాలి.

"రామ్‌గోపాల్ తన భార్య ఉషను యింటికి తీసుకు వెళ్ళాడు, సార్! ఆమె నగలను వాళ్ళు అమ్మడానికి ప్రయత్నించ వచ్చు!"

"రామన్ భాయ్, పట్నంలోని నగల షాపులకూ, పాన్ బ్రోకర్లకూ ఆమె నగలను గురించి వివరాలు పంపండి. అటువంటి నగలను ఎవరేనా తెస్తే వెంటనే పోలీస్ రిపోర్ట్ యివ్వమనండి!" అన్నాడు వాలి.

"అలాగే సార్," అన్నాడు ఇన్స్పెక్టర్ రామన్.

# 8

కాంపౌండులో కారాపి డిటెక్టివ్ వాలి దిగాడు. చుట్ట పీలుస్తూ డాబా యింటివైపు చూశాడు. కొత్తగా కట్టిన యిల్లు. కుడివైపు ఫ్లాట్‌లో ఉష, రామ్‌గోపాల్ వుంటున్నారు.

ఎడం వైపున్న గుమ్మం ముందుకు వెళ్ళాడు వాలి. బూట్ల చప్పుడువిని అరవైఏళ్ళ స్త్రీ కిటికీలోంచి అతడి వైపు చూసింది. కిటికీ దగ్గర స్టూల్ మీద కూర్చుని ఆమె స్వెటర్ అల్లుతోంది.

"ఏం కావాలి, సార్?" అందామె.

నవ్వుతూ వాలి ఆమెకేసి చూశాడు.

"నీతో మాట్లాడాలి," అన్నాడతను.

"చెప్పండి, మీ మాటలు నాకు వినపడ్తాయి!"

"తలుపు తెరవడానికి భయపడ్తున్నట్లున్నావు!"

"పక్క వాటాలో వుండే అమ్మాయికి జరిగింది విన్నాక తెలిసిన వాళ్ళొస్తేగాని నేను తలుపు తీయ దల్చుకోలేదు!" అందామె.

"మీలా అందరూ జాగ్రత్త పడితే మోసగాళ్ళు పట్నం వదిలి మరో చోటికి పారిపోతారు!"

స్వెటర్ అల్లుతూ ఆమె వింటోంది, మాట్లాడుతోంది. పచ్చటి వ్రేలు అతడికి కనిపిస్తోంది. అతడు కిటికీదగ్గరగా జరిగాడు. ఆమె అతడివైపు సూటిగా చూసింది.

వేగంగా వెళ్ళి తలుపు తెరిచింది. గుమ్మం బయట కొచ్చి అతడి వంక చూసింది.

"వాలిగారూ, క్షమించండి! హాస్పిటల్‌కి మీరొచ్చారని ఉష చెప్పింది. లోపలకురండి!" అందామె.

హాల్లోకి వెళ్ళాడు వాలి. హాలు నీట్‌గా వుంది. సోఫాలో కూర్చున్నాడు. స్వెటర్ అల్లడం మానేసి ఆమె ఎదురుగా మరో సోఫాలో కూర్చుంది.

"ఉష పోలీస్ జీప్‌లో వెళ్ళడం నువ్వు చూశావా?"

"చూశాను, సార్. పోలీసు యిన్‌స్పెక్టర్ వచ్చి ఆమెనెందుకు తీసుకెళ్తున్నాడా అని సతమతమయ్యాను. ఆమె నాతో ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయింది!"

"జీప్ నంబరు గుర్తుందా?"

"ఆమె చూసుండాలే!"

"ఆమె చూడలేదు. ఆ క్షణంలో భయ్రంతో నిండుందామె మనస్సు!" అన్నాడు వాలి.

ఆమె వాలికి ఒక నెంబరు చెప్పింది.

నంబర్ని అతడు గుర్తుంచుకున్నాడు.

ఆమెకు థాంక్స్ చెప్పి బయటకు వెళ్ళాడు.

# 9

పడక కుర్చీలో కూర్చుని వాలి ఆలోచిస్తున్నారు. గిరి ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. రిసీవర్ని పెట్టేసి గిరి మరో నంబర్ తిప్పాడు. సంభాషణ ముగించి గిరి, వాలి పక్కకొచ్చాడు.

"వాలిగారూ, ఆ జీప్ నంబర్ బీడి ఫ్యాక్టరీది," అన్నాడు గిరి.

"దాన్ని ఎవరో దొంగిలించారా?" అడిగాడు వాలి.

"పొద్దుట ఎనిమిదింటికి దొంగిలించారట. వాళ్ళు పోలీసు రిపోర్టిచ్చారు," అన్నాడు గిరి.

వాలి ఆలోచిస్తున్నాడు. కారుముందు సార్జంట్

మోటర్ బైక్ మీద వెళ్ళడం ఉష చూసింది. జీప్ను ఎక్కడో వదిలేసి మోటర్ బైక్ మీద వాళ్ళిద్దరూ పోయి వుంటారు!

టెలిఫోన్ మ్రోగింది. గిరి రిసీవర్ని తీశాడు.

"మీకోసం!" అన్నాడు గిరి.

వాలి రిసీవర్ని అందుకున్నాడు.

"వాలి స్పీకింగ్!"

"ఇన్స్పెక్టర్ రామన్ని సార్. ఉషను అతడు తీసుకెళ్ళిన జీప్ అరగంట క్రితం పోలీసులకు దొరికింది. స్టీరింగ్ మీద వేలి ముద్రలు రుమాలతో బాగా తుడిచేశారు! ఆ జీప్ ఒక బీడీ కంపెనీదట!" అన్నాడు యిన్స్పెక్టర్.

"జీప్ ఎక్కడ దొరికింది?"

"కల్లీస్ ప్రాంతంలో."

"రామన్ భాయ్, చూద్దాం," అని వాలి రిసీవర్ని పెట్టేశాడు.

# 10

దిన పత్రికల్లో గోవిందరావుకు, ఉషకు జరిగినదంతా వివరంగా ముద్రించబడింది. రోడ్డు వారగా పడున్న ఉష ఫోటోనూ, హాస్పిటల్లో వాలితో మాట్లాడే సమయంలో తీసిన ఫోటోనూ పత్రికలు ముద్రించాయి.

ఒక పత్రికా విలేఖరి ఆమెతో యింటర్వ్యూ జరిపాడు.

"మద్రాస్లాంటి పట్నంలో యిటువంటి సంఘటనలు జరగడం శోచనీయం. పోలీసులు మేలుకొని శ్రద్ధ వహించి ఆ మోసగాళ్ళను, దొంగలను పట్టుకోవాలి!" అందామె విలేఖరితో.

ఫిలిం ప్రొడ్యూసర్ వామనరావు పత్రికలను చదివి టీపాయిమీద పడేశాడు. అతడి కూతురు ముస్తాబై హాల్లో కొచ్చి, సోఫా చేతిమీద కూర్చుని తండ్రివంక ఆప్యాయంగా చూసింది.

"నాన్నా కాలేజికి వెళ్తున్నాను. తర్వాత పిక్చర్ ప్రోగ్రామ్! రాత్రి ఆలస్యంగా వస్తాను," అందామె.

"నువ్వు వచ్చినదాకా నేను భోజనం చేయనమ్మా," అన్నాడతను.

రమణి అతడి ముద్దుల బిడ్డ. పెళ్ళయిన యిరవై ఏళ్ళకు ఆమె పుట్టింది. ఆమెకు రెండేళ్ళు వచ్చాక తల్లి మరణించింది. అప్పటినుంచీ ఆమె తండ్రి చేతుల్లోనే పెరిగింది.

"డ్రయివర్ని తీసుకెళ్ళమ్మా!" అన్నాడతను.

డ్రయివరుంటే తనూ, క్లాస్‌మేట్సూ స్వేచ్ఛగా మాట్లాడుకోలేరు.

"డ్రయివర్ వద్దు నాన్నా," అందామె.

రమణి ఫియట్ కారులో కూర్చుని తలుపు మూసింది.

వామనరావు సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

పదిహేను నిముషాలు దొర్లిపోయాయి. టెలిఫోన్ మ్రోగింది. వామనరావు లేచి రిసీవర్ని అందుకున్నాడు.

"హలో! వామనరావు హియర్," అన్నాడతను.

"వామనరావుగారూ, ఇన్‌స్పెక్టర్ టి. డి. రాజా ఫ్రమ్ మౌంట్‌రోడ్ పోలీస్టేషన్ స్పీకింగ్," అంది అటువైపు కంఠం.

"ఇన్‌స్పెక్టర్! ఏమిటి సంగతి?"

"వామనరావుగారూ, మీ అమ్మాయి రమణి పెద్ద ఏక్సిడెంట్ చేసింది. ఆమె నడుపుతున్న ఫియట్ కారు పేవ్ మెంట్ మీద కెక్కేసి యిద్దరు మనుష్యుల్ని విపరీతంగా గాయపర్చింది. లక్కీగా మీ అమ్మాయికి ఎక్కువగా దెబ్బలు తగల్లేదు."

"ఇన్ స్పెక్టర్, వెరీ బాడ్ న్యూస్," అన్నాడు వామనరావు విచారంతో కూడిన కంఠంతో.

"మీరు వెంటనే తయారవండి. ఒక కానిస్టేబుల్ని యింటికి పంపుతున్నాను. ఏక్సిడెంట్ జరిగిన స్థలానికి అతను మిమ్మల్ని తీసుకొస్తాడు."

"ఇన్ స్పెక్టర్, మా అమ్మాయి విషయంలో మీరు సహాయపడాలి. సాధారణంగా ఆమె కారును జాగ్రత్తగా నడుపుతుంది. ఇంత పెద్ద ఏక్సిడెంట్ జరగడం ఆశ్చర్యంగా వుంది."

"యూ ఆర్ రైట్, సార్. ఏదో లారీ ఆమె కారు పక్కనుంచి దూసుకుపోయింది. ఫియట్ కారు అందువలన పేవ్ మెంట్ మీద కెళ్ళవలసి వచ్చింది. ఇక్కడున్న కొంతమంది ఇదంతా నాకు చెప్పారు. మీరు రండి. వచ్చాక ఏం చెయ్యగలిగిందీ ఆలోచిద్దాం."

థాంక్స్ చెప్పి వామనరావు రిసీవర్ని పెట్టేశాడు. లోపలకి పరుగెత్తాడు. బట్టలు మార్చుకొని తన లెదర్ బాగ్ లో కొన్ని నోట్ల కట్టలను పడేసుకుని వామనరావు ముందు హాల్లోకొచ్చాడు. క్షణకాలం గోడకు వేళ్ళాడుతున్న తన భార్య ఫోటో వైపు అతడు చూస్తూ వుండిపోయాడు.

"లక్ష్మీ, అమ్మాయి ఏక్సిడెంట్ చేసిందట. దాన్నిం

టికి తీసుకురావడానికి వెళ్తున్నాను. దాన్ని నువ్వు తప్పక కాపాడతావనే విశ్వాసం నాకుంది,'' అన్నాడతను ఫోటోలో.

వామనరావు ముందు వరండామీదకు నడిచాడు. పోలీసు కానిస్టేబుల్ ఎదురయ్యాడు. అతడు గబగబా వెళ్ళి డాడ్జి కారులో కూర్చున్నాడు. కానిస్టేబుల్ని ముందు సీటుమీద కూర్చోమన్నాడు. డ్రైవర్ తులసింగం కారును బయటకు పోనిచ్చాడు.

# 11

రోడ్డమ్మట డాడ్జి కారు వేగంగా కదుల్తోంది. కానిస్టేబుల్ ఎలా వెళ్ళవలసిందీ డ్రైవర్‌కి చెబుతున్నాడు.

కానిస్టేబుల్ వెనక్కి తిరిగి వామనరావువంక నవ్వుతూ చూశాడు.

''పోలీసు డాక్టరు యింటికెళ్ళి కబురు చెప్పి వెళ్ళిపోదాం,'' అన్నాడు కానిస్టేబుల్.

''ఎక్కడా యిల్లు?''

''దోవలోనే, సార్.''

కారు స్పీడు తగ్గింది. గేటు తెరిచివుంది. కారును లోపలకు పోనీయమన్నాడు కానిస్టేబుల్. కారు గేటువైపు వెళ్తూండగా ఏదో బోర్డును చూశాడు వామనరావు.

''పోలీస్ డాక్టర్ పేరేమిటి?'' అడిగాడతను.

''రాజన్, సార్!''

తను చూసిన బోర్డుమీద రాజన్ పేరులేదు. వామనరావు మెదడులో అనుమానం మొలకెత్తింది. ఎన్నో క్రైమ్ చిత్రాలు అతడు నిర్మించాడు!

చేతిలోవున్న బాగ్ ను సీటులోపలకు నెట్టి దాచే శాడు. ఒక భవనంముందు కారు ఆగింది. మోటర్ బైక్ ఒకచోట ఆపబడివుంది.

కానిస్టేబుల్ దిగి లోపలకెళ్ళాడు. వామనరావు డ్రయివర్ వీపును తట్టాడు.

"తులసింగం, కారును వెనక్కి తిప్పి పోనీ! క్విక్!" అన్నాడతను.

డాడ్జి కారు వెనక్కి తిరిగింది. కానిస్టేబుల్, మరొ కతను బయటకు పరుగెత్తుకొచ్చారు. డాడ్జి కారు గేటు దాటింది. వామనరావు కారు ఆపమని కిందకు దిగాడు. తెరిచివున్న గేటును మూశాడు.

రోడ్డమ్మట వెళ్తూన్న కొందర్ని వామనరావు ఆపాడు. గేటుముందు అందరూ గుంపుగా నిలబడ్డారు.

వామనరావు డ్రయివర్‌తో ఏదో చెప్పి కారును వేగంగా పోనిచ్చాడు. సమీపంలో వున్న మందుల షాపుముందు కారాపి దిగాడతను. లోపలకెళ్ళి హోటల్ అశోకాకి ఫోన్ చేశాడు.

"వాలిగారు కావాలి," అన్నాడతను.

"వాలి స్పీకింగ్!" అంది అటువైపు కంఠం.

"వాలిగారూ, వెంటనే క్రిమ్స్ రోడ్డుకి రండి. ఆ దొంగల్ని ఒక భవనంలో వుంచి గేటు మూసేశాం," అన్నాడతను.

"వస్తున్నా," అన్నాడు వాలి.

డబ్బు చెల్లించి వామనరావు కారులో ఆ బిల్డింగ్ వైపు స్పీడుగా వెళ్ళాడు. గేటుముందు ఇరవై మంది వున్నారు. అంతలో XYZ కారొచ్చి ఆగింది. వామన రావు గేటును తెరిచాడు.

కారును వాలి వేగంగా లోపలకు పోనిచ్చాడు. సమీపంలో మోటర్ బైక్ వుంది. చుట్టు పీలుస్తూ వాలి కిందకు దిగాడు. వామనరావు పరుగెత్తుకొచ్చి అతడికి నమస్కరించాడు.

"వాలిగారూ, వాళ్ళిద్దరూ ఎక్కడో దాక్కొని వుంటారు," అన్నాడు వామనరావు.

వాలి కాంపౌండ్ నలువైపులా చూశాడు. ఇంటి ముందు గుమ్మం తలుపు లాక్ చేసివుంది. వాలి వెనక వైపు పరుగెత్తాడు. ప్రహారీ గోడదాకా వెళ్ళాడు. వెనుక వైపున మరో రోడ్డు ఉంది!

"అబ్బాయి, వాళ్ళు గోడదూకి యిటువైపునుంచి పారిపోయివుండొచ్చు," అన్నాడు వాలి వామన రావుతో.

"అవును సార్!" అన్నాడతను నిరుత్సాహంగా.

"డోంట్ బాదర్! బంగళాలో వాళ్ళు మోటర్ బైక్‌ను వదిలేశారు. అదెవర్దో మనం కనుక్కోవాలి," అన్నాడు వాలి.

వాలి ముందువైపుకు తిరిగివచ్చి మోటర్ బైక్‌ను పరీక్షించాడు. పాతబడిన మోటర్ బైక్!

వామనరావు వైపు చూసాడతను.

"జరిగినదంతా వివరంగా చెప్పు!" అన్నాడు వాలి.

వామనరావు అంతా చెప్పాడు.

"నీ కూతురు ఏ కాలేజిలో చదువుతోంది?" అడిగాడు వాలి.

"గవర్నమెంట్ కాలేజిలో."

వాలి ఎదురుగానున్న యింటి ముందుకెళ్లాడు.

"ఫోన్ చేసి అమ్మాయి క్షేమంగావుందని తెల్సుకో!" అన్నాడు వాలి.

వామనరావు ఆ ఇంటివాళ్ళ నడిగి కాలేజికి ఫోన్ చేసి మాట్లాడాడు. నవ్వుతూ వాలి ముందుకొచ్చాడు.

"వాళ్ళు క్రూక్స్ సార్. అమ్మాయి క్షేమంగా వుంది. వాళ్ళిద్దరూ నన్నూ, డ్రయివర్నీ ఏదో చేసి నా బాగ్ లో వున్న డబ్బు తీసుకుని పారిపోయేవారు! గాడ్ మమ్మల్ని సేవ్ చేశాడు," అన్నాడు వామనరావు.

వాలి వెంటనే ఇన్ స్పెక్టర్ రామన్ కి ఫోన్ చేసి మోటర్ సైకిల్ నంబరు చెప్పాడు.

"అది ఎవర్దో నాకు వేగంగా కావాలి!" అన్నాడు వాలి.

"మీ రెక్కడున్నారు?"

వాలి అడ్రెస్ యిచ్చి, టెలిఫోన్ నెంబర్ని చెప్పాడు.

"నేను మీకు ఐదు నిముషాల్లో ఫోన్ చేస్తాను" అన్నాడు ఇన్ స్పెక్టర్.

ఆలోచిస్తూ వాలి పచార్లు చేస్తున్నాడు. చుట్టపొగ గాలిలో పైకి లేస్తోంది.

# 12

గిరి కారును స్పీడుగా పోనిస్తున్నాడు. ప్రక్కన కూర్చున్న వాలి ఏమీ మాట్లాడ్డంలేదు.

కోడంబాకంలోని ఒక రోడ్డు వారగా గిరి కారును ఆపాడు. ఇరువైపులా వున్న రోడ్లను పరికించి, ఎడం వైపుకు కారును తిప్పాడు. ఒక ఇంటి ముందు కారును ఆపాడు.

వాలి కిందకు దిగాడు. ఇంటి నంబర్ను చూసాడు. ముందుతలుపు మూసివుంది. రెండు మెట్లెక్కి తలుపును తట్టాడు వాలి.

తెల్లటి దుస్తుల్లోవున్న ఒక స్త్రీ తలుపు తీసింది. ఆమె వయసు నలభైపైన వుంటుంది.

"రామం వున్నాడా?" అడిగాడు వాలి.

"తిరుపతి వెళ్లాడు" అందామె.

వెంటనే తిరుపతి వెళ్ళి అతనిని పట్టుకోడం అంత సులువైన పనికాదు!

"ఎప్పుడొస్తాడు?"

"తెలియదండి" అందామె.

"అతని మోటర్ సైకిల్ ఏమైంది?"

"ఆ మలయాళీకి అద్దెకిచ్చాడు."

"ఆ మళయాళీ ఎక్కడున్నాడు?"

"రామంకి తెలుసు."

"కాని రామం తిరుపతిలో వున్నాడు. రామం ఎవరి కద్దెకిచ్చాడో నాకు అర్జంటుగా కావాలి" అన్నాడు వాలి గంభీరంగా.

వాలి జబర్దస్తీగా లోపలకు వెళ్ళాడు. ఆమె గాభరాగా అతడివైపు చూస్తోంది. గిరి లోపలకు ప్రవేశించాడు.

"రామం గది ఏది?"

ఆమె ఒక గదివైపు చూపించింది. వాలి, గిరి ఆ గది లోకి జొరబడ్డారు.

చిన్నగది. కిటికీతలుపులు మూసివున్నాయి. గది తలుపులను తెరిచాడు. గదిలోకి బాగా సూర్యకాంతి వచ్చింది.

నేలమీద బొంతుంది. సెక్స్ పత్రికలు బొంత పక్కన కుప్పలుగా పడివున్నాయి. గదంతనూ వాలి, గిరి సోదా చేశారు.

గోడమీద పెన్సిల్‌తో ఏదో రాసివుంది. దాన్ని వాలి జాగ్రత్తగా చదివాడు.

"మీనన్, లెట్ బంగళా, మార్కెట్ వీధి, కోడంబాకం," అని రాసివుంది.

"గిరీ, అక్కడకు వెళ్ళాలి మనం" అన్నాడు వాలి.

ఇద్దరూ బయటకు పరుగెత్తారు. గిరి కారును వేగంగా పోనిచ్చాడు.

"గిరీ, రామం వాళ్ళ గురించి చెప్తాడని వూహించి ఆ యిల్లు విడిచి మీనన్ పారిపోయి వుండొచ్చు!" అన్నాడు వాలి.

కారు రోడ్డమ్మట దూసుకుపోతోంది. మార్కెట్ వీధమ్మట వెళ్ళి ఎర్రటి యింటిముందు కారాగింది. వాలి దిగి యింటివైపు చూశాడు.

పక్క వాటాలోవున్న ఒకతను వాలిముందు కొచ్చాడు.

"ఏం కావాలి, సార్?" అడిగాడతను.

"కుడివైపు వాటాలో వున్నవాళ్ళు!" అన్నాడు వాలి.

"మీనన్, మస్తాన్—వాళ్ళేనా?"

"వాళ్ళే!" అన్నాడు వాలి.

"రెండు పెట్టెలు పట్టుకుని వాళ్ళు ఇప్పుడే ఆటోలో పోయారు. త్రాగుబోతులు!" అన్నాడు తను కోపంగా.

"వాళ్ళు వెళ్ళి ఎంత సేపైంది?"

"ఐదు నిమిషాలు కూడా కాలేదు!"

"వాళ్ళు పట్టుకెళ్ళిన పెట్టెలు ఎటువంటివి?"

"ట్రంకు పెట్టెలు సార్! ఒకటి ఎర్ర పెట్టె రెండోది నీలంది."

వాలి వెనక్కి వెళ్ళి కారులో కూర్చున్నాడు. గిరి కారును వెనక్కి తిప్పి పోనిచ్చాడు.

XYZ కారు జట్ విమానంలా దూసుకుపోతోంది. అందరూ వింతగా కారు వైపు చూస్తున్నారు. కొన్ని కార్లు పక్కలకు కదిలి XYZ కారుకు సైడు యిస్తున్నాయి.

మౌంట్ రోడ్డమ్మట పోతోంది కారు. తోవలో కనిపించిన ఆటోలను వాలి పరికిస్తున్నాడు.

ముందు వెళ్తున్న ఆటోని కారు దాటిపోయింది.

"గిరీ మనకు కావల్సింది అదే!" అర్చాడు వాలి.

సడన్ బ్రేక్‌తో గిరి కారును ఆపాడు. కారు వెనకనే ఆటో ఆగింది. వాలి బయటకు దూకాడు. ఆటోలోని వాళ్ళు అతడివైపు భయంతో చూశారు. ఆటోవైపు వాలి కదిలాడు.

మీనన్‌ని యెడమ చేత్తో పట్టుకుని వాలి బలంగా లాగాడు. అతడు కింద పడ్డాడు. మస్తాన్ని కుడిచేత్తో గట్టిగా కొట్టాడు. ఇద్దర్నీ యీడ్చుకెళ్ళి XYZ వెనక సీటుమీద కూర్చోబెట్టారు.

నైలాన్ తాడుతో వాళ్ళ చేతులను వాలి బంధించాడు.

ట్రంకు పెట్టెలను గిరి డిక్కీలో పెట్టాడు. ముందు సీటుమీద కూర్చుని వాలి వాళ్ళిద్దరి వైపు కోపంగా చూశాడు.

గిరి కారును పోనిస్తున్నాడు.

"మమ్మల్ని మీరు అనవసరంగా బంధించారు. మేం చేసిన నేరం ఏమిటి?" అన్నాడు మీనన్.

"పోలీస్ హెడ్ క్వార్టర్స్‌కు వెళ్ళాక తెలుస్తుంది! గోవిందరావు, ఉష, వామనరావు, వాళ్ళు మిమ్మల్ని గురించి చెప్తారు!" అన్నాడు వాలి గంభీరంగా.

ఆరిపోయిన చుట్టను రోడ్డుమీదకు విసిరి వాలి పొడుగాటి మరో చుట్టను తీసి లైటర్‌తో వెలిగించుకున్నాడు.

XYZ కారు పోలీస్ హెడ్ క్వార్టర్స్ వైపు దూసుకుపోతోంది.

-: ఐ పో యిం ది :-



[పదవ భాగము]

రెండు నిముషాలు పరిశీలించి గదిలోంచి బైటికి వచ్చాను. "కాన్యోరాగురించి నీ అనుమానం తీరిందా మిస్టర్ భయంకర్!" అన్నాడు పెద్దగా నిట్టూర్చి తాళం చెవుల గుత్తి సఫారి కోటుజేబులో పెట్టుకుంటూ కోబ్రా.

"లేదు. యిప్పుడు కాఫీ సేవించాలి నేను. యింకా నీ నీగ్రో అనుచరుల కాటేజీలు వెతకాలి. అప్పుడుకానీ నా అనుమానం తీరదు."

అలవాటుగా భుజాలెగరేశాడు కోబ్రా నవ్వుతూ. "ఓ.కే. మిస్టర్ భయంకర్! రేపు రాత్రిదాకా నువ్వు నాకు బోసమ్ ఫ్రెండ్‌వి."

ఆ సాయంత్రాన్ని గాని అతని సేవకులు కటిరాళ్ళు వెతకడం, పరీక్ష చేయటం పూర్తికాలేదు.

ఫలితం...శూన్యమే!

నాలో బెంగ ఎక్కువైంది.

సిగరెట్టు వెలిగిస్తుండగా ఓ ఆలోచన తళుక్కున స్ఫురించింది...

ఈ రాత్రికూడా శాన్యోరా ఆకారం కనబడొచ్చు.

ఈసారి ఆమెను వ...ద...ల...కూ...డ...దు...

రాత్రి అంతా మేలుకొనివుండి కాపలా కాయాలి...

క్రిందటి రోజులా, పారిపోకుండా ఆమెను పట్టుకోవాలి. నిజంగా, ఆ ఆకారం శాన్యోరాయే అయితే ఆమె విచిత్ర ప్రవర్తనకు సంజాయిషీ అడగాలి.

ఆ ఆలోచన బాగానే తట్టింది నాకు.

కానీ...??

అసలు ఆ రాత్రి ఆ ఆకారం కనబడుతుందనే నమ్మకం ఏమిటి?

భయం...శంక...నాలో కదిలాయి.

ఏదీ వే, ఈ రాత్రి—'నిన్నటి రాత్రి సంఘటన' కోసం ఎదురుచూడ్డానికే బలంగా నిశ్చయించుకున్నాను.

* * *

అసహనంగా కదులుతున్నాను మంచంమీద—

గదిలో లాంతరు అర్ధచీకటిని పారద్రోలుతోంది.

నా దృష్టి కిటికీ అవతలి ప్రాంతంవైపు నిల్చింది.

నిన్నటి రాత్రిలా వర్షం లేదు.

బయట వెన్నెల-మిల్కి బల్బు కాంతిలా వుంది.

అడవిగాచిన వెన్నెల సామెత జ్ఞాపకమొస్తోంది.

కీ రాన్కి చలి విపరీతంగా తగుల్తోంది.

అయితే ఆ అడవిలో ఆ వాతావరణం అసహజం కాదు అని సరిపెట్టుకున్నాను వెచ్చని సిగరెట్ పొగ గుండెల్లోకి పీలుస్తూ.

అంతకు ముందు మోతాదులో సేవించిన 'టాషియా' కూడా వెచ్చదనాన్ని పంపుతోంది శరీరంలోని అన్ని భాగాలకూ.

కిటికీ అవతలి భాగంవేపు దేగలా చూస్తున్నాను.

అర్ధరాత్రి దాటుతోంది...

నాలో క్షణ క్షణానికీ నిరుత్సాహం ఆవరిస్తోంది...

నిన్న చూసింది కలేనా?

కోబ్రా మాటలు నిజమా?

అంతులేని ప్రశ్నలు వేధిస్తున్నాయి నన్ను.

చిరాగ్గా మంచంమీంచి లేచి సిగరెట్ బట్ విసిరి కొట్టాను. నైట్ గౌన్ లోవ్ పొట్టమీద గట్టిగాబిగించి, చేతులు వెనక్కి కట్టుకొని మంచం ప్రక్కగా వెనక్కి ముందుకీ పచార్లు చేయసాగాను.

ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డాను.

బయట ఏదో అలికిడయ్యింది ..

చటుక్కున కిటికీ వద్దకు గెంతాను.

నా గుండెలు ఎందుకో వేగంగా కొట్టుకోసాగాయి.

తళుక్కున మెరిసింది తెల్ల చీర!

ఇంటి వెనుక భాగంనుండి ముందు భాగంలోకి వచ్చి గేటువైపు గబగబా నడుస్తోంది ఆ ఆకారం! వెనకాల భాగం మాత్రం కనబడుతోంది. కాని...అదే నడక!!

వెనుకనుంచి చూస్తూండటంవల్లా, జుట్టు విరబోసుకుని

ఉండడంవల్లా చంపలు, ముఖం కనబడ్డంలేదు.

"శాన్యోరా! స్టాప్ దేర్!" అర్చాను కిటికీలోంచి. జవాబు లేదు...

గేటు తోసుకొని బయటకి నడుస్తోంది ఆ ఆకారం గబగబా!

ఆలస్యం చేస్తే మళ్ళీ మాయంకావచ్చు.

చటుక్కున తలుపులు తీసి బయటికి ఉరికాను.

లాగి విడిచిన బాణంలా గేటువద్దకు దూసుకుపోయాను.

అటూ ఇటూ ఊగుతున్న కొయ్యగేటును - వెనక్కి తన్ని బయటికి వచ్చి అటూ ఇటూ పరికించాను.

పది గజాల దూరంలో కదుల్తోంది ఆ తెల్లని ఆకారం.

చెట్ల మధ్యకు...అడవిలోకి...

"శాన్యోరా! ఆగు..." అరిచాను వెనకాల పరుగెడుతూ.

ముందు నడుస్తున్న ఆకారం గమనంలో తేడా వచ్చింది. నడకనుంచి ప...రు...గు...లోకి మారింది ఆమె కదలిక.

నాలో కోపం ఉవ్వెత్తున లేచింది.

రాకెట్‌లా పరిగెత్తి ఆ ఆకారంమీద విరుచుకు పడ్డాను.

ఆమె చేతులు గట్టిగా పట్టుకున్నాను, ముందుకి తూలబోయి నిలదొక్కుకుని.

గిరుక్కున వెనక్కి తిప్పాను ఆ ఆకారాన్ని!

ఆమె శాన్యోరాయే!!!

*   *   *

నా గుండెల్లో ఏదో అనిర్వచనీయమైన అనుభూతి శరీరమంతా కరెంటులా పాకింది.

వెన్నెల కాంతిలో చందమామలా ప్రకాశిస్తోంది కాన్స్యోరా ముఖం...చక్రాల్లాంటి ఆమె కళ్ళు భావగర్భితంగా, బాధాగర్భితంగా పలకరిస్తున్నాయి. నిత్యయవ్వనంతో మిసమిసలాడే ఆమె చెర్రీస్ పెదిమలు సన్నగా వణుకుతున్నాయి.

"మై డార్లింగ్...భయంకర్!" జారబోయిన కంఠాలతో కాన్స్యోరా నా దేహాన్ని లతలా పెనవేసుకుపోయింది.

"ఓహ్...కాన్స్యోరా! యిది కలా...నిజమా?" అస్పష్టంగా గొణిగాను ఆశ్చర్యానందాలతో ఆమె కోమల దేహాన్ని బలంగా, నామీదకు లాక్కొని చేతులమధ్య బిగించేస్తూ.

గుండెల్లో గువ్వలా ఒదిగిపోయి వెక్కి వెక్కి ఏడుస్తోంది కాన్స్యోరా...బంగారు తీగలాంటి ఆమెదేహం నా చేతులమధ్య బలహీనంగా వణకటం గమనించాను.

ఏదో చెప్పాలనీ...ఉద్వేగంతో, తీవ్రమైన ఎడబాటు తర్వాత కలుసుకున్నప్పుడు ఏర్పడే ఆనంద విషాదానుభూతులతో కాన్స్యోరా నోరు పెగల్లేదు.

కాన్స్యోరా! నువ్వు బ్రతికే ఉన్నావ్. జీవచ్ఛవంలా, ఈ అడవిలో తిరుగుతున్న నాలో మళ్ళీ నవజీవం పోశావ్. భగవంతుడు కరుణామయుడు కాన్స్యోరా!... నిన్ను మళ్ళీ నాకు దక్కించాడు." అరమోడ్పు కన్నులతో, ఉద్రేకంగా కాన్స్యోరా ఒళ్ళంతా తడుముతూ... అస్పష్టంగా...వేగంగా...మాట్లాడుతున్నాను.

"నన్ను క్షమించు భయంకర్! నీకు దూరంగా తిరుగుతూ, నీతో చెలగాటాలాడుతూ నిన్నటి రోజున నిన్ను

మానసికంగా చిత్రవధ చేసాను.'' అంటూ నాకు మరింత బలంగా హత్తుకుపోయి ముఖంమీదా, గొంతు మీదా, ఉద్రేకంగా ముద్దులతో నింపేసింది శాన్యోరా.

నా ఛాతి ఆమె కంటినీటితో తడిసిపోయింది... శరీరమంతా అతుక్కుపోయినా, శాన్యోరా శిరోజాల్ని అప్యాయంగా నిమిరాను. ''ఊరుకో శాన్యోరా! నీ ముఖంలో విచారం నేను చూడలేను. నువ్వు నాకు మళ్ళీ దక్కావ్. యిక మనం విడిపోటం అసంభవం...' మళ్ళీ వేడి రక్తం నాలో ఉబుకుతోంది. యికనుంచీ ఎలాంటి పరిస్థితులైనా ఒంటరిగా ఎదుర్కొగలను......''

''యూ ఆర్ మై వైఫ్ డియర్...ఏ జన్మకూ నీకు దూరం కాలేను'' వెక్కిళ్ళమధ్య ప్రేమగా పలికాయి శాన్యోరా పెదిమలు...

సరిగ్గా అదే సమయంలో...

''వెల్ మిస్టర్ భయంకర్ అండ్ శాన్యోరా!''

అన్న మాటలు వినబడ్డాయ్.

ఉలిక్కిపడి ప్రక్కకి చూశాను.

ఓ పెద్ద చెట్టు ప్రక్కనించి వచ్చి కోబ్రా నవ్వుతూ నిల్చున్నాడు. అతని వెనుక యిద్దరు నీగ్రో అనుచరులున్నారు. వారి చేతుల్లోని లాంతర్లు చటుక్కున ఆ ప్రదేశాన్నంతా కాంతివంతం చేసాయ్.

నాలో క్రోధం ఉవ్వెత్తున లేచింది.

రక్తం ముఖంలోకి తన్ని, బిగుసుకుపోయింది...''యూ ఆరే బ్లఫ్ మాస్టర్ మిస్టర్ కోబ్రా! నా శాన్యోరాను అధీనంలో ఉంచుకొని పెద్ద నాటకం ఆడావ్. ఆమె

నానుండి యింతకాలం దూరంచేశావ్!" శాన్యోరాను విడిపించుకొని రోషంగా కోబ్రావేపు గెంతాను.

"ఆఁ...ఆఁ...కూల్ డవున్ మిస్టర్ భయంకర్!" అన్నాడు అదే నవ్వుతో కోబ్రా.

తటాలున ఆగిపోయాను.

అతని చేతిలో యిప్పుడు పిస్టల్ మెరుస్తోంది "నీ శాన్యోరాని నలిగిపోకుండా తాజా పువ్వులా నా చేతిలో పెట్టినందుకు నువ్వు చూపాల్సిన ప్రతిఫలం యిదికాదు మిస్టర్ భయంకర్!" సవాల్ గా వినబడ్డాయి కోబ్రా మాటలు.

"నా రివీల్ యువర్ బ్లడీ యాంటిక్స్. ఎందుకు ఆ నాటకం ఆడావ్?" అన్నాను వెనక్కి నడిచి తిరిగి శాన్యోరాను దగ్గరకు తీసుకుంటూ.

"నేను కోరిన కోర్కెను నువ్వు తీర్చడానికి అంగీకరించలేదు. గట్టిపిండంలా అగుపించావ్. నా ఆశ అడుగంటిపోయింది. ముందుచూపుగా శాన్యోరాని రహస్యంగా బంధించడం మంచిదయ్యింది. యిప్పుడు ఆమెను పావుగా ఉపయోగించుకున్నాను. నీకు అందీ అందనట్లు ఆమెను ఆడించి నీలో ఆతృత, క్యూరియాసిటీ, యాంక్సైటీ, ఉధృతం చేశాను. ఆమెకోసం నువ్వేమయినా చేయగలవని, ఈ పరీక్షద్వారా నిర్ధరించుకున్నాను, చివరికి, ఈ రాత్రికి నీకు అందేట్లు చేసేను. యిప్పుడు యిద్దరూ కల్సి జాగ్రత్తగా ఆలోచించుకోండి. రేపు రాత్రిలోగా నా కోరికకు నీ ఒప్పుదల లభించాలి. ఎన్నో అవకాశాలున్నా నీ ప్రియురాలిపైన ఏవిధమైన అత్యాచారం చేయలేదు. చేయించబడలేదు...నా కోరిక

విషయంలో నిర్ణయం తీసుకోబోయేముందు ఆ విషయం కాస్త ఆలోచించు."

"అంతేకాదు. నరమాంస భక్షులనుండి ఆమెను కాపాడింది ఆరోజు వేటకు వెళ్ళిన నా అనుచరులే. స్పృహతప్పి పడివుందామె. స్పృహ తప్పి నీ విషయం తెల్సుకొని వెతికించినా నువ్వు కనబడలేదు. కారణం—నరమాంస భక్షకులకి 'మైగ్రేటరీ కారక్టర్' ఉంది. ఒక చోట స్థిరంగా ఉండరు. తర్వాత కథ నీకు తెల్సు" అంటూ ఆగాడు కోబ్రా.

"శాన్యోరా! అతను చెప్పింది నిజమేనా?" ఆమె వేపు లాలనగా చూస్తూ.

శాన్యోరా మౌనంగా నా భుజంమీద చెయ్యి వేసింది. "ఎస్ డియర్!" అంది తల పంకిస్తూ.

"మిస్టర్ కోబ్రా! నేను శాన్యోరాని వెంబడించినప్పుడు ఓ చెట్టువద్ద ఆమె మాయమయ్యింది. యిదెలా సాధ్యం?"

"వెరి సింపుల్. అక్కడ ఓ చిన్న అండర్‌గ్రౌండ్ సెల్ ఉంది. తలుపు, నేల రంగుతో కల్సిపోయే విధంగా కేమఫ్లేజ్ చేయబడింది."

ఎంత వెతికినా శాన్యోరా ఎందుకు కనబడలేదో యిప్పుడు అర్థమైంది.

"అసలక్కడ ఆ అండర్‌గ్రౌండ్ గది ఎందుకు తయారుచేసినట్లు?"

సమాధానంగా కోబ్రా నవ్వాడు. "నువ్వు అందులోకి వెళ్ళవలసినవాడివే. నా కోరిక తీర్చని పాత టూరిస్టులు అందులోనే ఖతం అయ్యారు.

రెండు క్షణాలు మౌనం వహించాను. శాన్యోరా చలికివణుకుతోండడం గమనించి, నా నైట్ గౌన్ విప్పి ఆమె భుజం చుట్టూ కప్పాను.

"శాన్యోరా! హౌ ఎబౌట్ ఎ సిగరెట్?" అడిగేను షర్ట్ జేబులోంచి సిగరెట్ పాక్ తీసి అందిస్తూ.

"యిప్పుడు వద్దు భయంకర్!" అందామె తల అడ్డంగా వూపుతూ. పాక్ తెరిచి ఓ ఫిల్టర్ సిగరెట్ పెదిమల మధ్య ఉంచుకొని మరోటి కోబ్రాకి ఆఫర్ చేసాను.

చేతులు ముందుకి చాపి అతని సిగరెట్లుకూడా ముట్టించాను. "థాంక్స్ ఫర్! ఎవ్వరి థింగ్ మిస్టర్ కోబ్రా! నీ కోరిక గురించి నీకనుకూలంగా ఆలోచిస్తాను" అన్నాను సాలోచనగా తల ఊపుతూ.

"వెరీవెల్ మిస్టర్ భయంకర్! నా మంచిని గురించావ్ ఐయామ్ వెరీ హాపీ నౌ. రెండు టాఫియా బాటిల్సు యిస్తాను. ఈరాత్రి మీ గదిలోనే ఉండి బాగా ఎంజాయ్ చేయండి. అయితే మీకు స్వేచ్ఛ ఉండదు నా కోరిక తీరేదాక. కాపలా ఉంటుంది మీ గది గుమ్మం దగ్గర. నౌ లెట్స్ మూవ్" అన్నాడు పిస్టల్ని ఊపుతూ కదలమన్నట్లుగా సైగ చేస్తూ.

శాన్యోరా భుజం చుట్టూ చేతులు వేసి, సిగరెట్ పీలుస్తూ ముందుకి నడిచాను.

* * *

తలుపులు గడియవేసాను లోపల...

శాన్యోరా అలసటగా మంచం మీద చతికిలబడి తన బాబ్డ్ హెయిర్ని రెండు చేతుల్తో వెనక్కి తోసుకుంది.

టాఫీయా బాటిల్స్ టేబుల్ మీద పెట్టి మంచం మీద ఉన్న శాన్యోరాను ఉద్రేకంగా చూస్తున్నాను.

నా చూపుల్లో ఎన్నో సంవత్సరాలపాటు నిరీక్షించడంవల్ల ఏర్పడే ఆత్రుత, ఆప్యాయతా ఉన్నాయి.

“డార్లింగ్! ఆర్ యు ఓ. కే!” శాన్యోరా కంఠం పల్కింది బెంగగా...

నవ్వుతూ తల ఊపాను. “ఎస్స్-హనీ! మొదట్లో మాత్రం జ్వరం వచ్చింది. అయితే కోబ్రా యింట్లోని మందులు ఆహారం పడిన తర్వాత తగ్గింది. ఒకటి మాత్రం నిజం శాన్యోరా! నువ్వు రోజూ, జ్ఞాపకం వచ్చేదానివి. మనం కల్సిచేసిన సాహసాలు, ఎదుర్కొన్న ప్రమాదాల జ్ఞాపకాలూ, తెరలుతెరలుగా జ్ఞాపకం వచ్చి తియ్యని గాయాలుగా అనిపించేది.”

“సేమ్ విత్ యూ భయంకర్! యిలా కూర్చో” అందామె కుడిచేతిని పట్టుకుని మెల్లిగా నిమురుతూ.

ఆమె శరీరాన్ని తాకుతూ ప్రక్కగా కూర్చున్నాను. నా కుడిచేయి సాచి ఆమె బుగ్గలు నిమిరాను. “శాన్యోరా! నేను నిజంగా ప్రేమించలేదేమో?” అన్నాను జీర కంఠంతో.

నా వేపు వింతగా చూసింది శాన్యోరా. “ఎస్ డియర్! నిజమో_అబద్ధమో నువ్విక లేవని ఓ నిర్ణయానికి వచ్చాక కూడా నా జీవితాన్ని చాలించలేకపోయాను. ఐ థింక్ అయామ్ ఎ ఫాల్స్ లవర్” మెల్లిగా పలికాను ఎటో చూస్తూ.

“ఛీ! తప్పు భయంకర్! అలా చేసివుంటే నిజంగా హర్షించేదాన్ని కాదు. ఒక స్త్రీకోసం అంతం చేసుకో

వల్సినది కాదు జీవితం'' వేదాంతిలా పల్కింది శాన్యోరా తన చేతిలోని నా చేతిని నిమురుతూ.

"శాన్యోరా! నన్నెంతగానో మార్చేసావ్. జైల్లో ఉన్న మేజర్ భయంకర్‌కీ, నీ ఎదురుగావున్న భయంకర్‌కీ ఎంతో వ్యత్యాసముందిప్పుడు. బ్రతుకు మీద తియ్యని ఊహలు ఏర్పడతాయి నీ సన్నిధిలో వుంటే. ఆనాడు...ఆనాడు...ఓ యువతిని రేప్ చేసిన భయంకర్నైనా నేను..." నా మాటలు పూర్తికాక మునుపే శాన్యోరా అరచేయి టక్కున నా నోటిని కప్పేసింది. "భయంకర్! కొందరికి గతం తియ్యనిది. కొందరికి బాధకరమైనది.

రెండోది మనసు వర్తిస్తుంది. దాన్ని యిప్పుడూ నువ్వు తవ్వుతూ కూర్చుంటానంటే నేను తప్పక బాధపడతాను" అన్నదామె నిశ్చలంగా.

పసివాడిలా ఆమెకేసి చూసాను.

అవునన్నట్లు తల పంకించిందామె. "ఎస్స్ డార్లింగ్! గాడ్ ఈజ్ గ్రేట్! దేవుడు మనల్ని ఈ రోజు కలిపాడు. యికనించి భవిష్యత్తు గురించి ఆప్టిమిస్టిక్‌గా ఆలోచిద్దాం."

"ఓ. కే." భారంగా నిట్టూర్పు విడిచి మంచం మీద వాలాను.

తోళ్ళ పరుపు మెత్తగా తగిలింది.

శాన్యోరా కదిలి దగ్గరగా జరిగింది. వెచ్చటి శాన్యోరా ఊపిరి నా ఛాతికి తగుల్తోంది. ఆమె చేతిని నా వీపు చుట్టు వేసుకున్నాను.

ఆమెను కౌగలించుకుంటూ, ఆమె ముఖంలోకి

చూసాను. "శాన్యోరా! కోబ్రా కోరిక ఏం చేద్దాం?" అన్నాను ఆ విషయం జ్ఞాపకం వచ్చి.

"భయంకర్! ఎలా ఒప్పుకోగలవ్ ఆ కోర్కెను? కోబ్రా కోరిక బార్బేరియస్" అంది క్లిష్టంగా శాన్యోరా.

"నేనో నిర్ణయానికి వచ్చాను" అన్నాను తగ్గు స్వరంతో ఆమె అందమైన శిరోజాలతో ఆడుకుంటూ.

"ఏమిటి భయంకర్?" అందామె ఆతృతగా నా ముఖంలోకి చూస్తూ.

ఒక్క క్షణం ఆగి "చెప్తాను. మనం—తప్పించుకో వాలి."

"ఎలా? కోరికకు ఒప్పుకున్నట్లు నాటకమాడా?" అదే మందస్థాయిలో అడిగింది శాన్యోరా.

"ఆ దారి లాభంలేదు. కోబ్రా అంత అమాయకుడు కాదు. రేపురాత్రిదాకా మనం ఆలోచించుకోడానికి టైంయిచ్చాడు కోబ్రా. ఈలోపునే మనం యిక్కడ్నించి చెక్కేయాలి" అన్నాను దృఢంగా.

"ఎలా?" అంది శాన్యోరా రహస్యంగా.

"రేపు చెప్తాను. మనం చాలా ఎడబాటు తర్వాత కల్సుకున్నాం. ఆ టాపిక్ వెంటనే మర్చిపో" అంటూ ఆమెను దగ్గగా లాక్కున్నాడు.

* * *

ఉదయం పదిగంటలయింది...

బయట తీవ్రమైన ఎండ—కిటికీలోంచి గదిలోకి చొరబడ్డానికి విఫల ప్రయత్నం చేస్తోంది.

శాన్యోరా, నేనూ కూడబలుక్కుని మంచం మీద కూర్చున్నాం.

కిటికీ కమ్మీల మధ్య పొగలు కక్కుతున్న రెండు కాఫీ కప్పులు వుంచి లోపలికి జరిపాడు ఓ నీగ్రో కాపలా వాడు.

"ఏమిటది?" అడిగాను.

"కాఫీ" అన్నాడు ముక్తసరిగా నీగ్రో బయటనుంచి.

"తెలుసు. కాని తలుపు తీసి యివ్వొచ్చుగా?" అన్నాను కోపంగా.

"బయట తాళం వేసాను. మీరు బయట తిరక్కూడదు" అన్నాడతను రైఫిల్ చూపిస్తూ.

"ఎందుకు తిరక్కూడదు?" అన్నాను కాఫీ కప్పులు అందుకుని ఒకటి శాన్యోరాకిస్తూ.

"అదేం నాకు తెలియదు మా యజమాని కోబ్రా ఆర్డర్స్."

"ఎప్పుడు వస్తాడు కోబ్రా."

"తెల్లవారు ఝామునే వెళ్లారు, రాత్రి ట్రాప్స్‌లో ఏం పడ్డాయో చూసుకోడానికి. మరో అరగంటలో వచ్చేస్తారు."

కాఫీ తాగడం ముగించి అడిగాను. "మేం కాల కృత్యాలకోసం బైటకు వెళ్ళాలి."

"ఏమిటి?"

"కాలకృత్యాలు."

"అంటే."

రెండు వేళ్ళు చూపించాను. శాన్యోరా చిటికిన వేలు చూపించింది.

అర్థమైంది అతనికి.

"వీల్లేదు." అన్నాడు తల అడ్డంగా ఊపుతూ.

"ఫూల్! మీ యజమాని బయటికి పంపాద్దన్నది ఈ విషయం గురించి కాదు."

"ఏమో దానిగురించి నాకు చెప్పలేదు. మరో అర గంట ఆగండి. అప్పుడే స్నానాలు, టిఫినూ కూడా. అపుడుదాకా తాళం తియ్యను."

"తియ్యవూ?" అరిచాను కోపంగా.

"తియ్యను" అన్నాడతను తల అడ్డంగా ఊపుతూ.

"పోన్లే. అగ్గిపెట్టె అయిపోయింది. ఉందా నీదగ్గర" అన్నాను సిగరెట్ పాకెట్ జేబులోంచి తీసి, ఓ సిగరెట్ పెదిమల మధ్య వుంచుకుంటూ.

మౌనంగా నిక్కరు జేబులోంచి అగ్గిపెట్టెతీసి కిటికీ లోంచి లోపలికి విసిరాడతను.

అందుకొని—అగ్గిపుల్లతీసి సిగరెట్ ముట్టించాను.

"కావాలా?" అన్నాను సిగరెట్ పాకెట్ చూపిస్తూ.

"వద్దు. ఉన్నయ్ నాదగ్గర."

"అగ్గిపెట్టె ఎందుకు అడిగానో తెలుసా?"

"సిగరెట్ కాల్చుకోడానికి."

"కాదు" అన్నాను హిట్లర్ కంఠంతో గంభీరంగా.

విచిత్రంగా చూసాడు నీగ్రో కిటికీ అవతల్నుంచి.

లేచి నిలబడి టేబుల్ మీంచి ఓ బాటిల్ తీసాను.

"ఆ సీసాలో ఏముంది?"

"టాఫీయా" అన్నాడతను.

"ఆ యిల్లు దేంతో కట్టారు?"

ఈసారి పిచ్చివాడివేపు చూసినట్లు చూసేడు నీగ్రో నావంక.

"ఎందుకు ఈ ప్రశ్నలన్నీ?"

"చెప్పేముందు. తర్వాత చెప్తా విషయం."

"గోడలు మట్టితోను, సీలింగు, కిటికీలు చెక్కలతోటీను."

"ఈ టూఫియాతో సీలింగునీ, కిటికీనీ తడిచేస్తాను. తర్వాత 'నువ్విచ్చిన' అగ్గిపెట్టెలోంచి ఓ పుల్ల తీసి వెల్గించి వాటిమీద పడేస్తాను. అప్పుడు ఏమాతుంది?"

"అంటుకుంటుంది."

"అంటుకోడంకాదు. తగలబడుతుంది" అర్చాను కోపంగా.

"అప్పుడు ఎన్నో నెలలనుంచి వెనకాల గదుల్లో మీ యజమాని దాచిన లక్షలు విలువచేసే సామగ్రి ఏమాతుంది? 'నీ ప్రాణం' ఏమాతుంది!"

కాస్సేపు గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు నీగ్రో.

"తాళం తీస్తాను. మీ పన్లు ముగించుకొని వచ్చేయండి జాగ్రత్తగా. మీరు పిచ్చివేషాలేస్తే కాలిమీద పేలుస్తాను."

"అదేం?" అన్నాను వింతగా చూస్తూ.

"మీరు ఏమన్నా హడావుడి చేస్తే కాళ్ళమీద కాల్చమన్నాడు మా యజమాని."

ఆ నీగ్రో అమాయకుడని అర్థమైపోయింది నాకు. కోబ్రా అలా చెప్పడానిక్కారణం — మాతో తన అవసరం అలాంటిది.

శాన్యోరాకేసి తిరిగి చిన్నగా నవ్వాను.

ఆమెకూడా నవ్వుతూ నీగ్రోవంక చూసింది.

"ఆల్ రైట్! తలుపుతియ్!" అందామె.

కిటికీవద్ద నీగ్రో ముఖం మాయమైంది.

బూట్ల శబ్దం కదిలిన చప్పుడయ్యింది...

క్లిక్‌మన్న తాళం చప్పుడు...

తలుపు తీసిన శబ్దం...

"రండి," అన్నాడతను రైఫిల్ నావేపు గురి-పెడుతూ.

యిద్దరం బయటకి నడిచాం.

* * *

కోబ్రా నివాసానిక్ని వెనుకవైపునే ఉంది లావెట్రీ కూడా.

రెండు భాగాలుగా ఉంటుందది.

అది ఓపెన్ లావట్రీస్!

లోపల ఎవరేనా నిలబడితే బయట మనిషికి అతని తల కనబడుతుంది. రేకు తలుపులు!!

రెండు తలుపులూ తెరుచుకుని యిద్దరం రెండు పార్టిషన్స్‌లోకి ప్రవేశించాం.

రైఫిల్‌తోపాటు బయట నిలబడిపోయాడు నీగ్రో.

బయటి వ్యక్తికి కనబడకుండా, డోర్ వెనుక వంగి నిలబడిపోయాను.

ఒకటి...

రెండు...

మూడు నిముషాలు భారంగా దొర్లాయి.

ఉన్నట్టుండి ప్రక్క భాగంలోంచి శాన్యోరా ఆర్తనాదం కెవ్వున వినబడింది!!

"ఏమయింది?" బయటి నీగ్రో కంఠం విన్పించింది.

"కట్లపాము...ప్లీజ్ త్వరగా రా!" కేకలు పెడుతోంది శాన్యోరా; కంగారుగా.

దగ్గరవుతున్న బూట్ల చప్పుడ్ని గ్రహించాను.

ప్రక్క లావెట్రీ తలుపు తెరుచుకున్న శబ్దం కిర్రున వినబడింది.

"ఎక్కడ పాము?"...నీగ్రో కంఠం...

"అక్కడ"

అంతే!

శాన్యోరా కరాటే సింహనాదం విన్పించింది. ఆ వెనుకే "మ్మ్..." అన్న సన్న మూలుగు...

అర్థమైంది నాకు.

చాలా రోజులనుంచి పని దొరకలేదు శాన్యోరా చేతులకి. కరాటే ఛాప్స్ నీగ్రోని పడగొట్టి ఉంటుంది.

ముందు జాగ్రత్తగా పాంటు జిప్పు లాక్కుంటూ బయటికి వచ్చాను. అంతే!

నా గుండెలు దడ దడలాడాయి.

గేటు తెరుచుకొని, ఖాకినిక్కరూ, బనియన్ ధరించిన మరో నీగ్రో వస్తున్నాడు రైఫిల్ మోసుకుంటూ...

అప్పటిదాకా అతను ఎక్కడ ఉన్నాడో నాకు తెలియదు.

యిక ఆలస్యం చేయకూడదు...

తలుపుల ప్రక్కగా నడుస్తూ జేబురుమాలు తీసుకొని నోటికడ్డం పెట్టుకుని, తుడుచుకుంటున్నట్లుగా నటిస్తూ గబగబా మాట్లాడాను.

"శాన్యోరా! మరొకతను. రెండు క్షణాలు ఆపుతాను జంప్ బాక్ సైడ్. శబ్దం చేయక!"

గబగబా వచ్చాడు నీగ్రో.

(సశేషము)

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యాలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచురించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కథకు రు. 100/-లు, ఉత్తమ జోక్‌కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషాలు

## "ట్రయల్"

ఆ కోర్టు జనంతో కిటకిటలాడుతోంది. అదో మర్డర్ కేసు. నిందితుడు పల్లెటూరి వాడైనా బలే గడుసరి. గవర్నమెంటు వకీలునే హడలగొట్టేస్తున్నాడు. వాళ్ళిద్దరి సంభాషణ యిది.

"హత్య జరిగిన టైంలో నువ్వక్కడ లేవనీ పొరుగూరిలో వున్నావని వాదిస్తున్నావు. నీకు సాక్ష్యం ఎవరున్నారు?" అన్నాడు వకీలు.

"మా అల్లుడు, బిడ్డ, వాళ్ళ అత్త మామలు సాక్ష్యం వున్నారు. కావలిస్తే పిలిపించండి." అన్నాడు నిందితుడు.

"వాళ్ళంతా బంధువులు నీ పరంగానే సాక్ష్యం చెప్పొచ్చు. కాగా నువ్వు హత్య జరిగిన పల్లెలోనే ఆరోజు వున్నావని మా వద్ద సాక్ష్యం వుంది." అన్నాడు వకీలు.

"నువ్వా రోజు పల్లెలో వున్నది నిజం, నీకూ హతుడికీ చాలాకాలంగా వైరం వుంది. అతన్ని చంపేస్తానని నలుగురిలో ఒకసారి అన్నావు కూడాను," అన్నాడు మళ్ళీ వకీలు.

"మాటవరుసకు కోపంలో అనివుండవచ్చు. అన్నంత మాత్రాన నిండుమనిషిని ఎవరైనా చంపేస్తారా? చంపేవాడు చెప్పి చంపుతాడా? మీ వెర్రికాకపోతే!" అన్నాడు నిందితుడు.

"చెప్పావు కాబట్టే, చంపాలని పట్టుపట్టావు. పొరుగూరికి వెళ్తానని యింట్లో చెప్పి వెళ్ళావు. హతుడు పొలంలో ఒంటరిగా దొరికాడు. చెట్టుకానుకొని కునుకు తీస్తున్న మనిషిని తలమీద రాతితో కొట్టి చంపావు." అన్నాడు వకీలు.

"అంతా అబద్ధం." అన్నాడు నిందితుడు కోపంగా.

"అబద్ధం అయితే నువ్వు ఆ వుదయం అదే మార్గాన వెళ్ళటం అబద్ధమా?" అన్నాడు వకీలు.

"మరి పొరుగూరికి వెళ్ళాలంటే అదే మార్గం" అన్నాడు నిందితుడు.

"నువ్వెళ్ళేటప్పుడు నీకు హతుడు అగుపించలేదా?"

"లేదు నాకు ఆ వైపు ధ్యాసేలేదు. తలవంచుకొని చక చక వెళ్ళాను."

"అతడి పొలం వైపు పొరపాటుగానైనా చూడలేదా?"

"లేదు" అన్నాడు నిందితుడు దృఢంగా.

"అయితే పొలం ప్రక్కనే రోడ్డులో నీవు పారేసిన చుట్ట దొరికింది మరి!"

"చుట్టకాల్చడం అయిపోయి వుంటే అక్కడ విసిరేసి వెళ్ళానేమో!"

"అది సరే. నువ్వెంత పెద్దమనిషివైనా మరి రక్తం అయిన చేతుల్ని మంచినీళ్ళ బావిలో కడుక్కోంటా వేమిటయ్యా!"

"అబద్ధం. నేను చేతులు కడుక్కొంది పంటకాలువలోనైతే...." అంటూ నిందితుడు నాలుక కొరుక్కున్నాడు పప్పులో కాలేసినందుకు.

—కె. అన్వర్‌భాషా, ధర్మవరం



